# జాషువా కలం చెప్పిన కథ



PSBH ప్రజాశక్తి బుక్‌హౌస్
27–1–64, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ –520 002,
ఫోన్ : 0866 – 2577533.

గుఱ్ఱము వారి వంశమున గొఱ్ఱెల కాపరివై జనించి యా
మొఱ్ఱి కులంబునం గలసి భూప సభాంతర గౌరవాఢ్యులన్
కుఱ్ఱల గాంచి నీవిచట కూర్చిన కీరితి, చందమామలో
ఇఱ్ఱిని గొఱ్ఱెగా సలిపె యెట్టి తపస్సు ఘటించినాడవో -



జాషువా జననీ జనకులు వీరయ్య-లింగమాంబ

"కన్న ఋణంబు దీరెకొడకా ! కనుగొంటిని విన్నకొండలో
నిన్ను బహూకరించు మహనీయ మహంబును కన్నులార" నం
చన్న పదంబు జ్ఞప్తికలదాజననీ! యటులాడి నీ ఋణం
బున్నతిజేసితి ఇట్టికృతులు ఊడ్చునే నీఋణమున్ సహస్రముల్

**Title** : Joshuva kalam cheppina katha

**Author** : Hemalatha Lavanam

**©** : ATHEIST CENTRE

**ప్రచురణ సంఖ్య** : 1441

**మొదటి ముద్రణ** : 1998, నాస్తిక కేంద్రం, బెంజిసర్కిల్, విజయవాడ -10,
ఫోన్ : 0866-2472330, సెల్: 09848458220
Email : positiveatheist@gmail.com
www.atheistcentre.in

**ప్రజాశక్తి ప్రథమ ముద్రణ** : డిసెంబర్ 2016

**వెల : ₹. 130/-**

**ప్రతులకు**

PSBH

**ప్రజాశక్తి బుక్‌హౌస్**

27-1-64, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ -520 002, ఫోన్ : 0866 - 2577533.

**బ్రాంచీలు**

విశాఖపట్నం, కాకినాడ, విజయవాడ, గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, తిరుపతి.

**ముద్రణ**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ
website : www.psbh.in

124076



*They also serve who stand and wait*

**మాకై వెనుకనే వుండి వేచి చూచే మైత్రికి**



**జాషువా జీవన తత్వానికి**

**కవితా తత్వానికి నా భాష్యం**

**- హేమలతా లవణం**

# విషయసూచిక

# ప్రచురణకర్తల మాట

తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసినవారిలో ప్రసిద్ధులు గుర్రం జాషువా. సామాన్యుల నాల్కలపై కూడా నర్తించే పద్యాలు రాశారు జాషువా. అప్పటివరకూ సాహిత్యంలోకి రాని సరళమైన, జనసామాన్యం వాడే అనేక తెలుగు పదాలు జాషువా పద్యాలలో చూస్తాం. అగ్రకుల పండితులకే పరిమితమైన పద్య నిర్మాణ విద్యపై పట్టు సాధించిన జాషువా తెలుగు పాఠకలోకానికి కొత్తలోకాన్ని చూపించారు. ప్రకృతి వర్ణనలతో, సౌందర్యాల ప్రస్తావనలతో నిండిపోయిన పద్య ప్రపంచాన్ని సామాన్యుల కాళ్ళ దగ్గరకు లాక్కొచ్చారు జాషువా. తను ఎదుర్కొన్న సామాజిక జీవితంలోని అనేక అంశాలను వస్తువులుగా చేసుకొని అద్భుతమైన పద్యాలు సృష్టించారు.అటువంటి పద్యాలలో కొన్నిటిని విశ్లేషిస్తూ సాగిన రచనే ఈ 'జాషువా కలం చెప్పిన కథ'.

గుర్రం జాషువా గారాలపట్టి ఈ పుస్తక రచయిత్రి హేమలతా లవణం. జాషువా తన వీలునామాలో తన రచనల హక్కులను హేమలత పేర రాశారు. ఆ బాధ్యతను తన చివరి క్షణం వరకూ హేమలత నెరవేర్చారు. తన తండ్రి రచనలను అందరికీ అందుబాటులోకి తీసుకురావడానికి 'జాషువా ఫౌండేషన్' స్థాపించి విశేషంగా కృషిచేశారు. పాఠకులకు తెలియని ఈ పద్యాల నేపథ్యాన్ని, జాషువా దృక్పథాన్ని ఆసక్తికరంగా హేమలత ఈ పుస్తకంలో వివరించారు. గుర్రం జాషువా సాహిత్యాన్ని అధ్యయనం చేసేవారికి, జాషువా అభిమానులకు ఈ పుస్తకం ఎంతో విలువైన సమాచారం ఇస్తుంది. గుర్రం జాషువా రచనలపై వచ్చిన విలువైన విమర్శనా గ్రంథాలను ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన విషయం పాఠకులకు విదితమే. ఆ పుస్తకాలతో పాటు 'జాషువా కలం చెప్పిన కథ' కూడా తెలుగు పాఠకులకు అందించగలుగుతున్నందుకు సంతోషాన్ని వ్యక్తం చేస్తున్నాం.

ఈ పుస్తకం పునర్ముద్రణకు అవకాశం ఇచ్చిన నాస్తిక కేంద్రం వారికి ధన్యవాదాలు. పాఠకులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

*– ప్రజాశక్తి ప్రింటర్స్ & పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్*

# వినుకొండ

**శ్రీరాముఁడే కొండశిఖరానఁ గన్నీట**
**నాలించె సీతాపహరణగాథ**
**దాటించె నేవీటిదాపున ఐతమ్మ**
**పట్టి, మేల్పొట్టేలి వాహనంబు**
**కోటకొమ్మలమీఁద గ్రుచ్చినా రేవీటి**
**తెలుఁగురాజులు విరోధుల శిరాలు**
**ముత్యాలతో నారఁబోసినారేవీటి**
**నృపతు లేటేటఁ బండిన యశస్సు**

**భాస్కరుని దానధార లేపట్టణంబు**
**చారు చరితకు బంగారునీరు బోసె**
**అట్టి వినుకొండ కడుపునఁ బుట్టుకతన**
**ధన్యుఁడను నేన! యుత్తమోత్తముఁడ నేన!**

ఇవాళ జీవితపు చరమాంకాన నిలబడి నావ్యథిత హృదయగాథను అనేక మార్లు వినిపించిన నీకు ఈసారి నా విజయగాథను వినిపించాలని..... యీ విశ్వంలోని ప్రతీ మానవునికీ స్వేచ్ఛగా, గౌరవంగా జీవనం సాగించే హక్కూ, అధికారమూ వుందని నిరూపించాలనీ... కులం, జాతి, మతం, ఇవి ఏ కళాకారుని, కవిని పుట్టింపలేవని, కవిగా, కళాకారునిగా, గాయకునిగా ఎదగడానికి యివి అడ్డుకాదని నిరూపించాననీ.... కవి వాక్కును, గాయకుని కంఠాన్ని ఆపగల, శాసించగల శక్తీ, అధికారమూ, ఏ ఏలికకూ లేదని....

కర్మ సిద్ధాంతంతో నా నోరు నొక్కలేరని... ఎవరి నోరూ మూయలేరని.... అది స్వార్థపరుల కల్పనని.... నిరూపణ చేస్తున్నాను... మరొక్క సత్యం విను...."భయపడే వాడిని చూచి వెక్కిరించే సమాజం.... భయపడని వానికి బానిస"

ఇవాళ కవితా కీర్తి శిఖరంపై నిలచి నా కథ వినిపిస్తున్నాను. జీవితం సుఖదుఃఖాల సమన్వితం – తీపి, చేదుల కలయిక అంటారు. ఇవి నాకు సమపాళ్ళలో లభింపలేదు. దుఃఖావమానాల పాలే ఎక్కువ..... చేదు భాగమే అధికం. ఇక్కడే నా జీవిత సత్యాన్ని చెప్పాలి.... చేదును కంఠం నుండి కిందికి దిగనివ్వలేదు నేను..... దుఃఖానికి... నన్ను దహించే అవకాశం ఇవ్వలేదు...... ఇక అవమానం... నా ఆత్మవిశ్వాసం, నా అకుంఠితదీక్ష ముందు అదే తలవంచుకొని వెళ్ళిపోయింది..... నా హృదయం నుండి తన్నుకొని పైకి ఉబికి వచ్చి నా కలంలో ఏమని ప్రతిధ్వనించిందో... విను!

**గవ్వకుసాటిరాని పలుగాకులమూక లసూయచేత న**

**న్నెవ్విధిదూరినన్ ననువరించిన శారదలేచిపోవునే**

**యివ్వసుధాస్థలింబొడమరే రసలుబ్ధులు ఘంటమూనెదన్**

**రవ్వలురాల్చెదన్ గరగరల్ సవరించెద నాంధ్రవాణికిన్.**

ఇదీ నా ఆత్మగౌరవం చేసిన గర్జన. కానీ నా కలానికి యీ సంఘంపై ద్వేషం లేదు. ఇది ఏర్పరిచిన వ్యవస్థపై కోపం. స్వవస్థ మార్పుకై ఆవేదన. ఈ వ్యవస్థను, నేను జయించాను. నేను విజయుణ్ణి వినుకొండా! నేను విజయుణ్ణి.

**"అపారే కావ్య సంసారే కవి రేవ ప్రజాపతి**

**యథా స్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే"**

ఈ అనంతమైన కావ్యజగత్తుకు కవియే సృష్టికర్త. తన కిష్టమైన తీరున ఈ ప్రపంచాన్ని మలుస్తాడు. తాను సమాజం చేత మలచబడడు. తానే సమాజాన్ని మలుస్తాడు.

వినుకొండా! నను మరచిన నిను మరువను. నా యీ శుష్కిత నేత్రాలలో ఈనాటికీ మెదిలేది నీవే....

నేను కళ్ళు తెరవక ముందే నీవు అంటే యీ సంఘం ఎలా వున్నదీ...... ఒక మహాకవి..... "ప్రపంచంలో దోపిడీ, స్వార్థం, ద్వేషం మానవులు పెంచుకుంటే ఎక్కడయినా ఆ సమాజం ఇలా ఉంటుందని, ఒక విశ్వసత్యాన్ని వెల్లడించాడు.

"By nature all men are born equal, becoming unequal only by class... made institutions and that law is an invention of the strong to chain and rule the weak"....

- Jean jaques Rousseau

నీ కథా, నిన్ను నమ్మి పుట్టిన నా కథా చెప్పితే చాలు, రూసో మహాకవి చెప్పిన సత్యం అర్థం అవుతుంది.

**స్వపరిపాలనమన్న శబ్దంబు దేశంబు**
**వీనుల విందుగా వినక ముందు**
**సత్యాగ్రహోద్యమ జ్వాల పశ్చిమదిశా**
**కుటిల శక్తుల కంటుకొనక ముందు**
**ప్రతివాని స్వస్వరూపజ్ఞాన సంపత్తి**
**కునుకు నిద్దుర మేలుకొనక ముందు**
**ఘనదురాచార సాగర మగ్నమై ప్రజా**
**బాహుళ్య మొద్దున బడకముందు**

**కొలత గింజల శాసనంబులకు వెఱచి**
**కొట్లలో పంట తలదాచుకొనకముందు**
**వడిదుడుకులేని మన్మథాబ్దంబు నందు**
**ప్రభవమందితి "నమ్మి" నీ పట్టణమున**

అది 1895 సెప్టెంబర్ 28న ఆ శనివారపు ఉషోదయవేళ తూర్పు దిగ్భాగము రాగరంజితమవుతూ ఉన్న సమయాన, వినుకొండలో ఊరికి దూరంగా ఉన్న మిస్సెమ్మ దొరసాని తోటలో ఆ మూలనున్న చిన్న పెంకుటింట లింగమాంబ మగబిడ్డను కన్నది. పుట్టిన పిల్లలు చనిపోతూ ఉండగా నాల్గవవాడిగా పుట్టినబిడ్డను వీరయ్య, లింగమాంబలు అపురూపంగా పెంచుకున్నారు. ఆ బిడ్డనే నేను. ఆ తరువాత ఏడేండ్లకు తమ్ముడు ఇస్రాయేల్ తోడైనాడు.

వీరయ్య యాదవుడు. లింగమాంబ క్రైస్తవులు. ఆనాటి క్రైస్తవ మిషనరీ మత ప్రచారకులు బడులు, బోర్డింగులు, చర్చీలు కట్టించి మతాంతీకరణకు ప్రోత్సాహించేవారు. ఆది ఆంధ్రులు, యితరులు ఆనాడు క్రైస్తవమతం పుచ్చుకునే వారు. సాంఘిక వేర్పాటు తనం, అస్ప ృశ్యత, అవిద్య, దారిద్ర్యం వీటినుండి కొంత విముక్తిని పొందగలమనే ఆశతో బాప్తిజం తీసుకున్నా వారే అధిక సంఖ్యాకులు ఆనాడు.

సాంఘిక అసమానతలు, అస్పృశ్యత వీరవిహారం చేస్తున్న రోజులు. మనిషి స్వేచ్ఛకు, భావ ప్రకటనకు ఆస్కారం లేనికాలం. వీరయ్యలో చదువు కొనవలెననే కోరిక బలీయంగా నాటుకున్నది. బోర్డింగ్ స్కూళ్ళలో ఆ అవకాశం యెక్కువ. వీరయ్య తన కోరికను మిషనరీలకు చెప్పుకున్నాడు "నీవు క్రైస్తవ మతం తీసుకుంటేనే, చదువు

చెప్పుతాం" అన్నారు. వీరయ్య ఒప్పుకొన్నాడు. యాదవరాజుల చరిత్ర సుద్దులుగా చెపుతుండగా, అందులో కరియావుల రాజు వీరయ్యకు అభిమాని. ఆ ఘట్టం రాగానే ఒళ్ళు పూనకం పెరిగేది. అట్టి వీరయ్య క్రైస్తవం పుచ్చుకోవడమా!? బంధువులంతా నోళ్ళు నొక్కుకున్నారు.

తల్లిదండ్రులు, అన్నదమ్ములు తీవ్రంగా ఎదుర్కొన్నారు. అంతకంటే తీవ్రంగా వీరయ్య పట్టుదల పెరిగింది. ఆరడుగుల ఆజానుబాహువు వీరయ్యను... ఆరున్నర అడుగుల ఆజానుబాహువు అన్న లింగయ్య, వీరయ్యను భుజాలపై ఎత్తుకుని వినుకొండ నుండి చాట్రగడ్డపాడు (2 మైళ్ళు), జన్మ గ్రామం మోసుకుపోయినా, ........వ్యతిరేకత తీవ్రమైనా వీరయ్య లొంగలేదు.

క్రైస్తవుడై బాప్తిజం పుచ్చుకోవడం, బోర్డింగ్‌లో చేరడం జరిగిపోయింది. అదే స్కూలులో ఉన్న లింగమాంబను చూచి ప్రేమించి పెళ్ళిచేసుకోవడం, మరొక పెద్ద ఘటన. వారు ఇరుపక్షాల నిరాదరణకు గురి అయినారు.

క్రైస్తవమతం పుచ్చుకున్న వీరయ్యకు పూనకం అనేదే రాలేదట. ఆపైన బైబిల్ చదివి, పరీక్షలు వ్రాసి ఫాదరీ ఉద్యోగం పొందినాడు. మచ్చలేనివాడు.

**"క్రీస్తున్నమ్మిన భక్తసత్తముడు మేల్**

**రస్తాలంబయనించు సజ్జనుడు,**

**అహోరాత్రములు వేదార్థములు**

**ప్రస్తావించు వ్రత ప్రచండుడు నా తండ్రి"**

నేను చాలా పట్టణాలను చూసాను. కాని నా జన్మభూమిని, చూచినపుడు కలిగిన ఆనందము, సమ్మోహనం, నాకు ఎక్కడా లభించలేదు. ఊరికి పశ్చిమాన ఉన్న కొండల బారులో ఆ కొండ ప్రత్యేకం. ఎత్తు ఎన్ని అడుగులో ఎప్పుడూ కొలవలేదు. అస్తవ్యస్తంగా ఉన్న కొండ ఎక్కేదారిలో, ఎన్నిమార్లు ఎక్కినా అలసట ఎరుగను. కాళ్ళు నొప్పి పెట్టడమూ ఎరుగను, ఆ శిఖరాగ్రాన విశాలమైన స్థలంలో శివాలయం ఉంది.గదా! ఆ శివాలయం బండ మీద కూర్చొని వినుకొండపురాన్ని చూస్తూ ఉంటే, కాలం వెనక్కు ఎంత దొర్లిపోయిందో తెలిపేది కాదు.

అటు తూర్పున రైల్వేస్టేషన్ నుండి కాలిబాట ఒకటి బయలుదేరి మిస్సమ్మ తోట, దొర బంగళాలను పలుకరిస్తూ ఆ వేపతోపులను, పున్నాగి తోటలను, పాపటిలా, చీల్చుకుంటూ వచ్చి, కులాల వారీగా కట్టుకున్న పేటలను, గూడేలను తాకుతూ ఈ కొండ దాకా వచ్చి ఆగిపోయేది. అటు ఉత్తరపుదిక్కున రైల్వేలైను, దానికి ఇరుప్రక్కల ఊరిని చుట్టుతూ, ఆకుపచ్చని ఓణీపైట చుట్టుకొని ఉన్న దానిలా సజ్జచేలు, జొన్నచేలు

కన్నులకు ఆనందాన్ని ఇచ్చేవి. ఆ చేల అంచులకు పసుపు పూలు, విరబూసిన జనుము, పసుపుపచ్చ అంచున్న పచ్చని పావడా కట్టుకున్నదా అన్నట్లు.

**బాటల్ తోటలు నీటిపట్టులు సమీప గ్రామముల్ క్షేత్రముల్**
**జోటాచిత్రములై సమీపమున చక్షుఃపర్వముల్ సేయ నే**
**టేట న్నీగిరులెక్కి చూచితిమి మున్నే కాసికేకాసి కా**
**గాటంబైన ముదంబు జిక్కునె హిమగ్రావాగ్రమున్ మెట్టినన్.**

ఆ శిఖరాగ్రాన కూర్చొని, ఇపుడు చూస్తున్నట్లుగా ఉన్నది. తూర్పు దిక్కున ఉన్న పాడుపడిన ఆ మసీదే నాకు ఒకనాడు ఆశ్రయం అందించింది. స్వజాతీయులు, నన్ను సంఘబహిష్కరణ చేసినపుడు. ఊరిలోనే కాదు. ఎంతో ఎత్తున మనుష్యులు మెదలని ఆ శిఖరం మీది శివాలయంలోనికి తొంగిచూచే అవకాశం పూజారి లేకుంటేనే మాకు స్వేచ్ఛ. ఇపుడు అది తలంచుకుంటే ఈనాటికి, నా హృదయం సిగ్గుతో కుంచించుకుపోతుంది.

ఇవి మనిషి మనిషిపై విధించిన కుతంత్రపు నీతులు. మతం, కులం, ధనం, అధికారం చేత బలవంతుడైన వాడు, బలహీనునిపై సాగించిన, సాగిస్తున్న హుకుం, ఇది తొలగించగలిగిననాడే సమత, మమత సాధ్యం.

అటు మార్కాపురం ఊరి నుండి ప్రారంభమైన కాలిబాట. ఇటు పశ్చిమాన కార్యంపూడిదాకా, నల్లమల అడవిలో మెలికలు తిరుగుతూ పోతూ ఉంటుంది. అలనాడు పలనాటి భారతంలో అభిమన్యుడంతటి వాడుగా ప్రసిద్ధి చెందిన, బ్రహ్మన్న, ఐతమ్మల కొడుకు బాలచంద్రుడు. పొట్టేలు (దాని పేరు "కారుబొల్లడు") వాహనంపై వచ్చిన బాట యీ నాటికీ వుంది కదా!

వీర ప్రతాప శౌర్యములకు స్థానమిచ్చి పెంచుకొన్న వినుకొండా ! మానవుల మధ్య అసమానతలను, అస్పృశ్యతను ఎందుకు పెంచుకున్నావో! ఈనాటికీ నాకు అర్థం కాలేదు. "మాదిగలని, మాలలని అమర్యాదగా పిలవగా" చిత్తం దేవరా అని జవాబిచ్చే దీనులు, పేదలు ఈనాటికైనా వారు సుఖంగా ఉన్నారా! వారికి సమాన గౌరవం లభిస్తున్నదా?

వినుకొండా! దయారహితమైన నీ కొంచెపు దృష్టి నన్ను బాధించగా ! నా కవనం, కన్నీరు చిందించింది. నీవు గుర్తించలేదు. నీవు చూపిన అనాదరణ వలన సమత్వం అనే సుఖం నశించింది. నీ మూఢత్వం వలన అణగిపోయిన చదువు ఇప్పటికీ కోలుకోలేదు. నీ భజన కూటాల వలన ఎంత సమయం నష్టపోయిందో నీకు జ్ఞాపకం లేదు. నా బంధువులలోని సామర్థ్యాలు, సృజనశక్తి, కళాపటిమ, నీదురూహాల కతన

నశించిపోయినదని, నిన్ను ఎత్తిపోడవడం కాదు, ఇప్పటికైనా నిన్ను నీవు తెలుసుకొని మనుష్యలోక మహనీయ మహాసభ్యురాలుగా, ఎన్నుకొనేటంతటి, విజ్ఞానం సంపాదించుకున్నావా లేదా! అని ప్రశ్నినిస్తున్నాను. సదాశయాలకు, మౌఢ్యపు ఉచ్చులు బిగిస్తే అవి మరుగుజ్జులై అణిగిపోతాయి.

ఒక్క విషయంలో నిన్ను అభినందించక పోలేను. ఆనాడు నీకు చూపిన మత సామరస్యం, ఈనాటికీ, తలంచి నప్పుడంతా! ఆనందం, జాలు వారుతుంది. పగలే నిశ్శబ్దంగా ఉండే నీవు మొహరం, దసరా పండుగలనాడు, హిందూ మహమ్మదీయులే కాదు, అన్ని కులాలవారు ఆ పండుగలను, ఆనందించే తీరు, ఈ నాటికీ నన్ను ముగ్ధుణ్ణి చేస్తుంది. ఆ మొహరంనాడు పదవరోజున పీర్లన్నీ పంజాలు వదలి గుండానపడతాయి. ఆ ఊరేగింపు చూడటానికి చుట్టుప్రక్కల గ్రామాల నుంచి జనం తరలి వచ్చేవారు. వీధులు, మిద్దెలు, జనంతో కిటకిటలాడేవి. ఎవరూ, ఏమిటీ అనే ప్రశ్నలే లేవు. పీర్లు ఊరేగింపుగా వెళ్ళే సమయాన విచారసహితమైన రాగాన్ని షహనాయి ఆలాపిస్తూ ఉంటే హిందూ, మహమ్మదీయ, క్రైస్తవులు, ఒకరేమిటి, అందరూ కంటతడి పెట్టేవారే!

ఆ దసరా పండుగ రోజులలో విచిత్ర వేషధారణతో పులివేషాలు వేసేవారు. నేనూ పులివేషం వేసాను. అయితే ఆ పండుగ చివరి విజయదశమినాడు, జరిగే తంతు మాత్రం వేదన కలిగించేది.... భారతగాథను వింటూ... అర్జునుడు జమ్మిచెట్టులో దాచిన గాండీవాలను తీసుకునే దృశ్యం..... ఏదో పురాణగాథ, చూస్తున్నంత ఆనందం కలిగేది. నాకు మాత్రం ఆ ఆనందం క్షణికమే. పెంచిన గొర్రెను తెచ్చి, దాని తోకను కసుక్కున నరికే దృశ్యం చూసాక, ఆనందం అంతా చిన్నాభిన్నమై, మనస్సు వ్యధితమై, వికలమై పోయేది.

రావణుడు సీతను అపహరించుకుపోతూ మా వినుకొండపై కొద్దిసేపు ఆగి, విశ్రాంతి తీసుకున్నాడట. అపుడు జటాయువు పక్షి రావణున్ని ఎదిరించిందట! రావణుడు దాని రెక్కలు నరికాడట! ఈ వార్తను రామునకు జటాయువు అందించింది. సీత అపహరణ గాథ; రాముడు ఆ కొండ మీదే విన్నాడు. కనుక ఆ కొండ “వినుకొండ” అయ్యిందట ఈ పురాణగాథలోని సత్యాసత్యాలు వదిలేస్తున్నాను.

మరో చారిత్రక గాథే నాకు నచ్చినది. విష్ణుకుండిన రాజులు ఏలిన పట్టణం “విష్ణుకుండినపురం” వికృతి చెంది “వినుకొండ”గా మారింది.

మరో చారిత్రక గాథ కూడా ఈనాటికీ నా హృదయాన నాటుకున్నది. దానకర్ణుడైన రాయని భాస్కరుడు నిన్ను ఏలినాడు. అతని దాన పరత్వం చరిత్ర ప్రసిద్ధం. భాస్కరుని

మనుమడు ఒకనాడు విద్యాలయం నుండి ఇంటికి వచ్చాడు. తల్లి వడ్డించిన భోజనం చేస్తూ కుడిచేతిని దాచుకొని ఎడమచేతితో భుజిస్తున్నాడు. అది గమనించిన తల్లి ప్రశ్నించింది. ఆ చేతికి ఏమైందని, ఆ కుర్రవాడు తల్లితో, నా తోటి విద్యార్థి ఆర్థిక కష్టాల్లో ఉన్నాడమ్మా అతని దీనగాథ విని నా హృదయం ద్రవించిపోయింది. ఇదిగో నా బంగారు కడియాన్ని అతనికి దానం చేసాను. ఆ జవాబు విన్న తల్లి కొడుకు చెంపను ఛెళ్ళుమనిపించింది. నీ తాత రాయని భాస్కరుని కీర్తిని చెడగొట్టాడవు అని, ఆశ్చర్యము, బాధ మిళితమైన ప్రశ్నార్థకంగా చూస్తున్న కొడుకుతో... నీ రెండవ కడియం కూడా ఇచ్చి వేయక లోభితనం నిరూపించావు. అని తల్లి అన్నదట.

ఈ కథలోని నిజానిజాలు తేల్చుకోవలసిన పనిలేదు నాకు. దానపరత్వం యొక్క మహోన్నతత్వం అది. ఈ మహోన్నత గుణాలేమైనా ఇప్పటి నీ పిల్లలకు నూరిపోస్తున్నావా లేదా! అన్నదే నా ప్రశ్న?

**మురుగు లొసంగి తాత యశముం బ్రదికించిన రాచబిడ్డ భా**

**స్కరుని యనుంగు మన్మనికి శైశవమంద యుదారభావముల్**

**గరపి చరిత్రలో వెలుగు కంజదళేక్షణ నీదు కౌగిటం**

**బెరిగినదే కదమ్మ! వినుపింతువె కూతుల కీ విశేషముల్**

ఇదే మహోన్నతమైన మానవత. మానవులలో పెరిగితే, 'ఒకరికొకరు' అనే మానవత పెరగదా? ఈ సంఘటన ఎందుకు జ్ఞాపకం చేస్తున్నానంటే.....

పేకాటలకు వేలకు వేల రూపాయలు వ్యర్థపు పనులకు గుప్పిస్తూ, సత్కార్యాలకు సహకరించమంటే వంకలు చూపే కుర్రకుంకలను కనవద్దు అని హెచ్చరిస్తున్నాను.

సంచులు నిండిపోయేటట్లుగా ధనాన్ని కూడబెట్టి, దీనులకు, దరిద్రులకు దమ్మిడీలు దానం చేస్తూ ఆ దమ్మిడీ పొగడ్తలతో బ్రతుకే ప్రజావంచనలను స్వేచ్ఛగా జరిపే వారిని యీ సమాజం యిక మీదట క్షమించదు. వారి మోసపూరిత కార్యాలు యిక సాగవు.

కోట్లాది ధనాన్ని ఒకచోటనే కూడ గట్టుకొని – దమ్మిడీలు దానం చేసే కుసంస్కృతి యింకా యీ సమాజాన సాగుతూనే ఉన్నది.

ఆనాడు నీవు ఎంతో మూఢత్వాన్ని పెంచి పోషించుకున్నావు. చేతబడులని, జంతుబలులని వాటి వలన కోరికలు ఫలిస్తాయని నమ్మించి..... వాటిని ఎదిరించిన వారిని సంహరించగలరు. తంత్రగాళ్ళు, కోతలరాయుళ్ళు అని ప్రజలను భయంలో ముంచావు. మరి ఆ భయం ఈనాటి విజ్ఞానశాస్త్రంతో ఖండించి భీతి వదిలించితివా లేక బలిసి పిల్లలు చేయించు చుంటివా?

చౌడమ్మ సత్తికి నెత్తుటి కూడు తినిపించే కొలుపులు యీ నాటికీ జరుపుతున్నారా? కరుణా హృదయులు, ఆర్ద్ర మనస్కులు జన్మింపలేదా పట్టణాన? బుద్ధుని బోధలు వినినవారు కాదా! వినుకొండా!

మహాత్ముడు బ్రిటీష్ సింహాన్ని కట్టిపడవేసి అహింస చేత హింసను జయించినాడు. హింసకు తిరుగ ఆయువు బోయుట సిగ్గుకాదా! గొర్రెల, మేకల నెత్తుటి ప్రవాహాలతో నీ కొండలు కరిగి పోయినవి. శృతగిరీ! కరుణతో కరగదనిన నీకు, నాకు అపకీర్తి కాదా! మానవ జీవితాలను సుఖప్రదం చేసి, శాంతి స్థాపించి, అభ్యుదయపథాన నడిపించేది ఒక్క అహింసామార్గమే. దానిని కాదని, హింసా మార్గం పట్టిన సిద్ధాంతాలన్నీ ప్రజలచే నిరసింపబడుతున్నవి. ప్రజల స్వాగతం పలకని ఏ సిద్ధాంతమూ నిలువదు.

నీ ఆడబిడ్డలను బడికి పంపుచున్నావా లేక ఈడేరినదని వివాహం ఏర్పాట్లు చేస్తున్నావా!

ముద్దు కూతుళ్ళకు సారెలు, చీరెల ముచ్చట్లతో, పొద్దులు పుచ్చే అచ్చనగాయల ఆటలు, అట్లతద్దుల ఊయలలే నేర్పినట్లయిన వారి బుర్రలు మారవు. వారి ఆలోచన పెరగదు. మిద్దెలు, మేడలు మాత్రం వృద్ధిచెందినంత మాత్రానా మేధస్సు పెరగదు, నగరలక్ష్మీ!

వినుకొండా! నీవు అందించిన ప్రశాంత ప్రకృతిని మాత్రం నేను యీ నాటికి మరువలేను. ఆ పచ్చని, చల్లని గ్రామాలు నేడు పట్టణాలైనవి. పట్టణాలు నగరాలైనవి. ముగ్గులు పెట్టినట్లు, నాటుకున్న పూలతోటలేకాని, సహజంగా పెరిగి, సహజ ప్రకృతి నందించే కనువిందు కూర్చే పచ్చపట్టులే లేవు యీనాడు.

పిచ్చుకలు, నల్లంచులు, గోరువంకలు, చిలుకలు వీటికి ఆనాడు ప్రతి ఇల్లూ వాటి ఇల్లే. వాటి కిలకిలలే, మరి యీనాడు యీ కాంక్రీటు జనారణ్యాలలో వాటి చిన్నిగడ్డి గృహానికి స్థలమే లేదా!!

**ఏంత్రింతపిట్ట పై కెగసి పల్టీగొట్టి**
**యొయ్యారముగ నేల కుఱుకుచుండ**
**పీకె తుమ్మల నుండి బెళగువ్వ జంటలు**
**సనసన్న గుడగుడ ధ్వనులు సేయ**
**చెట్ల కొమ్మల దాగి చెవులు గింగురువోవ**
**యీల పుర్వుల పిండు గోల వెట్ట**
**పొలముగట్టుల కాపుపొలతుకల్ పొలికేక**

**బెట్టుచు వడిసెలల్ విసరుచుండ**

**అతి నిరాడంబ రానంద మాటలాడ**

**పండిన పొలాలతో నేత్ర పర్వమగుచు**

**ప్రబలునే నీదు పరిసర ప్రాంత లక్ష్మి**

**పెద్దనగరాల పెను హడావిడులు లేక**

ఆ జొన్న కట్టలకు, సజ్జ ఆకులపై తిరిగే పలురంగుల జీరంగి పురుగులు.....కన్నుల కెంతో ఆనందాన్ని కలిగించే ఆ జీరంగి రెక్కలను స్త్రీలు తమ రవికలపై అందంగా కుట్టుకునేవారు ఆనాడు.

ఆ పురుగులను పట్టి, అగ్గిపెట్టెలో పెట్టి, తుమ్మ ఆకులు వేస్తే........ ఆ పురుగు మూడు రోజుల్లో చిన్ని గుడ్డును పెట్టేది. ఈ పెంపకం మాకు ఎంతో ఆనందాన్ని కలిగించేది.

ఆ సజ్జకంకులు, కండపట్టిన ఆ జొన్న కంకులను చూస్తూ ఉంటే ఆ కొన్న పేదలకు ఆహారం “మూటలుకట్టి ఆహ్వానిస్తున్నాదా” అన్నట్లు పండి నోరూరించేవి.

ఆ సజ్జసంకటి ముద్దలో బుడమ దోసకాయల పచ్చడి నంజుకుంటూ తింటే. వేడన్నంలో వేయించిన కందిపప్పు, అప్పుడే కాచిన నెయ్యి, ఆ రుచి ఏదీ నేడు? ఓరిగలు, రాగులు, కొర్రలు ఏవీ! నిరుడు పండిన ఆ బంగారు కానుకలు ఏవి తల్లీ!

ఆ మేఘాల ప్రళయ గర్జనలు విని ఇంద్రుని వాహన చక్రాల ధ్వనిగా నమ్మిన నాడు....... ఆ గిరి ప్రదేశాల, నదీనదాలు, స్వర్గఖండాలుగా నా పసికంటికి కన్పించినవి.

మరి నీ పట్టణం ఏమైనా విశాలంగా తీర్చిదిద్దుకున్నావా లేదా! విశాలమైన వీథులు, దారులు, అందమైన సహజ వనాల పెంపకం?

సూరేకారపు ఉప్పురాసులు, నీ నిండా కుప్పలుగా ఉండేవి. వాటిని త్రవ్వి వీథులు విశాలంగా చేయక, యింకా చిన్న ఇరుకు సందుల్లోనే............. తలంపుల్లేని శిరస్సుల్లాగ...... ఇరుకుగా జీవిస్తున్నావా?.............

నేను, నా తమ్ముడు నేత్రావధానం అలవరచుకుని చూచేవారు, వినేవారు ఆశ్చర్యపోవునట్లు అవధానం చేశాము.

పద్యాలు, దానిలోని అక్షరాలు, ఒత్తులను కండ్లు తిప్పి నేర్చుకొన్న విద్య అది. నా కన్నుల సైగలకు అర్థం కల్పించి నేర్చుకున్న, తమ్ముడు దూరంగా కూర్చొని, పద్యాన్ని చూస్తూ నేను కన్నులు తిప్పితే..... అది గ్రహించి పద్యాన్ని పూర్తిగా వ్రాసేవాడు

తమ్ముడు...... ఇది అందరికీ ఆశ్చర్యమే. కదా.... "ఇది కనుకట్టు లేరా అబ్బాయా" అని తృప్తిపడే పెద్దలు......

ఒకనాడు కురిచేడు గ్రామంలో ఆసామి ఇంట్లో పెళ్ళికి పిలిచి నేత్రావధానం చేయించాడు. అంతా ఆశ్చర్యం చెందారు. మా సన్మానం పాతిక సేర్ల సజ్జలు!!

ఆసామి ఆనందించి, "నీవు పద్యం అల్లుతావటగదా నామీద పద్యం అల్లు" అన్నాడు......

నాకుగాని, తమ్మునికి గాని ఆశుకవిత్వం రాదు..... అయినా తప్పదు! లేదా కురిచేడు నుండి వినుకొండకు రైలు ఛార్జీలు దొరకవు. పాదయాత్రే!! అప్పుడే పోతన భాగవతం నన్ను ఆదుకొన్నది.

ఆసామి పేరు రామిరెడ్డి ''మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబుబోలునే రామిరెడ్డి........... నిర్మల మందాకినీ వీచికలం దేలు రాయంచబోలునే రామిరెడ్డి!.........

ఈ రకంగా సీసపద్యం అంతా "రామిరెడ్డి" పేరు ప్రయోగించాం. ఆసామి అమితానంద హృదయుడై మాకు రెండు అణాలు (ఆరుకానులు) పారితోషికం అందించాడు! నాకు లభించిన ప్రథమ కళాపోషకుడు. నా ప్రథమ ఘనసన్మానం అది.

హిందూ మహమ్మదీయ మతసహన సాంగత్యము దేశ, స్వరాజ్యమునకు ఎంత ప్రథమమో నీ చిన్ని పట్టణానికీ అంతే అవసరం. కానీ ఆనాడు టిప్పుసుల్తాను ఏనుగు దంతములు ఢీకొని కుమ్మగా కుప్పలు, కుప్పలై విరిగి కూలిన ద్వార కవాట ఖండము నేటికీ చెప్పుతున్నాయి............ఏమని? "మతతత్వాలు" తప్పు! "జాతి ఐక్యతకు ముప్పు" అని.

చదివించుచున్నావు గదా కుమార్తెలను. ఈ విషయాలన్నీ ప్రస్తావించి, ఇందు చాలా విషయాలు అప్రియసత్యాలు. ఈ అప్రియమైన సత్యాలే నా మనస్సును ప్రగాఢముగా కలిచి వేసిన సంగతులు. నా కావ్యాలకు వస్తువులైనవి విషాదపు జాలితో,

**"ఎట్టి వివేకశాలు రుదయించిన లోకమునెల్ల మూటగా**
**గట్టు ప్రతాప వారిధులు గల్గిన మానవులొక్క తల్లి కిం**
**బుట్టిన యన్నదమ్ములను భూరి వివేకము లోపమైనచో**
**పుట్టనుబుట్టిగిట్టు చెదపుర్వులు వారలనర్హులిచ్చుటన్"**

* * *

# కటికి పోకిరీ

**మొగమున కక్కుగొట్టి మసిబూసి వికార మొనర్చు నీచపుం**
**దెగులున కమ్మువారనుచు తీయని పేరిడి, మేకపోతులన్**
**దగరుల జంపి, రక్తమున దాండవకేళి యొనర్చు వెఱ్ఱికిన్**
**దగిన జికిత్సచేయగలదా నవభారత మెన్న డేనియున్.**

పగటిపూట గుడ్లగూబలు రాత్రి పావురాళ్ళు నివాసముండే అంకాళమ్మ సత్తి, ఊరికి ఉత్తరాన పోలిమేరను కాపలా కాస్తూ ఊంటుంది. ఆ దేవాలయాన నెయ్యి పోసిన ప్రమిదలు వెలుగుతూ ఉంటాయి. ఆ రాతి విగ్రహానికి నా పేద భోజనమే నైవేద్యంగా ఆహుతి అవుతున్నది. ఎన్నో మూగజీవుల తలలు ఆ మందిరం ముంగిట దొర్లుతూ వుంటాయి. కొలుపులు, మొక్కుబడుల నెపంతో. ఆ ముంగిటనే మేకకూనలు ఆడుకుంటూ ఊంటాయి. వానికేమి తెలుసు వాని తాతలు, ముత్తాతల కాపాలాలే ఆ విగ్రహపు కంఠాన అలంకరించి ఉన్నాయని!!

నిన్నటిదాకా మేత అందించి మురిపెంగా పెంచిన యజమాని వెంట ఆ మరునాడు నడుస్తుంది ఆ గొర్రె. దానికి మరణం ఆసన్నమైనదని మాత్రం తెలియదు. ఒక్కసారిగా దాని మెడ కసుక్కున నరకబడగానే, దాని కనులు మూతపడలేదు! ఏంచేతనంటే దాని "ఆశ్చర్యం గుక్కబట్టి" అయ్యో ! ఏమిటీ ఘోరం, నా యజమానేనా, యింత క్రూరంగా నరికింది" అని. ఇటువంటి భయంకర దృశ్యాలు ఎన్నో చూశాను. నా లేత మనసు విలవిలలాడేది. కానీ నా చిన్నివయస్సు, చిట్టిజ్ఞానం... హింసను ఎలా ఆపగలవు? వీరంగం తొక్కె ఆవేశపరులు "కాదు ! వద్దు! వద్దు హింస!! అనే బౌద్ధ భిక్షువుల

కుతికలే నలుపగలరు. ఇక నావంటివారు, ఆ మతరౌద్రాన్ని ఆపగలరా! ఆ మౌఢ్యపు వ్యాఘ్రం హింస రుచి మరిగిన తరువాత, అహింస దాని ఛాయలకు చేరదు.

ఒకనాడు నా ఉండేలు బద్దతో ఆ అంకాళమ్మ మిడిగుడ్లు సొట్ట పోయేటట్లుగా కొట్టి పరుగుతీశాను. ఆ సత్తిపై నాలో పెరిగిన కసిని అంతవరకే తీర్చుకోగలిగాను. నాది తుంటరితనం అంటే అనండి.

నేను "బుద్ధమహిమ" ఖండిక వ్రాయడానికి ఆ చిననాడే ద్రవించిన నా మనసు.

**'దీనములైన చూపుల వధించెడు వానికి మ్రొక్కి "అన్న! నా**
**కూనలకండ లేదు కనుగొమ్మ"ని గద్గదనిస్వనంబుతో**
**లోనఁ దపించి నాల్గుదెసలుం బరికించుచు, "బుద్ధ దేవ! రా**
**వే! నను బ్రోవవే!" యని జపింపని జంతువు లేదు మేదినిన్**

పుట్టిన బిడ్డలు చనిపోతూ వున్న కారణాన మా అమ్మ ఇంటింటా తిరిపం అడిగి నాకు ఒక వెండికంటె; కుడి ముక్కున, కుడిచెవిన పోగులు చేయించి అలంకరించి తృప్తి పడింది. నల్లని నా శరీరంపై ఆ తెల్లని ఆభరణాలు తళుక్కున మెరుస్తూవుంటే, మా అమ్మ తెగ మురిసిపోతూ, "అయ్యా జాషువయ్యా, ఏమి సక్కనయ్యవురా', అంటూ ముద్దు కురిపించడం నాకీనాటికీ జ్ఞాపకం, నాకన్నా మంచి రంగు, కనుముక్కు తీరు తీర్చిదిద్దినట్లుండే మా తమ్ముని ఎప్పుడూ "అందం" గురించి పొగిడేది కాదని, మా తమ్మునికి నాపై గుర్రుగా ఉండేది," నీ నల్లంచిని అడుగువే! నీ నల్లంచిగాడు వున్నాడే' అంటూ వాడు తన అక్కసును మా అమ్మపై తీర్చుకుంటూ ఉండేవాడు.

నాతోటి కుర్రాళ్ళను పోగు చేసుకొని నా ఇల్లంతా ఆటస్థలంగా, నాటక రంగస్థలంగా మార్చుకొని నానా రభస చేస్తూ ఉండేవాడిని. మా తమ్ముడు అన్నకు నీడేగాని, లీడరు కాదు!

మా ఇల్లు పెంకుటిల్లు, పంచ, మధ్యగది పెద్దది. అటు ఇటూ రెండు గదులు, ఆ మధ్యగది నా నాటకాలకు స్టేజీ.

తోటి బాలురను గూపెట్టి నా ఇల్లంతా రంగస్థలంగా మార్చేవాడిని. వీధి భాగవతాలు ఆడి, బొమ్మలాటలు, కుస్తీలు. ఇల్లు ఇల్లంతా అల్లకల్లోలంగా, అరుపులతో పోటీలతో, కుమ్ములాటలతో నిండిపోతూ ఉండేది. రాజును నేనే. కిరాతకుని నేనే. పహిల్వాన్‌ను నేనే, అవతలవాడు నాకన్నా బలంగల వాడైతే కిందపడేదీ నేనే!

ఆ పక్కగదిలో ఉదయం ఎనిమిది గంటలకు ప్రారంభమై మధ్యాహ్నం ఒంటిగంట వరకూ ప్రార్థన చేస్తూ ఉండే మా తండ్రి మా అల్లరికి చెవుల్లో దూదిపెట్టుకుంటాడే కాని, "అదేమిరా" అనే వాడు కాదు, ఆయన పాదాలపై కప్పలను ఎక్కిస్తే, "ఛీ!

కుక్క", అనేవాడే కాని, ప్రార్థన' ఆపేవాడు కాదు. మా అమ్మ "బడవా!" అనేది ముద్దుగా చెయ్యెత్తి కొట్టిన పాపాన పోలేదు.

ప్రేమ వారి నరనరాన దీప్తుల్ చిమ్ముతుండేది. వారి విశ్రాంతిని, సౌఖ్యాన్ని, సర్వస్వాన్ని మాకే వెచ్చించిన మా జననీమణిని తలంచగానే యిప్పటికీ కన్నీళ్ళు చిందుతాయి.

తూర్పున పొద్దు పొడిచింది, మొదలు పశ్చిమాన ఒదిగేటంత వరకూ, కాలికి చెప్పు, తలపై గుడ్డలేక, తోపులు, తోటలు, చేలు, కొండకోనలు తిరిగి తిరిగి ఇల్లు చేరడమే నా దినచర్య, పొన్నంగిపిట్టలను, గువ్వ పక్షులను కొట్టి, చిలుకలను, గోరువంకలను పంజరాలలో బంధించి, కొమ్మ కొమ్మల గెంతే చిన్నారి చక్కని ఉడుత పిల్లలకు ఉచ్చులు వేసి, కుక్కపిల్లలను ముద్దుగా పెంచి, ముంగిస పిల్లలను ముద్దులాడుతూ... నా చిన్నతనం చీకూ చింతలేక జరిగిపోయింది.

ఐదవ ఏటనే నన్ను బడిలోవేశారు. గురువమ్మ, పంతులమ్మ, కరుణాలయ నన్ను కొట్టక తిట్టక చదువు నేర్ప ఎంతో ప్రయత్నించేది. 'అ నుండి క్ష' వరకు రావడానికి నాకు రెండేళ్ళు పట్టింది.

ఆ చిన్న బడి ఎట్లో యీ దిన తరువాత, అస్పృశ్యతకు గాదలి చెల్లి అయిన హిందూ సోదరుల విద్యాలయమున చేర్పించారు.

కానీ, నాలో పశ్చాత్తాపం చెప్పింది. ఆ కుర్రవానిది తప్పు కాదు, పెద్దలు నూరిపోసిన తప్పుడు సిద్ధాంతానిది తప్పు అని ! వెంటనే అన్నాను. "నిన్ను కాదులే సోదరా కొట్టింది. నీవు అనిన మాటను"

ఇంటికి చేరి అమ్మకు చెప్పాను ఏడ్చి, అమ్మ అన్నది కదా !, "ఇది భయంకర దేశము నాయనా ! వర్ణభేదాలు స్థిరంగా ఇళ్ళు కట్టుకొన్నాయి. పంచమజాతి వారికి "కూడు హుళక్కి, మానవతా హుళక్కి" ఇక్కడి దేవతలు పంచమజాతి వారికి వరాలు ఇవ్వరు అని నన్ను ఓదార్చింది. కానీ, నాలో ప్రజ్వరిల్లుతున్న అవమానాగ్నిని ఆ ఓదార్పు చల్లార్చలేకపోయింది.

ఆనాడే నాకొక దృశ్యం చూడాలని తహతహ చెందాను. అన్ని కులాల బాలురు ఇసుమంత కూడ భేదము లేక... తిరిగే సుందర వనాన్ని చూడాలని, 'అంటరానితనం' అనేది ఎంతటి కుసంస్కారమో, దానిని కాపాడుతూ వచ్చిన సంస్కృతి ఎంతటి కుత్సితమైనదో ఆనాడే తెలిసింది.

**తల్లిదండ్రులెప్పుడు నేర్పగరాదు కుల**

**గోత్రముల వారి గొప్పతనము**

**చదివింపగారాదు చదువులయ్యలు**

**పాఠ్యశాలల లోనవర్ణాల గొడవ**

**రచియింప గారాదు రచయితల్ శాశ్వత**

**దాస్యంబు నిలుపు కథానకములు**

**సలుపరాదెట్టి ప్రచారంబు లీ దినం నం**

**బదులునందున్న కృత్రిమపు సంస్థ**

**లన్నదమ్ముల తనమున కడ్డువచ్చు**

**శబ్ద జాండంబు సర్వంబు చావవలయు.....**

అంటరానితనాన్ని నిర్మూలించడానికై పలనాటి బ్రహ్మనాయుడు అంతకు ముందే 'చాపకూడు' ఉత్సవాలు చేసినా, వీర కన్నమదాసును తన బిడ్డగా పెంచుకున్నా నాటి మానవత్వం, పందొమ్మిది వందల సంవత్సరానికి కూడా తొంగి చూడలేదంటే, ఛాంధసం, మౌఢ్యం ఎంత గట్టిదో తెలిసింది, హేతుజ్ఞానం దురనివ్వని మౌఢ్యం అది.

ప్రజలంతా ఆనందించే సాంస్కృతిక రంగం ఆనాడు వీధి నాటకాలు, తోలుబొమ్మలు, బుర్రకథలు, సుద్దులు... ఆ తర్వాత నాగరికత మెరుగై నాటకాలు, వీటన్నింటినీ దూరంగా కూర్చొని అంటరానివారు ఆనందించాల్సిందే...?!

ఏదో ఒక ఇంటిలోనో, డేరాలలోనో 'నాటకాలు' వేసేవారు.

ఒకనాడు మా ఊరిలో నాటకం వేస్తున్నారు. ఆనాడు దప్పు వాయించి వీధి వీధికీ తెలియచేసే విధానమే ఉంది. ఆ దప్పు వాయించేవాడూ, అంటరానివాడే, నాటకం ప్రకటన చేస్తూ, అతడు మరో ప్రకటన మరింత గట్టిగా అరచి చెప్పుతున్నాడు.

.......

'అంటరానివారు నాటకంలోనికి రాకూడదహో' అని అంటున్నవాడు. అంటరానివాడే తన వారిని తానే రావద్దని చెప్పడు.... అతనిలో ఉద్వేగం గాని, రోషచిహ్నాలుగాని లేకుండా...

ఇదీ బానిసత్వంలోని స్తబ్దత. బానిస మనస్థితి మనిషిని ఏ మాత్రం ఎదురించనీయదు. రోషం చెందనీయదు. అలవాటుగా మారిన అవమానం అవమానంగా భావించరు. అత్యధికులు ఆచరిస్తున్న అధర్మం.... అసత్యం... అన్యాయం... దురాచారం సాధారణమైనప్పుడు..... దానికి కులం కట్టుబాటు, మతాచారం, దైవనిర్ణయం, కర్మ అండదండలుంటాయి. ప్రజలను తిరుగుబాటు చేయనీయదు.

ఆ కాలానికే దేశం నలుమూలల నుండీ సంస్కరణ గాలులు వీస్తున్నా, మత ఛాందసంలో మగ్గిపోయిన ఆలోచనలకు కొత్త భావాల చురకలు తగలలేదు.

ఆ నాటకం చూడాలనే ఆతృతను, ఉత్సాహాన్ని నా స్నేహితుడు గమనించి "నేను తీసుకుపోతాను, నా వెంటరా" అంటూ నాటకశాలకు వెళ్ళాము. టిక్కెట్లు అమ్మే వ్యక్తి నన్ను తేరిపార చూచి" అంటరాని వారికి ప్రవేశం లేదు. నీవు లోనికి రాకూడదు" అంటూ అవమానపరిచినాడు. ఆ అవమానం నన్ను వెంటాడింది చాలా ఏండ్లు. సమాజం ఆచారమనే పేరుతో తోటి మనిషిపై ఎంతటి అత్యాచారం జరుపుతున్నదో ఆనాడే అర్థమయింది. కానీ ఆనాడు అవమానాన్ని తిప్పికొట్టే శక్తిగాని, ఎదురు తిరిగే ధైర్యమూగాని లేదు.

"అంటరానితనం అంతటా ఎదురౌతూనే ఉంది. కానీ ఒకే ఒక్కచోట నాకు కనిపించలేదు. అది శ్మశానం. అచ్చట నడిచే మానవజీవం లేదు. పలుకరించే స్నేహం లేదు, అయినా ఆ స్థలం నాకు నచ్చింది.

**"ఇట నస్పృశ్యత సంచరించుటకు తావేలేదు విశ్వంభరా**
**నటనంబున్ గబళించి గర్భమున విస్వస్తంబు గావించి యు,**
**త్కవపుం బెబ్బులితోడ, మేకనొక ప్రక్కన జేర్చి జో కొట్టి యూ**
**రట కల్పించు అభేద భావము, ధర్మం బిందుకారాడెడిన్**

అంటరాని వాని రెక్కల కష్టము లేకుంటే సస్యరమ పండ సంశయిస్తుంది. అతని చెమటలో తడవనిదే కంకి పుష్పించదు. మొత్తం ప్రపంచానికే భోజనం పెట్టేవాడు వానికి మాత్రం భుక్తి లేదు. త్రాగేనీరు దొరకదు.

ఆ నిర్మల బావి నీరు హిందూవులకే, ఆ తియ్యని నీరు పంచముల కందవు అది ఏమి న్యాయం అని అడిగే వాడేలేదు ఆనాడు.

మా ఇంటికెదురుగా నున్న ఆ పున్నాగి వృక్షాల తోపులో నున్నది కుమ్మరి కుంటబావి. దాహం వేసినా ఆ బావి గోడలు కూడా తాకటానికి అర్హతలేదు, పంచమునికి,

ఈ నాటికి అది తలంచుకుంటేనే నా శరీరం అవమానంతో కాలిపోతుంది.

ఆ వినుకొండకు క్రైస్తవ మిషనరీలు వచ్చి వారి బంగళా ఆవరణలో బావి త్రవ్వించారు. ఆ బావినీరు కమ్మదనంలో నిర్మల బావిని తలదన్నింది. అది క్రైస్తవులకే కాదు, అంటరాని వారికి అన్ని కులాలవారు ఆ బావి నీటికై వచ్చేవారు, కానీ తమాషా ఏమిటంటే నీళ్ళు తోడి తాడును ముట్టుకోవచ్చు. బక్కెట్టులోని నీరు వారే బిందెలోకి వంచుకునేవారు ! అది కూడా తీరని అవమానంగా మాకు తోచలేదు.

ఆనాడు కూడా అస్పృశ్యులు అనబడుతున్న వారే మెజారిటీ కులం క్రైస్తవం తీసుకున్నవారు. హిందూవులు గానే మిగిలినవారు, ఇద్దరి స్థితిలోనూ తేడా ఏమిలేదు. అస్పృశ్యత, వెలి, పేదరికం, కట్టు బానిసత్వం అవమానం.... మొదలైనవన్నీ నిశ్చైతన్యం, ఆకర్మణ్యం యీ మెజారిటీ కులం యొక్క యోగ్యత ఆస్తి. ఆనాడు వీరిని మైనారిటీ కులం ఏలుతూనే వుంది. శాసిస్తూనే ఉంది. "ఉన్నతం" అనే నిరంకుశత్వపు అహంకృతి సాగుతూనే ఉంది. యీ బలహీనుడు, బక్కవాడు, చంఢాలుడు తనకు లోబడి ఉండడమే శాస్త్ర సమ్మతం అని నమ్మి ఆ మత్తులోనే ఉంది సమాజం.

నా బాల్యంలో యిటువంటి అహంకృతుల వలనే కళలు అవమానం పొందాయి. ఈ అవమానాన్ని ఎదిరించే శక్తి కనబరచిన నా ఉక్రోశాన్ని చూచి ఇరుగు పొరుగు నాకిచ్చిన బిరుదు "కటికి పోకిరి వీడు".

**"చచ్చిన పొద్దు తూరుపున జన్మము నెత్తుట ఎరుంగకుండ నా**
**నెచ్చలి కాంద్రతో గలసి నేను చతుర్ముఖశాస్త్రకేళిలో**
**బుచ్చితి కాలమున్, "కటికిపోకిరివీడని" యూరువారు వా**
**క్రుచ్చుట మొన్న మొన్నంటి వరకున్ నినదించె శ్రవోయుగంబునన్ !**

* * *

# ప్రకృతి నా పంతులమ్మ

**"Three years she grow in Sun and shower**
**Then nature said 'A Loveier Hower'**
**On earth was never so on**
**This child I to my self will take**
**She shall be mine, and I will**
**Make a lady of my own"**

**- Wordsworth**

నేను ఎదుగుతున్న కొలదీ ఆటస్థలాలు నిషేధం విధించాయి, చలనం, పలుకూ లేని బావులు సహితం దూరం, దూరం అన్నాయి. ఏమిటీ వ్యత్యయం? ఎందుకీ దూరం? ఇది యీనాటి సాంఘిక నియమం.... అని సరి పుచ్చుకోమన్నది తల్లి ......

**నా హృదయం సరిపుచ్చుకోలేదు. ఎదురు తిరగమంది... ప్రశ్నించమంటున్నది.... "అగ్రకులాలు ఉండే వీథులూ ఇటు నడవవద్దు అని చట్టం చేసాయి".**

**బడులలోనూ నాకు వేరే స్థలం చూపాయి...**

**నేను నడుస్తున్న దారి కూడ నన్ను వెక్కిరించింది.**

ఈ భావసంచలనంలో నలుగుతున్న నన్ను ప్రకృతి ఆహ్వానించింది. ఆనందాన్ని పంచింది. పశువు, పక్షి స్నేహితులైనాయి. ఎవరు నువ్వు? అన్న ప్రశ్నే లేదు. దూరం దూరం అన్న యీసడింపూ లేదు. ప్రకృతి సమతను నేర్పింది. స్నేహం అందించింది.

ఏట్రింత పిట్ట పైకెగసి పల్టీకొట్టి ఒయ్యారంగా నేలకు దిగుతూ.... నాకు స్వేచ్ఛలోని నిర్భయ జీవితాన్ని చూపించింది. తుమ్మకొమ్మల నుండి గుడగుడ ధ్వనులు చేసే గువ్వజంట నాకు చెలిమిలోని విశ్వాసాన్ని అందించింది. చెట్లకొమ్మల పై దాగి చెవులు

గింగుర్లు పోయేట్లు ధ్వనులు చేస్తూ యీల పురుగులు..... అన్యాయాన్ని అరచి చెప్పడం నేర్పాయి.

చిలుకలు, గోరువంకలు, తొమ్మిది రంగుల పొన్నంగి పిట్టల చెలిమి నాలో ఆనందాన్ని అలికి పెట్టాయి. కుక్కలు విశ్వాసాన్ని రుచి చూపితే, ముంగిసలు ప్రేమకు పాదులు చేశాయి.

జ్ఞానవంతుడనని మిడిసిపడే మనిషికన్నా, జంతుజాలం, శాంతిస్థాపనలో ప్రథమం అనే సత్యం బోధపడింది.

చిరుజల్లులు, నీరెండ కలిసిరాగా ఆకాశాన హరివిల్లు విరిసి హాయిని అందించితే, రంగు రంగుల సీతాకోకచిలుకలలో నాకు స్వర్గాలు కనిపించాయి. జొన్న, సజ్జ, ఆకులపై ఆడే రంగురంగుల జీరంగి పురుగులు నా ఆకలిని మరిపించేవి. వేలకు వేలు పికిలి పిట్టగుంపులు సహజీవన ధర్మాన్ని బోధించాయి.

ప్రకృతిని ఆనందించగల నేత్రాలే వుండాలే కానీ చిన్ని చిన్ని గడ్డిపూలలోనూ ప్రణయలతలు చిగురిస్తాయి.

"నీలో రమ్యాలోకనం కనుకవుంటే ఒక్క గడ్డిపరక మీదనే రత్న ఖచ్చితమైన సౌధాన్ని నిర్మించగలవు. నీలో రమ్యాలోకనం లేకుంటే ఆ ఒక్కగడ్డి పరకే ఆ అద్భుత సౌధాన్ని దాచివేస్తుంది"

**– జపాన్ జన్ ఆచార్యులు**

ప్రకృతికీ, మానవజీవితాన్ని విడదీయలేని అవినాభావ సంబంధం ఉంది. అవ్యక్తమైన సౌఖ్యం వుంది. ప్రకృతితో స్నేహం మనిషిలో మార్ధవాన్ని పెంచుతుంది.

వినుకొండా ! నీ చుట్టూ వున్న నల్లమల అడవి, కొండలూ, వృక్షాల తోపులలో ఎన్ని జంతువులు, పక్షులు జీవించేవో, మనిషిపై ఆధారపడక, జింకలు గుంపులు, గుంపులుగా విహరిస్తూ ఉండేవి. చిరుతపులులు, కొంగ్రాసిగాళ్ళు, నక్కలు, వంటి నిండా ముళ్లకలాలు నింపుకున్న ఏదుపందులు ! ఒక్క దెబ్బతో కాళ్లు విరగొట్ట కలిగినంత పదునైన కోరలుగల అడవి పందులు ఎన్నో చూచాను. మనిషి వాటికి హాని తలపెట్టకుంటే అవి మనిషి వైపే చూడవు. అంతటి సహజీవనం వాటికి.

నల్లమల అడవి ఎంత పచ్చగా ఉండేదో, మా ఊరంతా పెద్ద పెద్ద వృక్షాలు నీడ గొడుగులు పట్టి, చల్లని గాలిని, విసురుతూ హాయిని గూర్చేవి.

శీతాకాలపు చల్లగాలికి ఆ పున్నాగి పూలవాసనలు పులిమి మాపై చల్లేవి ఆ పున్నాగి తోపులు, వసంతకాలపు చల్లని వాతావరణం మామిడి పూలవాసనలు శరీరమంతా పట్టించుకోనేది.

తూర్పున పొడుపు చుక్కతోపాటు నిద్రలేచి, కవితాగానం చేయడం, నా అలవాటు "వేగురుచుక్కతో నిలిపివేసిన నీ రచించు లేఖకు కాగితమైన ఆకసము"....అని గానం ఆలాపన చేస్తూ.. తూర్పు వెత్తావులు అభిరామములయిన దాకా ఆ గానం సాగుతూ ఉండేది.

ఉగాది ప్రవేశించే ఉదయాలు ఆ వేపపూలతో పాటు మల్లెల అత్తరలు చల్లుకొని వచ్చేవి.

ఖాళీస్థలాలన్నీ నాగజెముడు, ముళ్ళ దుబ్బులతో నిండి, పాములకు, తేళ్ళకు గృహాలు కట్టించి యిచ్చినా, అవి అందించే ఎర్రని పళ్ళు ఎంత మధురంగా వుండేవో, పేదల ఆకలి తీర్చే మిఠాయి పొట్లాలు అవి.

రాజకీయాల ఉపన్యాసాల హోరుగాని, వీధుల్లో మైకుల బాకాలు, గ్రూపుల, ముఠాల, కక్షల కార్పణ్యాల అసహన వాతావరణం, యీ నిరాడంబర జీవితాలను అంటని కాలం అది. కులాల మతాల వారీగా వీధులు, పేటలు, ఉండేవి. గుడులు, మసీదులు, చర్చి ఉన్నాయి. పొలిమేరలను కాపలా కాసే చిల్లర సత్తులు... మరి వీరంతా పరస్పర కలహాలు పెంచుకొని పోషించుకున్నట్లు నేను ఏనాడూ చూడలేదు.

ప్రతీ కులానికి వారి వారి వృత్తులు, ఆ వృత్తుల వలన సంపాదించే డబ్బుతో ఇచ్చి పుచ్చుకొనే వ్యవహారం, సాఫీగా సాగిపోతూ ఉండే రోజువారీ సాదాసీదా దినచర్య ఆనాటి ప్రకృతి.

ప్రకృతిని ఆనందించడమేకాదు పలకరించాలి. స్నేహం పెంచుకోవాలి. కాపాడుకోవాలి. నేను ప్రకృతిని ఆనందించి, పలకరించి బాంధవ్యం పెంచుకున్నాను....

......జాషువాలోని ప్రకృతి హృదయాన్ని సంజీవ్‌దేవ్ పలుకుల్లో "ఉత్తమ కవితా ధర్మం మానవుని విశ్వమానవునిగా మలచడం. కులమత దేశ, వర్గ హద్దుల్లో లోబడి ఉన్నంత వరకూ నిజమైన కవి కాజాలడు. మానవుడు అతనిలో రస హృదయం స్పందించజాలదు. జాషువా తనను తాను విశ్వనరునిగా ప్రకటించుకొన్నాడు. తన కవితలో నిజమైన రస హృదయం విశ్వనరునిలో స్పందిస్తుంది.

ఈ రస హృదయం ప్రకృతిలోని ప్రతి చిన్న విషయం. ప్రతి అప్రముఖజీవి, ప్రతి స్వల్ప వస్తువు ఆయనకు కవితా సామాగ్రి. అల్పమనీ, అనల్పమనీ తారతమ్యము కనిపించదు.

గిజిగాడును ఎందురు చూడరు? కానీ జాషువా చూచింది వేరు.

**"తేలీక గడ్డి పోచలను దెచ్చి రచించెద**

**నీవు తూగుటుయ్యేల గృహంబు**
**మానవుల కేరికి సాధ్యము గాదు. వానిలో**
**జాలరు, అందులో జిలుగు శయ్యలు**
**అంతిపురంబు లోప్పగా మేలు భళీ!**
**పులుగు టెకిమీదవురాగిజగాడ ! నీడజ !**

అలాగే ఒక మూలనో, ఎక్కడో గూడు అల్లే సాలీడును చూచాడు....

**"నీలో నూలు తయారు జేయు మరగానీ ప్రత్తి రాట్నంబుగా**
**నీలే, దీశ్వరశక్తి నీ కడుపులోనే లీనమై యుండునో**
**యే లీలన్ రచియింతునీ జిలుగు నూలీపట్టు పుట్టంబులో**
**సాలీడా ! నిను మోసగాడవని విశ్వంబేల ఘోషించెడిన్ !**

శ్మశాన వాటిక ఆయనకు జీవన వేదాంతం నేర్పిన భూమి.

**"ఒకానొకనాడు కాళిదాసభారవుల శరీరములీ ప్రకృతి రంగము**
**నందిపుడెంత లేచి రేణువులయి మృత్తికం గలిసెనో కదా కుమ్మరి వాని సారె పై"**

"ప్రతి హృదయంలోనూ ఉంటుంది. కవిత నిద్రాణమై. దాన్ని మేల్కొల్పడం ఒక రససాధన జాషువాలో అది మేల్కొని ఉండటం మాత్రమేకాక పూర్ణ జీవంగా కూడా ఉంది. అందుకే ఆయన రచనలు రసప్లావితాలు"

**-సంజీవ్‌దేవ్**

ఎదుగుతున్న కొలదీ నాలో కవిత పొంగుతూ ఉండేది. ఉత్తరాన ఆ రైలు కట్టదాటి వ్యాహ్యాళికి పోయినపుడు, స్నేహితులతో వేటకు పోయినప్పుడు, ఆ మసీదులో పగలు గడిపినపుడు... యిలా ఎన్నో స్థలాలలో ప్రతిక్షణం నాలోని పరిశీలనా చక్షువు నా కవిత్వానికి దృశ్యాలనందించింది.

(సాయంకాలపు వేళలో ఆరుబయట పడుకొని రూపాలు మార్చుకొనే మబ్బులను, ఆగడపు మబ్బుల క్రింద ఎగిరే పక్షులను చూస్తూ ఉండటం చాల ఇష్టమైన కార్యక్రమం నాన్నగారికి.....

**- హేమలత)**

**"కుంకుమ పంకముంబులము కొన్నవి తూరపు కొండ నెత్తముల్**
**పంకజ బాంధువుం దరుణ పాదములన్నిగిడించె, యింటనే**
**ణాంకుడు చిన్నవోయి చర మాచల సానుతటంబు లెక్కిమై**
**జింకయు, దాను గడ్డిగరచెన్, బెను చీకటు లార్చె గాకులై"**

మానవ జీవన గమనానికి ప్రకృతి సహకారం అనన్యం. అనంతం, ప్రకృతిని నష్టపరచితే మానవ జీవనం సెగలు పొగలతో నిండిపోతుంది. ప్రకృతిని నాశనం చేసుకుంటే మానవ మనుగడే ఉండదు.

**"సృష్టిలోన నరుదు సృష్టియై జన్మించి సృష్టి భంగపుచ్చ నిచ్చగించు**
**చిరుత చీమ శిరసు చిదిమి మరల దాని నదుకు బెట్ట శక్యమగునేధరన్ ?**

మానవ ప్రకృతికి, సహజ ప్రకృతి అందించు ఉత్తమోత్తమ గుణం మాతృప్రేమ.

పాడియావు తన పొదుగు గిన్నెలో పాలుపోసి లేగదూడ నోటికి అందిస్తుంది. పక్షి తన ఆహారపు తిత్తులలో తెచ్చిన మేతను బిడ్డకు తినిపించుతుంది. తల్లి కుక్క తన నోటితో ఆహారం తెచ్చికూనలకు అందిస్తుంది. తన పొట్టకు బిడ్డను అతికించుకొని పొరపాటు జరగని జాగరూకతలో కోతి కొమ్మ కొమ్మకూ తిరుగుతుంది. ప్రకృతిని గమనిస్తూ పరిశీలించుతూ పోతే మనిషి నేర్చుకోదగిన గుణాలెన్నో మనలను ఆహ్వానిస్తాయి.

ప్రకృతిలోని అనేక ప్రాణులకు వృక్షాలకు నోరులేదు. కాని అవి మనకు గురువులై బోధిస్తాయి.

**కుంపటిలో కోడి పొదిగి పిల్లలు చేసి, గింజలు ఏరుకొనడం నేర్పుతుంది...**
**ముందు పుట్టిన తీగ ఎగబ్రాకి లేగ తీగకు ప్రాకటం నేర్పుతుంది....**
**ముందు పుట్టిన అన్న తమ్ముని చిటికన వేలు పట్టుకొని నడవడం నేర్పుతాడు.**

మానవుని  భగవంతుడు సృష్టించాడో, లేదో దాఖలాలు లేవు. ఈ సమాజాన్ని మాత్రం మానవుడే నిర్మించుకున్నాడు. నియమ, నిబద్ధతలు ఏర్పరచుకున్నాడు. ప్రేమానురాగాలు, స్నేహ సహకారాలుగల కుటుంబాలను పెంచుకున్నాడు. ఈ మానవుడే సమాజ సృష్టిని సంస్కరించదలచుకుంటే ప్రకృతి నేర్పుతున్న అందించనున్న మానవత ప్రేమానురాగాల హృదయాలను సృష్టించుకుందాం......

పుష్పగుచ్ఛం మకరందాన్ని నింపుకొని తేనెటీగలకు భోజనం పెట్టె చుట్టరికము .......ఆలిచిప్పలకు ముత్యాలవంటి పాపలను యిచ్చే స్వాతిచినుకుల దాంపత్యం...

కష్టజీవుల మేని పైని శ్రమ బిందువులను లేత ఆకుల విసురుతూ, చెమట పోగొట్టి ఓదార్చి, సేదతీర్చే పిల్ల వాయువుల ప్రేమ...

లేత ఆకుల హస్తాలతో రారమ్మని పిలిచి నీడ గొడుగులు పట్టి సేదతీర్పె వృక్ష రాజముల లోని దాన ధర్మగుణము... మాలో పెరగాలి.

ఆ బాట పక్కన పూచిన చిన్నిగడ్డి పువ్వు, వినీలాకాశం వేపు తలెత్తి, పిల్ల తెమ్మరుల వీవనకు ఆనందంగా ఊగిపోతూ ఉన్న సమయాన, ....... ఒక మానవపాదం తలపై పడబోతున్నప్పుడు... ఒణికిపోతూ, అన్నదట, "సోదరా ! కన్నులుదించి చూడు, నీ పాదం నా అందమైన తలను చితగొట్టపోతున్నది!"....

ప్రకృతిలో దృశ్యమాధుర్యం అనంతం. అది మానవ మానసానికి రస మాధుర్యాన్ని అందిస్తాయి.

"స్వయంవరం"లో స్వరాజ్యకన్య యీ దేశమంతా తిరిగి జరుగుతున్న అనేకానేక దుఃఖగాధలను, దృశ్యాలనుచూచి పరితప్త హృదయమై, అటు హిమాలయ పర్వత ప్రాంతాలకు పోయింది.

అక్కడి ప్రకృతి ఆమెకు విభిన్న దృశ్యాన్ని, ఆనందమయ సౌందర్యాన్ని అందించింది. ముగ్ధ ఉజ్వల నేత్రాలతో చూచి ప్రకృతి మౌనంగా బోధిస్తున్న మహోన్నత గుణాలను, ధర్మాలను తిలకించి తన్మయురాలైంది. ఆ దృశ్యాలు ఆమె హృదయాన అంకితమైపోయినవి....

**"అగుపించె శిఖరాలు దిగివచ్చు సెలయేటి తరగలో నడయాడు దానదీప్తి**
**కనుపెట్టే స్వాతి మేఘాల గర్భమునందు తప్త భూతలము నోదార్చు చలువ**
**దీపించె బ్రతిచిన్ని తీవ సుందరియందు నాలింగన ప్రణయానురక్తి**
**తోచె ప్రభాత వాతూల బాలకులందుముట్టి మూపులు తట్టిపోవు మైత్రి "**

త్యాగులైన వారి ధర్మసందేశంబు ఆచరించు ప్రకృతి అభినుతించి ఆ స్వరాజ్యకన్య ఆత్మలో గల చింతలెల్ల మరచె మేను పల్లవింప....

ఎండి పగుళ్ళు పడిన భూమిని తడిపి సేద దీర్చమని ఆ వర్షాన్ని ఎవరడిగినారు? ఆ అవ్యాజ ప్రేమ నందించే మహనీయత ప్రకృతికే ఉన్నది. అదే మహనీయత జ్ఞానధనుడైన మానవునిలో పుష్పించి ఫలించినప్పుడు సమాజపు హెచ్చుతగ్గులు పూడి సమతను, సఖ్యతను పంచి పెట్టగలదనే ఆశ....

ఆ 'అనాధ' కష్టాల కడలి దాటి భవిష్యత్తు వేపు నడుస్తున్నప్పుడు, ఒక్క జడివాన కురిసి

**'ఆకటం దూలు సస్యశ్యామల క్షేత్ర కన్య గర్భము చల్లగ భుజించె**
**బక్కచిక్కిన కొండవాగు తటాకంబు చిటుకలో ఉప్పొంగి చియ్యబట్టె**
**ముమ్మాయి ముత్యంబు  బోలి తామర మీద వర్షబిందువు తాండవంబు చేసే**
**నడయాడ రతనంబు వడువున నాడాడ ఆరుద్ర పురువు ప్రత్యక్షమయ్యె**
**చెలగి చేయార దానంబు చేసి చేసి కొరత వడియున్న వాని కాపురము వోలి**
**ఉబ్బుసెడి తూలెనొక చిన్ని మబ్బుతునక ఉత్తరంబుగ దిక్కుల కొత్తిగిల్లి.**

"ప్రకృతిని వెయ్యి కళ్ళతో పరిశీలించిన కవీంద్రుడు జాషువా – చూచిన ప్రతి దృశ్యాన్నీ తన హృదయంలో సౌందర్య, చైతన్యాలతో ఆశతో, ఆప్యాయతలతో ప్రతిఫలించుకొన్న మహాద్రష్ట"

– సంజీవ్‌దేవ్

**"ముంజేత పడునెన్న పూస ముద్దలవంటి**
**మింటి చుక్కలతోడ మేలమాడి**
**మొగిలి పుప్పొడి వర్షమును బోలుతఅచైన**
**పొగమంచు తెరల దోబూచులాడి**
**కటికి సంధ్యాగ్నిలో గరగి పోవని క్రొత్త**
**స్వాతి మబ్బు గుఱాల స్వారీ జేసి**
**చదలేటి నీట మజ్జన మాడు తెరగంటి**
**రాచకన్నెలమీద రాలురువ్వి"**
**మంచువాలు చందమామ మండలమున**

ఇల్లు మరచి తిరుగు పిల్లవాని వలె జాషువా యీ ప్రకృతిలో అల్లిబిల్లిగా తిరిగినాడు.

* * *

# జంతు, పక్షి సంతతి నా మిత్రులు

**జా**షువా తన యీ మిత్రులను ఆఖరి విశ్వాసం వరకూ పెంచి, ప్రేమించి గౌరవించారు.

ఆ రోజు బాగా వర్షం. రోడ్డు ప్రక్కన వున్న చిన్న గుబురు మొక్క మొదట్లో ఒక బక్కచిక్కిన కుక్కపిల్ల చలికి ఒణుకుతూ కూర్చుంది. దాని ముఖంలో ఎంతో నిస్సహాయత, దీనత్వం. ఆ దారినే వెళుతున్న నాన్నగారి కంటబడింది. ఆ కుక్కపిల్లను తెచ్చి, నాకిచ్చి అన్నం పెట్టమన్నారు. ఆ బక్కచిక్కిన పొట్ట ఒక్కసారిగా తిన్న అన్నాన్ని అరాయించు కోలేకపోయిందేమో. ఆ మరునాడు అది చనిపోయింది. ప్రతివారూ యీ విశ్వాసం నిండిన మూగజీవిని పెంచుకుంటే.... ఎంత బాగుండును.

కుక్కల మీద యీ ప్రేమలత ఆయనలో చిన్ననాటి నుండీ తీగలుగా సాగి పుష్పించింది. చిన్నతనంలో ఆయన జాకీ అనే కుక్కను పెంచారు. జాకీ అంటే ప్రేమ, యజమాని అంటే జాకీకి ప్రాణ సమానం. దాని లావుపాటి ముక్కును నొక్కడం అంటే ఆయనకు ముద్దు. ఎంత గట్టిగా నొక్కినా అది కోపగించేది కాదుట. మరీ నొప్పి కలిగినప్పుడు తన కోరలు తగలకుండా కొరికి, తనకు బాధగా ఉంది అని తెలియజేసేదట.

ఒకనాటి సాయంకాలాన ఊరికి దక్షిణాన ఉన్న ఆంజనేయుని గుడి పరిసర ప్రాంతాన ఒక పచ్చిక బయలుపై కూర్చుండి కవితాగానం చేస్తున్నారు జాషువా ఆయన స్నేహితుడు. గాత్రం వినసొంపుగా ఉంటుంది మిత్రునిది.

అంతలో ఆ గుడిలో నుండి వైష్ణవుడు, పూజారి, తొండం ఒక్కటే తక్కువగా నున్న నల్లని శరీరం దానిపై పెద్ద పెద్ద పట్టీ పంగనామాలు, పిలకతో నున్నటి బొజ్జతో కదిలి వచ్చి....

"నీ పాటకు నా పూజ వదలి వచ్చాను.... అయ్యో ఇంతటి గాయకుడవు. బ్రాహ్మణ కులాన పుట్టక, పాపపు సాతాను కులాన పాలైతివిగదా"... అంతట నాన్నగారిని చూచి

లలితకళల ప్రస్తావన తెచ్చి నీవేదో కవిత యేదుస్తావట! భూమిపై బ్రాహ్మణులు దక్క ఇతర జాతులు కవితలల్లరాదు అంటారు వేదపండితులు....

బ్రాహ్మణ స్త్రీని చెరపట్టిన వానిని, కవితలల్లిన వానిని నరికినా పాపం లేదని పురాణ ధర్మసూత్రాలు ఘోషిస్తున్నాయి" అని నాకు కొంత, మిత్రునికి కొంత చురుక్కుమనే మాటల ఈటెలతో కుత్సిత మతితో వినిపించినాడు. దొంగనీతులు పరమ ఛాందస భావములు గల వానితో వాదన చేసే పాటి సమర్థత లేక మిత్రుడు నేను ఆ పరమ ఘాతకమైన ధర్మాలు ఆలకించి లేచి గృహోన్ముఖులమైనారు.

ఆ బ్రాహ్మణుడు విసిరిన బాణాలకు మనసున ఆరిపోని నిప్పుపెట్టినట్లైంది. ఇటువంటి క్రూర ధర్మాలు నాటియున్న యీ భూమిపై నా వంటి కళా తపస్వికి పేరు ప్రతిష్ట గుర్తింపు రావడం దుర్లభం అని నిస్పృహతో ఇల్లు చేరాను....

అప్పుడు ఆయన్ను ఓదార్చినది ఎవరు? "ప్రియ మిత్రుడు జాకీ.... తోకాడించుచు వచ్చి, వ్యక్తం చేయలేని మూగవాత్సల్యాన్ని చూపించి, నాపై కెగసి, నా ముఖాన్ని తాకుతూ, నా పాదాలను, చేతులను నాకుతూ". ... ఆయన హృదయ చింతను పోగొట్టింది. దానిని కౌగలించుకొని, "యీ విశ్వమంతా ఏకమై ద్వేషించినా, నా జాకీ! నిన్ను నన్ను ఎడబాటు చేయగల శక్తి లేదురా" అంటూ కన్నీరు నించుతూ ముద్దాడితిని.

**"పెట్టుంబోతలు సన్నగిల్లెననుచున్ విశ్వాస హీనాత్ములై**
**చుట్టాలుంచనివారు; నీ కడుపు చిచ్చున్ దీర్పు మృష్టాన్నమున్**
**పెట్టన్ జాలని నాయెడ న్గలుగు నీ ప్రేమానుబంధంబహో**
**పట్టున్వీడదు! నీ కృతజ్ఞతకు నా స్వాంతంబు నీరయ్యెడిన్**

ఒకసారి జాకీ నిద్రలో ఉండగా దాని నల్లని ముక్కును నొక్కారు. మరో కుక్క తన పైకి వచ్చిందనే భ్రమతో నాన్నగారి చేతిని అది కొరకడం, రక్తం కారడం. లింగమ్మ జాకీని తీవ్రంగా కోపగించి కొట్టడం జరిగింది. అంతే, మూడు రోజులు ఇంటిముఖం చూడలేదు. మూడవనాడు తలదించుకొని "తప్పు క్షమించు" అన్నట్టు వచ్చింది.

"నీ తప్పు లేదురా జాకీగా" అన్ని నాన్నగారు దానిని ముద్దులాడితే, దాని భారం తగ్గి, నాన్నగారు కిందపడేటంతగా అది ముద్దులాడింది.

మా తాతగారు ఒక వివాహం జరిపే నిమిత్తం ప్రక్క గ్రామానికి వెళ్ళారు. ఆయనకు తోడుగా జాకీ వెళ్ళింది. అది మండు వేసవి. తిరుగు ప్రయాణంలో తాతగారు స్పృహ కోల్పోయారు. జాకీ ఆయన చుట్టూ తిరిగి జవాబు లేకపోయేటప్పటికి అది ఇంటికి పరుగుతీసింది. నాయనమ్మ జాకీని చూసి విషయం అర్థం చేసుకుని మంచినీళ్ళ చెంబు అందుకోగానే జాకీ దారి చూపించింది.

జాకీ చేసిన అనేక పనులను చెప్పుతూ నాన్నగారు ఆనందాన్ని పొందేవారు. ఒకసారి ప్రక్క ఇంటిలో దొంగలు పడ్డారు. ఆ రోజుల్లో చీకటి పడిందంటే ఊరికి ఏదో మూల నుండి "దొంగలు" "దొంగలు" అనే అరుపులు వినపడేవి. దొంగలు కొట్టిన ఏడుపులు వినపడేవి. పోలీసు స్టేషన్లు ఎంతో దూరం పోలీసులకు గుర్రాలే వాహనాలు. అవీ అన్ని స్టేషన్లలో ఉండేవి కావు. దొంగ ఎరుకులు, ఏనాదులు ఎక్కువగా దొంగతనం చేసేవారు.

జాకీ దొంగల వెంటబడి తరిమింది. దొంగలు రాళ్ళు విసిరితే దెబ్బలు తింటున్నా వారిని ఊరిపొలిమేర దాకా తరిమి కొట్టి మరీ వచ్చింది. ఆ దెబ్బలు మానకముందే ఇంటి పెరడులో త్రాచుపాముతో పోట్లాడి జాకీ మరణించింది. ఆ జాకీని సమాధి చేసి.... వేదనతో వ్రాసిన పద్యం.

**"ఏకాలంబుననో ఋణంబుపడి నన్నిన్నాళ్ళు సేవించి, నే**

**డీ కాయంబు పరిత్యజించితివి జాకీ నాకు మర్యాదతో**

**తోకాడింపుల స్వాగతంబు సంతోషించు నీ దృష్టికిన్**

**నాకన్నన్ మొనగాడు, ఉత్తముడు కన్పడదుగా ఉర్వరన్**

దీనులు, దరిద్రులు తినడానికి కడుపునిండా అన్నం దొరకని వారు ఆకటి చిచ్చుతో పడి నశించిన ఆ యీశాన్య దిశ నున్న వల్ల కాటిలో నా జాకీని సమాధి చేశాను" అంటారు.

ఆ తరువాత ఆయన టామీ లవంగి, కురంగి, బిజ్జు, ముద్దు... అనే కుక్కలను పెంచారు. కురంగి అనే కుక్క చిన్న బొమ్మ కుక్కంత ఉండేది. ఆయన కోటు జేబులో అది సరిపోయేది. ఆ కుక్క తన మరణం ఆసన్నమైనదని గ్రహించిందేమో (14 సంవత్సరాలు జీవించి జానెడు ఎత్తు మాత్రమే పెరిగి) నాన్నగారి పాదాల వద్ద కన్ను మూసింది.

**కమికందన్నము పెట్టకున్నను బుభుక్షా శుష్కితంబైనదే**

**హమునందు ప్రతిరక్తబిందువును నెయ్యంపు న్నిజస్వామి రూ**

**పమును దీపింప భుజించు శ్యానముల విశ్వాసంబురవ్వంత చుట్టము**

**లందు....! లేదు కదా అంటారు.**

కోతులు, ముంగిస పిల్లలు, కుందేళ్ళు, ఉడుతలు, ఆయనకు మిత్రులుగా మసలేవి. ఈ జంతువుల తిండి, నివాసం, చేష్టలు అలవాట్లు ఆయనకు కరతలామకం. పెంపుడు ముంగిస చిన్న పిల్లలా అలవాటై పోతుంది. మనలను వదలదు. నిద్రపోయే సమయంలో

నాన్నగారి మెడ చుట్టి పడుకొనేది. ముంగిస పామును చాకచక్యంగా ఒడిసి పడుతుందే తప్ప పామును అది తినదు.

ఉడుతలు తమ నివాసాన్ని చాలా మెత్తగా ఏర్పాటు చేసుకుంటాయి. గిజిగాడు చిన్నపిట్ట. తుమ్మకొమ్మలు ఎత్తైన కొమ్మలకు రెండు గడ్డి పోగులతో ఉయ్యాల గూడు కడుతుంది. ఆ అల్లకం నిజంగా అద్భుతం. ముక్కుతో చీల్చిన సన్నని గడ్డిపోగులతో కట్టి ఆ గూటిలోనికి వెళ్ళేదారి, వచ్చే దారి వేరువేరుగా ఉంటాయి. మెత్తని దూదితో పడక, రాత్రిపూట వెలుగుకోసం మిణుగురు పురుగు పట్టి గూటిలో దాస్తుంది.

రెండే ఆకులను జతచేసి కుట్టే దర్జీ పిట్ట. చెట్టుమానులో ముక్కుతో రంధ్రం చేసి నివసించే వడ్రంగి పిట్ట. చూరుల్లో చిన్నిగూడు నిర్మించే నల్లంచు... ఆనందాన్ని పంచే స్నేహితులు.

జంతువులు చేసే గొప్ప పనులు, కుక్క విశ్వాసం. జంతువులను దయగా చూచే వారి కథలను నాకు ఎన్నో చెప్పేవారు. నేను చదివిన కథలు వినేవారు. "మనుషులను తినే పులుల" కథలు వ్రాసిన జిమ్‌కార్బెట్ కథలు నా చేత చెప్పించుకుని వినేవారు.

అనంతాకాశా, రహస్యాలు తెలుసుకొని రమ్మని "లైకా" అనే కుక్క రోదసిలోకి పంపబడింది. వార్తలు పంపింది కానీ "లైకా" తిరిగి రాలేదు.... ఆ కబురు విని చలించిన ఆయన కలం....

"గుండెలు లేవు మానవులకున్ నినుబోలు అనంత రోదసీ మండల యాత్ర సేయ. యజమాను ఆజ్ఞశి రాన మల్లె పూ దండగ దాల్చి కృత్రిమ సుధాంశునితో పయనించి, ఈ జగత్కాండనుతుల్ గడించితి విశాలలయికాశునకాంగనామణీ"

దూడలను ఎండగట్టి, గడ్డిదూర్చి దూడగా భ్రమింపచేసి మోసంతో పాలు పితికే క్రూరత్వాన్ని నాన్నగారు నిరసించేవారు.

**"వలపులబిడ్డలం కటికి పస్తులతో హతమార్చి గడ్డి రూ**

**దల సృజయించి తెచ్చి ఎదుటన్ నిలబెట్టెదు క్రూరమర్త్యమం**

**దలముల మోసమున్ దెలిపి నవ్వు మొగంబుల**

**పాలొసంగు గోవుల సహన స్వభావము"**

అంటూ తన వేదన తెలుపుకున్నారు.

పాముల వలన ఎన్నో ప్రమాదాలు తనకు తప్పాయట. కవుజు పిట్టలు నాగజెముడు దుబ్బుల్లో గూళ్ళు కడతాయి. వాటిని పట్టడానికి ఉదయం మొదలు సాయంకాలం వరకూ కాపువేసి కూర్చున్న ఆయన పాదాలకు త్రాచు ఒకటి చుట్టుకుంది. ఈయన కేకలకు అదే ఒదలి పోయిందట" "పోనిలే కుర్రకుంక అనిందట!

జొన్నచేలలో జీరంగి పురుగులు పట్టుకుంటూ ఉండగా నల్లని త్రాచు ఐదుబారల పొడవు (కర్కోటకుడు అంటారట) కరిచేటంత దూరంలో పడగ విప్పింది. ఆ బుసకు యీయన అల్లంత దూరానకు ఎగిరిపడి పరుగో పరుగు!

చిన్నారి చీమలను, వాటి ఇండ్లను కూడ నిశిత పరిశీలన చేసేవారు.

"కలుపుంగోలు తనంబు తేటపడ ఉత్కంఠన్ మొగాలెత్తి మూతులు మూతుల్ గది యించి ముద్దుగొని సంతోషించు చిన్నారి చీమల యందున్న పరస్పర ప్రణయ సంపత్తి"ని.

కోకిల కాకి గూటిలో గుడ్లు పెట్టగా, వాటిని ప్రియమార పొదిగి పిల్లలు చేసిన కాకి ప్రేమను...

బాతుగుడ్లను తన గుడ్లుగా పొదిగి పిల్లలు చేసి, అవి వాటి సహజగుణంతో నీటిని చూడగానే నీటిలోకి ఉరికే బాతు పిల్లలకై గట్టు మీద నుండి తల్లిలా వేదన చెందే కోడి మమకారాన్ని! దుర్వృత్తికిన్, దిక్కై అసమాన కౌశలాన్ని వ్యర్థం చేసుకున్న సాలీడు నేర్పరితనాన్ని ఆయన పరిశీలించి వ్రాశారు.

మా ఇంటిలో కుక్కలు, పిల్లులు ఒకే కంచంలో తిని, ఒకేచోట పడుకోవడం- కురంగి కుక్క పిల్లిపిల్లకు పాలు ఇవ్వడం... సహజ జాతి వైరాన్ని వదలి మెలిగే వీటిని చూచి చూపరలు ఆశ్చర్యం ప్రకటించేవారు.

"మరి మనుషులం మనం ఎందుకు ఇలా ఉండలేము?" అని ప్రశ్నించేవారు.

నాన్నగారు కొంతకాలం వేట కూడా చేశారు. దానికై తుపాకీ కొన్నారు. మా అమ్మగారు చేసి యిచ్చే రొట్టెలు, అన్నం మూటలు ఏ అడవి కోనలోనో స్నేహితులతో సుష్టిగా భుజించి, కాలు అరిగేటట్లు గుట్టలు, కోనలు తిరిగి, గీరుకుపోయిన కాళ్ళతో సాయంత్రానికి అలసి ఇంటికి రావడమే వారి వేటలోని ప్రధాన అంశం.

తుపాకీ ఉన్నదన్న విషయం ఊరంతా పాకింది. కొందరు చాకలివాళ్ళు వచ్చి, చిరుతపులి నుండి వారి గాడిదలను రక్షించ కోరారు. పులివేట అనగానే యీ వేటగానికి ఎక్కడ లేని హుషారు పుట్టింది. "పులిని చంపిన వీరుడు" అని పేరు వస్తుంది.

ఆ మరునాడు తనతోటి పిట్టల వేటగాళ్ళను పోగుచేసుకున్నాడు. పిట్టల వేటగాళ్ళు తెగ ఉబలాట పడిపోతున్నారు. ఆ రాత్రి ఎనిమది గంటలకే, కొండ దిగువునున్న చాకలివీధికి వెళ్ళారు వేటగాళ్ళు. మాటు ఏర్పాటు చేసుకోవడానికి. ప్రతిరాత్రి పన్నెండు, ఒంటిగంట మధ్య ఊరుమాటు మణిగిన తరువాత పులి కొండదిగి మేకలు, గాడిదలు వున్న దొడ్డివైపు వస్తుంది. నాన్నగారు తుపాకితో తూటనింపి దొడ్డికి పది

గజాల దూరంలో పాత పడక కుర్చీలో పడుకున్నారు. మిగిలిన వేటగాళ్ళు అక్కడక్కడ మంచాలపై కూర్చున్నారు. కొందరు బాణాకర్ర, మరికొందరు ఉండేలు బద్దలు ధరించివున్నారు! అది మాంచి నడివేసవి. అంచేత ఆ వీధిలో చాలామంది ఆరుబయట మంచాలపై పడకలు వేసుకున్నారు. వారికీ యిది ఒక సరదా, అందరూ నిద్రలు పోగొట్టుకొని ఎదురుచూస్తున్నారు. పులిగారి రాకకై.

మేకల దొడ్డికి ఒక గజం ఎత్తులో మట్టిగోడ ఉంది. ఆ గోడ మీదుగా పులి వస్తుంది రోజూ. ఒక వేటగాడికి టార్చిలైటు ఇచ్చి గోడ మీదకు పులిరాగానే సరిగా సూటిగా దాని ముఖంపైకి లైటు వేయాలి.

ఆనాడు అమావాస్య. చీకటి చిక్కబడింది. అర్ధరాత్రి దాటింది. దొడ్డిలో మేకల అలజడి వినపడింది. పులి వచ్చినట్లుంది. వాతావరణం నిశ్శబ్దం. అక్కడక్కడ మంచాల నుండి 'గుర్రులు' వినబడుతున్నాయి.

టార్చిలైటు ధారిని నాన్నగారు మోచేత్తో పొడిచారో అంతే! లైటు సూటిగా గోడ మీద కూర్చున్న పులి కండ్లపై వెలిగింది. పులికండ్లు చిప్పుల్లా మెరిశాయి. ఢాం!! 'దబ్' అన్న శబ్దాలు ఒకేసారి మ్రోగాయి. తుఫాకీ ధారి కుర్చీ నుండి ఒక గెంతు గెంతుతూ 'వామ్మో'! పులి" అంటూ అరుపులు! పరుగులు!

వీధి వీధంతా మేల్కొంది. అమ్మో! అయ్యో! లతో చీకటిని చీల్చుతున్న కేకలు! క్రిందపడిన వాళ్ళ కాళ్ళు బెణికాయి. పరుగు తీస్తున్న వారికి రాళ్ళ ఎదురుదెబ్బలు... పిట్ట వేటగాళ్ళ దారి ఎటో.... కొంతసేపటికి గాని తెలియలేదు.... వాళ్ళ మీద పడింది పులివేటగాళ్ళే గాని, పులి కాదు అని!!

పులి ఆవలి వేపు దూకి కొండల్లోకి పారిపోయింది. వేటగాళ్ళు కాళ్ళు, చేతులు విరగ్గొట్టుకుని ఇళ్ళకు చేరారు.

ఆ తుపాకీ మీద నాన్నగారికి ఎంతో అభిమానం. తూటా దట్టించిన తుపాకీ మీదకన్నా, తూటాలేని తుపాకీ మీదనే ఆయనకు ప్రేమ ఎక్కువ.

'తుపాకీయే లేకుంటే నేను నీకు యీ కథ చెప్పి వుండేవాడిని కాదు. అది నన్ను రక్షించింది" అన్నారు.

వినుకొండకు దూరాన దట్టమైన నల్లమల అడవి ప్రారంభమౌతుంది. పశ్చిమదిశన, ఆ అడవి మార్గాన "గుమ్మనంపాడు" అనే గ్రామం వుంది. ఒకనాడు ఆ గ్రామాన ఏదో ఉత్సవం జరిగితే నాన్నగారు, అమ్మ, తమ్ముడు, తమ్ముని భార్య వెళ్ళారు. ఆ మరునాడు తిరిగి వస్తున్నారు. ఒంటెద్దు బండిలో, ఉదయాన అడవిలో ప్రయాణం బాగా హాయిగా ఉంటుంది. రకరకాల పక్షుల కిలకిలారావాలు, వివిధ రకాల పుష్పాల సువాసనల

గుమగుమలు.... గుంపులు గుంపులుగా జింకలు, కుందేళ్ళ దూకుళ్ళు. అక్కడక్కడ నెమళ్ళ నాట్యాలు.... ప్రకృతి సౌందర్యాన్ని ప్రేమించే వారికివి కన్నుల కింపైన దృశ్యాలు. ఆడవాళ్ళిద్దరూ బండి దిగి పూలకై అడవి కొద్దిదూరం వెళ్ళారు.

ఎక్కడ నుండి వచ్చారో అంత వరకూ మనిషి అలికిడి అయిన వినబడలేదు. ఓ పదిమంది మగవాళ్ళు వచ్చి బండిచుట్టూ చేరారు. నాన్నగారు, చిన్నాన్నగారు ఆశ్చర్యపోతున్నారు. బండివాడు చిన్నవాడు. అలా నాలుగువైపులా చూడగా చెట్లు మీద మనుషులున్నారు. అంతలో ఒకడు నాన్నగారిని సమీపించి "ఆ మర్రిచెట్టు మీద బెడ గువ్వలున్నాయి కొడతారా" అని అడిగారు. 'ఉదయాన్నే గువ్వలుండవే' అని నాన్నగారి జవాబు.

అంతలో మరొకడు ఇంకొకనితో "రెండు మాంచి దూడలున్నాయ్‌రోయ్" అన్నాడు. అంతే నాన్నగారికి అర్థమైంది వీళ్ళు దొంగలు అని. 'దొంగలు స్త్రీలకు వాడే దొంగలపదం 'దూడ'.

"తమ్ముడూ రడీగా ఉండు అంటూ తుపాకి తీసి... కదిలితే కాలుస్తా.... అన్నారు. ఒక్కొ క్షణంలో ఎక్కడ దొంగలక్కడే మాయం! చెట్ల మీదా లేరు. ఆడవాళ్లను బండి ఎక్కించి బండి ముందు చిన్నాన్నగారు, బండి వెనుక తుపాకీతో నాన్నగారు ప్రయాణమై కదిలారు.

వారు అడవి దాటి కుదుటపడి ఒక చెఱువు గట్టున విశ్రాంతి తీసుకుంటూ ఉండగానే ఆ అడవి దొంగలు కొట్టగా దెబ్బలు తిని వచ్చారు కొందరు వ్యాపారులు.....

ఆనాడు తుపాకీ లేకుంటే నేను ఉండి ఉండేవాడిని కాదు కదా! తుపాకీపై తన అభిమానాన్ని వ్యక్తం చేశారు.

పక్షులపై ప్రేమ నన్ను ఒక చిట్టి దొంగగా చేసిన గాథ చెప్పక తప్పదు.

ఒకనాటి సాయంకాల సమయాన బాటసారులు వచ్చి ఆ రాత్రికి మా ఇంటి ముంగిట ఆరుబయట పడుకొనుటకు మా అమ్మను కోరినారు.

ఒక చిన్ని కుటుంబమది. వారికి ఐదు సంవత్సరాల బాలుడు. నేను వారిని చూడగానే నా కన్ను ఆ బాలుడు పెంచుతున్న పంజరాన కవుజు పిట్టల జంటపై పడింది.

ఆ కుటుంబం భోజనం చేసి పడకలు సిద్ధం చేసుకుంటున్నారు. 'నాకు ఆ పిట్టల జంట' యిప్పించమని మారాం చేశాను. వారు ముద్దుగా పెంచుకుంటున్న పిట్టను మనం కావాలని అడగడం బాగుండదని నాకెంతో నచ్చచెప్ప ప్రయత్నించినా, మారాము ఆగలేదు.

నా ఏడుపు, మొండితనం భరించలేకనో, మమకారపు స్వార్థము ఆమెను మెత్తబరచగా ఖరీదుకు ఇస్తారా! అని అడిగింది. ఆ పాంథులు ఇవ్వము' అన్నారు. ఇది విన్న వారి కుమారుడూ ఏడుపు అందుకున్నాడు. బేరం చెడగొట్టిన వాడిని చంపుదామన్న కోపం నాలో పొంగింది. అయినా చేసేది లేక, పడకపై వాలాను.

పిట్టలు పంజరంలో కదిలినప్పుడల్లా నా హృదయం రెపరెప లాడింది. అర్ధరాత్రి దాటింది.

నాకొక ఆలోచన వచ్చి అత్యంత నెమ్మదిగా లేచి, పంజరాన్ని అతి చాకచక్యంగా దొంగిలించి దాచాను. తొలి కోడి కూసింది.

తెల్లవారి పాంథులు ప్రయాణమై పంజరం కానక అమ్మను అడిగారు. వారి పిల్లవాడు ఏడుపు పెద్దది చేశాడు.

అమ్మ నన్ను గుచ్చి గుచ్చి అడిగింది. నాకేమీ తెలియదని అసత్యాన్ని చక్కగా అల్లి చెప్పాను.

ఇల్లు, ఇంటి చుట్టూ పాంథులు వెతికారు. పంజరం కనబడలేదు.

అంతలో భళ్ళున తెల్లవారింది. పంజరంలోని పక్షులు కీకా, కీకా ధ్వనులతో అరిచి, వాటి ఉనికి తెలియజేశాయి. నా ముఖం మరింత తెల్లబోయింది. పాంథులు పిట్టలను పట్టుకుపోయారు. తల్లి నన్ను బిలిచి దండించి, వినిపించె దొంగతనంలోని దొడ్డపేగి తల్లి బోధకన్న దట్టంబుగా పిట్ట నేర్పిపోయె నాకు నీతిగీతి.

కవి బోయి భీమన్న గారి మాటలలో....

కవి సర్వమానవులపట్ల, సర్వభూతాల పట్ల సముడై ఉండాలి. మిత్ర శత్రు పక్ష పాతాలకు అతీతుడై ఉండాలి. ప్రకృతి పురుష చైతన్య సమన్వయమైన సర్వసృష్టికి ఆత్మీయుడై ఉండాలి. జీవ స్వభావ గుణప్రవర్తనలలోని వైవిధ్యాన్ని అవగాహన చేసుకొని అట్టి వైవిధ్యంలో కలిసి మెలిసి సహజీవనం, లిట్టివాడు కవి. అట్టి కవి జాషువా ఈ మూగజీవులపై కృతజ్ఞతే.....

రాత్రివేళ తనకు తోడుగా వచ్చి, చీకటిలో తాను పాదం వేయబోగా అక్కడున్నా పామును చూచి మొరిగి నాన్నగారికి ప్రమాదాన్ని తప్పించిన టామీ...

రెండెద్దుల బండి నడిమికి విరిగి అటు కింద అమ్మ, ఇటు రెండు నెల పసికందు (కడుగొట్టు కూతురు హేమలత) ఎద్దుకాళ్ళ మధ్య పడినా.... కదలక నిలబడి, పసికందు ప్రాణం కాపాడిన ఎద్దులు..

"ఈ కవి అంటరానివాడు. సభలోనికి ఎట్లు జొరబడే" అంటూ అవమానించగా, అవమాన భారంతో ఇంటికి వచ్చిన నాన్నగారికి ఎదురేగి, కౌగిలించి ఓదార్చిన జాకీ...

పరుగున వస్తూ, ఇంటి గుమ్మలో ఉన్న చంటివాడైన చిన్నన్నపై పడబోయి, తన నాలుగు పాదాలను అతికష్టంపై ఆపుకొని ఆ పాపని రక్షించిన మా ఇంటి పాడిగేదె...

మంచులో చిక్కుకుని, త్రోవ తప్పిన బాటసారులను వాసన బట్టి వెదికి రక్షించె... ఆల్ప్స్ పర్వతాలలోని సెయింట్ బెర్నాడ్ కుక్కలు....

గ్రహాంతరాళంలో రహస్యాలను మానవులకు తెలియజేయ ముందుగా తన ప్రాణాన్ని ధారపోసిన లైకా....

మానవుల ఆరోగ్యం కొరకు పరిశోధనలకు తమను బలిగా అర్పించుకొనే కుందేళ్ళు, ఎలుకలు, కోతులు....

తమ శరీరంలోని ప్రతి రక్తబిందువును వెచ్చించి భూమిని సస్యశ్యామలం చేసి – మరణించిన తరువాత కూడా తమ చర్మాన్ని మన చెప్పుల ఉపయోగార్థమే దానం చేసిన పశువులు....

ఈ నోరలేని త్యాగమూర్తులకు నాన్నగారు కృతజ్ఞులై వుండేవారు. ఆయన రచన 'క్రీస్తు చరిత్ర'పై వచ్చే రాయల్టీని యీ మూగజీవుల సంరక్షణకై అందించమని తన వీలునామాలో వ్రాశారు.

* * *

# ప్రశ్న భయపడిన కాలం

**చెప్పి కొంటెమి గండ శిలల జేగురు రంగు సీతా మహాదేవి చీరలంచు**
**వాదించినాము అంజనీదేవి తనయుడు తనయుల బుట్టించు దాతయనుచు**
**ఆశించితిమి గుబ్బలమ్మ గుట్టల వద్ద గజ్జెల ధనలక్ష్మీ కదలు ననుచు**
**నాకొంటిమిఅల్లసీతాకుండ తీర్థాన అమర దంపతి స్నానమాడు ననుచు**
**ఔను కాదనలేని ప్రాయంబునందు**
**మనసులో నీవుకరిగి పోసిన చరిత్ర....**

మా వినుకొండ శిఖరం పైన ఎన్ని పురాణగాథలు వున్నాయో అన్ని ప్రశ్నలు నాలో ఉబికి వచ్చేవి జవాబులు నాకు దొరకలేదు. చెప్పేవారూ లేరు. వున్నా నోరెత్తలేక ... ఆ ప్రశ్నలు నాలోనే ముడుచుకు పోయేవి.

రావణుడు సీతను అపహరించుకు పోతూ దండకారణ్య ప్రాంతంలోని ఆ కొండ మీద విశ్రాంతికై నిలచినాడట, ఆ కొండపై నున్న జటాయువు అనే పక్షి ఆ రాక్షసునితో యుద్ధం చేసిందట. దాని రెక్కలు నరికి ఆ రాక్షసుడు సీతను ఎత్తుకు పోయాడట. ఆ జటాయువు కొన వూపిరితో ఉండి రామునకు యీ వార్త చెప్పి మరణించిందట! అంచేత యీ కొండకు విన్నకొండ అని పేరుట!

సీత ఒక గుహలో విశ్రాంతి తీసుకున్న జానకి బండ అంటూ, చూస్తున్న వారికి గబ్బిలాలు అడ్డువచ్చేవి. మరి ఆ గబ్బిలాలు ఏమిటో ఎవరూ చెప్పేవారు కాదు! జానకి బండ గుహల్లో పై కప్పున 'వామన గుంటలు' చెక్కబడి ఉంటాయి. సీతాదేవి విశ్రాంతి సమయంలో ఆడుకున్నదట! మరో బండపై జేగురు రంగు చూపి ఇది సీత చీర! అది సీత రవిక! సీత చీర ఆరవేసిందా మరి రెండు చీరలు తెచ్చుకుందా? జటాయువు శిల అవడమేమిటి!? సీత విశ్రాంతి తీసుకోవడమేమిటి? మా చిట్టి బుర్రలకు అర్థం కాక, ప్రశ్నిస్తే "తప్పు తప్పు" కళ్ళు పోతాయి. అలాంటి ప్రశ్నలు వేయరాదు" ఆ కొండపై ఉన్న శివాలయం పూజారి. మేము చెంపలు వాయించుకొంటే, 'ట' కారాలన్నీ మా గుండెలపై సమ్మెట పోట్లు కొడుతూనే ఉండేవి. మొన్న మొన్నటిదాకా!

ప్రశ్న వేసే మనసులోని చీకటిని తొలగించటానికి ఎప్పుడైతే జవాబనే వెలుగురాదో, హేతుజ్ఞానం అనే దీపం వెలగదో, ఆ చీకటి దట్టమై నిలుస్తుంది. జ్ఞానాంధకారం దట్టమైతే మనిషి భయభీతుడవుతాడు. భయరహితడు కాని మనిషి చైతన్య వంతుడూ కాలేడు. ఆలోచన కుంచించుకుపోతుంది.

ఇలాగ అనేక గాథలపైన ప్రశ్నలు తలెత్తుతూ ఉండేవి. ప్రశ్న జ్ఞానార్జనకు ప్రథమ సాధనం. జీవితానికి జ్ఞాన ఫలం. ప్రశ్నకు భయపడే జీవితాలు చీకటిలోనే ముగుస్తాయి. "జాతక చర్మాన్ని వొలిచేసే హేతు శస్త్రం ప్రశ్న" అన్నాడో మహాకవి జ్ఞానపీఠం పై నిలబడి.

మా ఊరికి దక్షిణాన ఉన్నది గుబ్బలమ్మ గుడి. అక్కడ భూమిలో ధనలక్ష్మి ఉన్నదని, నిత్యం రాత్రి సమయాల్లో ధనలక్ష్మి గజ్జల ధ్వని వింటున్నామనేవారు, చూశామనేవారు ........ వారి వార్తలు ఊరంతా మంట పెట్టాయి. ఆ ధనలక్ష్మి కై రహస్య ప్రయత్నాలు.

ఒక్కటి మాత్రం నిజం పాటిమట్టి కోసం అక్కడ తవ్వే వారికి అప్పుడప్పుడు పాతనాణాలు దొరుకుతూ ఉండేవి. వాటినింటికి తెచ్చుకునే లోపలే రహస్యం పొక్కి, పోలీసు చెవుల దాకా చేరి, పోలీసుల వశం చేసుకోవడం..... ఇదీ కథ.

ఊరికి ఉత్తరాన గుంటాజనేయులు గుడి ఉంది. ఆయనకు 'టపా ఆంజనేయులు' అని పేరు తెచ్చుకున్నాడు. ఎందుకటా? సీతమ్మోరు రావణాసురిని లంకలో వున్నప్పుడు రాములోరి వార్త సీతమ్మకు .... సీతమ్మోరి వార్తలు రాములోరికి... అందించారు గదా. ఈ వార్తాహారునికి మా ఊళ్ళో టపా ఆంజనేయుడని బిరుదు. అమాయకులైన ఆడవాళ్ళు తమ ఉత్తరాలను ఆంజనేయుని నోట్లో వేసి వచ్చిన సంఘటనలూ ఉన్నాయి.

ఈయన మరొక బిరుదు సాధించాడు. సంతాన ఆంజనేయులు. నిస్సంతు స్త్రీలు ఒకటే దారి ఆ గుడికి, ఎంతమంది పిల్లలు కలిగారో మాత్రం ఎవరూ చెప్పరు.

మోహరంనాడు పీర్లు భుజాన వేసుకొని నిప్పుల గుండ లో నడిచే ఘటన మాకు మరింత ఆశ్చర్యం. 'పీర్ల మహిమ' అని సరిపెట్టుకునేవాడిని .

చౌడమ్మ రాతి సత్తికి యింకా నెత్తుటి కూడుతో కొలుపులు చేస్తూనే ఉన్నారా? కరుణాహృదయులు, జన్మించలేదా?

మేకలు, గొర్రెలు, దున్నల నెత్తుటి ప్రవాహాలతో నీ గిరులు కరిగిపోయినవి? నీ కటిక గుండెలు యీ నాటికైనా కరుణతో కరిగినవా? లేదా?

ఆ ఊరిని అన్ని క్షుత్రాల నుండి కాపాడే రాతి విగ్రహాలున్నాయి. అంకాళమ్మ, పోలేరమ్మ, నూకాలమ్మ సత్తులు. ఆ గ్రామదేవతల తృప్తికై వందల సంఖ్యలో మూగజీవుల బలి జరుగుతూ ఉండేది. కలరా, మశూచి, అనావృష్టి సమయాలలో యీ కొలుపులు ఆవేశ భరితంగా జరిగేవి. "అది మతావేశుల విహార భూమి. ఆట అహింసకు తావు రవ్వంత కూడా లేదు. కాదు ! వలదు! అంటే బౌద్ధ, భిక్షువుల కుత్తుక నులుమగలరు. పురిటి బెబ్బులుల విధాన....

విద్య, వైద్యం కూడా అందని రోజులవి. చిన్న పెద్ద వ్యాధులకు, మానసిక జబ్బులకు భయం ముందు ప్రవేశిస్తుంది. ప్రజలలో దెయ్యం, చేతబడులకు మంత్రం, తాయెత్తులు, భూత వైద్యాలే అందుబాటులో ఉంటాయి. వేగం తెలియని రోజులవి. జబ్బుపడిన వ్యక్తిని గ్రామాల నుండి వినుకొండ ఆసుపత్రికి నులక మంచం డోలీలోనే తెచ్చేవారు. ఎందరో దారిలోనే మరణించేవారు వైద్యం అందక. కలరా, మశూచి వంటి జబ్బులు వచ్చిన గ్రామాల ప్రజలు మరో ఊరికి రానిచ్చేవారు కాదు.

అట్టి కాలంలో భూతవైద్యులకు మంచి గిరాకీ. ఆ రోజులలోనే 'కీళ్ళ జ్వరం' (ఈనాడు మనం చెప్పుకునే ఫ్లూ జ్వరం) మృత్యు చీడలా పట్టింది జనాన్ని. ఊళ్ళు ఊళ్ళే స్మశానాలయినాయి. ఒక్కో ఇంటిన ముగ్గురు నలుగురు మరణించేవారు. నా మేనత్త, నా మరదలు, మరిది ఒకే నెలలో పోయారు. జనం దిక్కుతోచక బెంబేలు పోయినారు. ఊరూరా కొలుపులే. భూతవైద్యులు వీరులైనారు.

మంత్రగాళ్ళకు గిరాకీ పెరిగింది. విభూది, తాయెత్తులు ఖరీదు చుక్కలదాకా పోయింది. జనం భయంతో బిక్కిటిల్లిపోతున్నారు. ఏ గ్రామం, పట్టణం చూచినా మృత్యువే. ఏడుపులు ఎల్లవేళ్ళలా వినిపిస్తూ ఉండేవి. ఒక్కో యింట్లో ఇద్దరు, ముగ్గురు మరణాలు.

మా గ్రామం చాట్రగడ్డపాడులో పోలేరమ్మ సత్తికి కొలుపులు చేద్దామని పనులు ప్రారంభించారు. తమ గ్రామ భూతవైద్యునికి చేతనయ్యే పని కాదని పొరుగూరి నుండి భూతవైద్యుని రప్పించారు. పెద్దలంతా కూడ బలుక్కుని, తమ గ్రామ మంత్రగాడికి యీ 'దెయ్యం' (కీళ్ళ జ్వరం) లొంగదనే నిశ్చయానికి వచ్చి.

కొత్త భూతవైద్యుడు ఆరడగుల ఎత్తు, భుజాల వరకు జులపాల జుట్టు. మిడిగుడ్లు, ఒంపు తిరిగిన గుబురు మీసాలు, ఇక రంగుల బట్టలు ధరించి, మెడలో రుద్రాక్షమాలలు, కుడిచేతికి వెండి కంకణం. ఎడమ కాలికి గగ్గెర, అడుగువేస్తే గల్లుగల్లు మనేది.... పగటిపూట చూసిన ఆడవాళ్ళు, పిల్లలు జడుసుకుంటున్నారు ! ఊరు ఊరంతా యీ

అద్భుత వైద్యుని చూడటానికి ఎగబడేవారు. అంతటి దుఃఖంలోనూ ఓ సందడి ! మహామ్మారిని తరుముతాడనే ఆశ.

ఆ ఊరి మంత్రగాడు, తేలుమంత్రగాడు, పిల్లలునిద్రలో ఉలికిపడితే విభూది ఇచ్చి, కాసిని సజ్జలు పుచ్చుకునే బక్క చిక్కిన మంత్రగాడు. అతనికి రుద్రాక్షలు లేవు. కాలికి కనీసం గొర్రె వెంట్రుకల గగ్గెరైనా లేదు. మీసాలు అంతకన్నా లేవు ! అతనిని చూస్తే పిల్లలే కాదు, పిల్లులూ భయపడవు. కుక్కలు మొరగవు. అయితే కొత్త భూతవైద్యుడు ఊళ్ళోకి వచ్చినప్పటి నుంచి కుక్కలకు విశ్రాంతే లేదు. రాత్రింబగళ్ళు ! ఈ కొత్త మంత్రగాడు ఊళ్ళోకి వచ్చినప్పటి నుండి మా వూరి తేలు మంత్రగాడికి పట్టలేనంత ఉక్రోషం వచ్చింది. "నన్ను కాదని యీణ్ణి పిలిపిత్తారంటరా," అని అక్కడక్కడ తన అభిమానులతో గుసగుసలు పోయేవాడు.... ఎవరినీ ఎదురుపడి అగిగే ధైర్యం లేదు పాపం అతగాడికి. పోలేరమ్మ గుడి ఊరికి తూర్పున వుంది. పోలిమేర దగ్గర ! అక్కడే పూజలు ప్రారంభం. రోజూ గొర్రెపోతుల తలలు దొర్లుతున్నాయి ! కొలుపులు ఆఖరిరోజు. ఆ రోజు రాత్రి... అర్ధరాత్రి దాటాకా ఊరంతా సద్దుమణిగాక బలిగా ఎంచబడిన మేక నెత్తుటితో కలిపిన బోనపు భాండం భూతవైద్యుడు తలపై పెట్టుకొని, ఆ ఊరు అన్ని మూలలా తిరిగి, చివరికి పొలిమేరలో పగలకొడతాడు ఆ భాండాన్ని ఆ పనితో మహామ్మరి శాంతించి ఊరువదలి వెళ్ళు పోతుందంటా !

పురుగు కూడా బయట తిరగరాదని, తొంగి చూడరాదని అట్లా చూస్తే ఎవరయినా సరే... నెత్తురు కక్కుకొని చస్తాడు. డప్పులు వేసి ఆ రోజంతా చెప్పారు జనానికి. ఆనాటి జనం అమాయక ప్రజ – ఈనాడు 'కర్ఫ్యూ' కన్నా నూరు రెట్లు అది.

అమావాస్య చీకటి. చీకటి పడక ముందే జనం అన్నాలు తిని, ఇళ్ళలో ముణగతీసుకున్నారు. తలుపులు బిగించుకున్నారు. రాత్రి జరుగుతున్న కొద్దీ, ఊరంతా నిశ్శబ్దంలోకి జారుకుంది. దూరానా గుండ్లకమ్మ వాగుప్రవాహపు ధ్వని. కుక్కల ఇలకోళ్ళగోల తప్ప ఏ శబ్దమూ లేదు. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకొని గొల్లుమన్న ఏడుపులు !

అర్ధరాత్రి ! గుడ్లగూబ గద్దింపు. అప్పుడు వినిపించింది. ఊరు ఊరంతా ! భూతవైద్యుని గంభీరమైన కంఠం. మహామ్మారుని "వెళ్ళిపో" అనే గర్జన !

'మనూరి మంత్రగాడు ఏనాడైనా ఇట్టా అరిచిండంట్రా అబ్బాయా!" మా నాయాన నాతో ! ఈ దెబ్బతో 'దెయ్యం పరార్' అనేధైర్యం.

'కపాలం ఒక చేత మరో చేత త్రిశూలం నెత్తిన నెత్తుటి భాండం'... మా ఊహ. భూత ప్రేతాల అంతు చూసే అరి వీర భయంకరుడై... ఊరంతా అలంపులు తిరుగుతూ ! మా ఇంటి పక్కగా ఆ అరుపు ఒక్కసారిగా వినపడింది.... నేనూ, తమ్ముడే కాదు.

వీరాది వీరవీరయ్య మీసాలు వణికినట్లు జ్ఞాపకం.... మా ఇంటి బుడ్డిదీపం టక్కున ఆరిపోయింది. చీకటి మరింత అలుముకుంది....

ఆ సమయంలో ఎవడైనా బయటకు రాగలడా ! ఒకవేళ ఎవడైనా మాంత్రికుని చూడాలని బయటకు వస్తే... పోతూ పోతూ వున్న దెయ్యం వాడిని చంక వేసుకుపోతుంది. లేదా వాడిచేత రక్తం కక్కించి చంపేస్తుంది. జనం పూర్తిగా నమ్మిన భయంతో కూడిన సత్యం ఇది ! ఉప్పలపాడులో ; కంచర్ల గ్రామాలలో జరిగినవట"

భయంకర నిశ్శబ్ద చీకటిని చీల్చుకొని వచ్చే భూతవైద్యుని అరుపులు.... అంతలో తూర్పు దిక్కు నుండి ఆ అరుపులకు భిన్నమైన అరుపు.... అరుపు... కాదు... ఒక ఆర్తనాదం... ఊరు ఊరంతా విన్నది !

అబ్బా ! లేచి కూర్చున్న మా నాయన, అమ్మ "ఎవడో చచ్చిందురా, మంత్రిగాని మాట ఇనక బయటకు వచ్చిందు !"

మరలా ని...శ్శ...బ్దం !!!

భళ్ళున తెల్లవారింది

ఊరు ఊరంతా ఒక్కసారిగా చలించిపోయింది..... "అద్భుత భూతవైద్యుడు పోలేరమ్మ గుడికాడ చచ్చిపడిందు"

ఆరు నెలల తరువాత ఒకనాడు మా ఊరి తేలు మంత్రగాడు. వినుకొండకు వచ్చి మా నాయనతో మాట్లాడుతూ... పెద్దగా నవ్వుతూ "నేనే మీ అనలేదే పెద్దయ్యా ! పోలేరమ్మ గుడికాడ చింతమాను చాటున నక్కి... ఒళ్ళంతా బొగ్గు పూసుకొని, మిడిగుడ్లు పెట్టుకొని. ఎముకలు మెళ్ళో ఏసుకున్నా... వాడు భోనం పట్టుకుని వస్తుంటే... గబాల్నా ఎదురుదూకి, నేనేరోయ్ మహమ్మారి నవలకతింటా" అన్నా.

అంతే పెద్దయ్యా ఆడిని భయపెడదామనుకొన్న, వాడు నిలువునా చస్తాడని అనుకోలేదు... అంటూ విరగబడి నవ్వుతూ ఉంటే, నేను మా నాయనా నవ్వాపుకోలేకపోయాం.

ఆ తరువాత ఎవరో ఎలా కనుక్కున్నారో కీళ్ళ జ్వరాలకి మందు. ఎండు మిరపకాయలు, చిన్న ఉల్లిపాయలు, తొక్కిన కారం, మిరయాలచారు. ఆ జ్వరాల గృహవైద్యం చేశారు. అది చాలా ప్రాణాలను రక్షించింది.

**"అరవంగుత్తుక గోసి జంతువుల గర్భాగారముల్ జీల్చినె**

**త్తురు టేళ్ళన్నటియించు మూఢతమ జాతుల్‌జాతరల్ సేయజూ**

**తురు చూపింతురు ప్రోత్సహింత్రుతతివాదుల్ శాస్త్రపారంగతులు**

**కరుణల్ కమ్మని బోధలో పులుగుటక్కా ! చీ ! హుళుక్కుల్ గదా**

ఆనాటి నా ప్రశ్నలకు, నా స్వేచ్ఛకు, నా వ్యక్తి వికాసానికి అవమానకరమైన మూఢత్వం. శృంఖలాలుగా. ప్రతిబంధకాలుగా ఆనాడు నన్ను మూగగా చేసాయి.

**మెరుగుందీవెలటుల్ దళుక్కు మనుచున్ మేధస్సులో బుట్టును**

**స్థిర విజ్ఞాన లతాప్రరోహము నిర్జీవంబులై గుండెకున్**

**బరువై పెద్ద తుపానురేచికలచెన్ స్వాంతంబు నీనాటికన్**

**దరికెక్కించిన వారు లేక వగచున్ నాలోన సందేహముల్**

'ఇది ఏసు రక్తం. ఇది ఏసు మాంసం" అంటూ తినిపించి త్రాగించే పానకం, సజ్జ రొట్టెలు. నాకు మింగుడు పడేవికావు. రక్తం, మాంసం అందులోనూ ఆ ప్రేమమూర్తి రక్తం, ఆ కరుణామూర్తి మాంసం మనం తినడం మేమిటి? అనే ప్రశ్నకు...

"పఠియించినాడ పలుమార్లు చర్చిలో బైబిలు సిద్ధాంత భాష్యములను"

అన్నమాట తప్పక నేను ఆచరించాను. కానీ అన్నమాట తప్పి, కొంగభక్తిని నటించే వారిని చూచి నా మనసు చెదిరి చివుక్కుమన్నది.

'మనమంతా సోదరులం' అని బోధ చేసిన ఫాధిరులే ఆచరించరు.

'బైబిల్'ను ప్రశ్నింపరాదు. ప్రశ్నించినవాడు 'సాతాను శోధకుడు' అని భయపెట్టే ఫాదిరులున్నారు.....

"లాజరు చచ్చిపోతే ఎలా బ్రతికించాడు" కుంటివాడిని తాకగానే కాళ్ళు ఎలా వచ్చాయి" ఇలాంటివే ఏవో ప్రశ్నలు ఉబికి వచ్చేవి కానీ....

"ఊరు కొమ్మని నన్ను గుడ్లరిమి చూచుటొకటే కనుపించె బ్రత్యుత్తరముగ క్షతమెరుంగని నా ధర్మసంశయంబు ఊరుకొనబోకు మనుచు గుడ్లురిమి చూచే."

సమాజనడకలో ఎదురైన హెచ్చు తగ్గులు. అస్పృశ్యత వాటి వలన పొందిన తీవ్రమైన అవమానఘాతం... ప్రశ్నలను రేపేవి...

'దూరం, దూరం ! మరీ మీదకొత్తుండారురా!"

ఎద్దును, దున్నను తోలుతూ "నిన్ను... కొయ్యా !

దాహం అడిగితే అతి ఎత్తు నుండి దోసిట పోయడం.

ఇవన్నీ మనిషిని హీనంగా చూస్తూ. అవమానించే సంఘటనలు

ఎందుకు దూరంగా ఉండాలి? "నీ రక్తం తెల్లనా... నా రక్తం నల్లనా?"

ఇలా ఎన్నో ప్రశ్నలు ఉబికి వచ్చినా అడిగే ధైర్యం ఎదురింపూ లేదు.

**"మొక్కబళ్ళ నెపాన చక్కని పసిపాప**
**లెందరు గంగలోనిమిడిరొక్కొ**
**సహగమనాచార దహన దేవత లెన్ని**
**చిగురుగొమ్మల బూదిచేసెనొక్కొ**
**చదువుదాచెడుదురాచరణ మెందరికళా**
**బ్యసనచాతురి గొంతు బిసికెనొక్కొ**
**పొందెరుంగని వేరు బంధాలచే బాహు**
**బలమెంతగా చచ్చుపడియెనొక్కొ**
**చిలిపి రాలకు నగషీలు చెక్కి చెక్కి**
**కాలమెంత యంగతాన గలిపి రొక్కొ..."**
**చదువనేర్చిన వెట్టిని జంపగలరె...**

నమ్మకాలు  రెండు రకాలు. ఒకటి నమ్మకం రెండోది మూఢనమ్మకం. నమ్మండం అనేది అవసరమే పరస్పర నమ్మకం లేకపోతే సమాజసభ్యులుగా జీవితం కొనసాగించడం కష్టతరమౌవుతుంది. నిత్యం మనం తెలుసుకునే ఎన్నో విషయాలు నిర్ధారణ చేసుకోకుండానే నమ్మి వేస్తూ ఉంటాం. ఒక అనుమానం వచ్చినప్పుడు మన నమ్మకం వాస్తవమా ! కాదా! అని తేల్చుకోవలసి ఉంది. అలా తేల్చుకోకుండా, నాకు సత్యాసత్యాలపై నిర్ధారణతో పనిలేదు. నేను నమ్మినదే నాకు సత్యం అని అంటే మౌఢ్యం ప్రవేశించినట్లవుతుంది. మనస్సులోని తలపులను మూసి తాళం బిగించినట్లవుతుంది. అప్పుడే అది మూఢనమ్మకం.

ఈ సువిశాల భారతాన ఎన్నో మతాలు. వాటితోబాటు నిర్మించుకున్న ఆచారాలు. అనేక సాంప్రదాయాలు ఉన్న సమాజమయింది. ఆచారాలు, సాంప్రదాయాలు అన్నవి నిర్ధేశించే నమ్మకాలను ప్రశ్నించే హక్కు, ధైర్యము ఆయా మతాలు, కులాలను అనుసరించే ప్రజకు లేదు. అందుచేత నమ్మకాలు మూఢ నమ్మకాలై  కొనసాగుతున్నాయి. ప్రశ్న భయంతో ఒణికి పోతున్నది. చదువు నేర్చినంత మాత్రాననే యీ వెర్రిని చంపలేరు.

"తాంత్రిక, మార్మికత ఇవన్నీ పనికిరాని వాదాలు. ఏదైనా సరే, భౌతికంగా మానసికంగా అధ్యాత్మికంగా నిన్ను బలహీన పరిస్తేదాన్ని విషంలా వదిలివెయ్యి. అది సత్యం కాదన్నమాట. సత్యం మనిషికి బలం కలిగిస్తుంది. ఉత్తేజపరుస్తుంది.

మూఢ విశ్వాసాలు తగవు. మనం మూఢ విశ్వాసాలు కలిగిన మూర్ఖులుగా కంటే కరుడు గట్టిన నాస్తికులుగా ఉండడమే మంచిది. నాస్తికుడు సహజంగా ఉన్నట్లు లెక్క. మూఢ విశ్వాసం మనలో ప్రవేశిస్తే మెదడు  మొద్దు బారిపోతుంది".

**– స్వామి వివేకానంద**

నిప్పుల గుండంలో నడిచే వారి పాదాలు ఎందుకు కాలవు? మరుగుతున్న నూనెలో చేయి పెడితే ఎందుకు బొబ్బలెక్కవు?

ఈ ప్రశ్నలతోనే ఆలోచన ఆగిపోరాదు. ఆలోచన, జిజ్ఞాస పరిశోధన ఆగిపోతే మానవ విజ్ఞానమే ఆగిపోతుంది.

"ఒక టన్ను ఎండిన గట్టివి. ముళ్ళు లేనివి, చింత తుమ్మ దుంగలు కావాలి. మూడు అంగలు దూరం. రెండు జానల ఎత్తు మాత్రం ఉండే గుంట తవ్వాలి. (కర్రలు ఎక్కువైతే గుంటలు వెడల్పు, పొడవు ఎత్తు పెరగవచ్చు.)

ఈ కర్రలను గోపురంలాగ పేర్చి కాల్చాలి. ఆరుగంటలకు కాలి కణకణలాడే నిప్పులే ఉండాలి. కాలీకాలని కర్ర, బుడిద కూడా లేకుండా ఉండాలి. కొలిమిలో కాల్చిన ఎర్రని ఇనుములాగ నిప్పు ఉండాలి.

సైన్సు చెప్పే, "గ్లొబాయిడల్ యాక్షన్" అని ఉంది. ఎర్రగా కాలిన ఇనుము పైన నీళ్ళు చల్లితే కొన్ని క్షణాలు అది బుడగలా ఉంటుంది. దీనినే "గ్లొబాయిడల్ యాక్షన్ అంటారు.

నిప్పుల మీద నడిచేవారు పాదాలు నీళ్ళతో కడుగుతారు. అధికంగా కాలివేడి అయిన నిప్పులపై పాదం మోపగానే నిప్పులకూ, పాదానికి మధ్య చల్లని నీటి ఆవిరిపొర ఏర్పడుతుంది. ఆ పొర పాదాన్ని కాలనీయదు. కొన్ని క్షణాలు మాత్రమే. ఈ లోగా రెండు లేక మూడు అంగల్లో మనం గుండాన్ని దాటాలి. ఐదారు సార్లు నడవవచ్చు. కానీ కొన్ని క్షణాలే !

(ఈ రచయిత, కుటుంబ సభ్యులు, ఇతరులు మా ఇంట్లోని పెంపుడు కుక్క... నిప్పుల గుండంలో నడిచాము – మహిమ, మంత్రం లేవు అని చెప్పడానికే –)

కాగిన నూనెలో చెయ్యిపెట్టి క్షణాల్లో తీయాలి. దీనికీ యీ సైన్సు సూత్రమే.

మంత్రం, మాయ లేవు. భక్తి పారవశ్యం (TRANCE) కొంత పని చేస్తుంది. నొప్పి తెలియక పోవడానికి.

మంత్రం, మహిమ, కనికట్టు, తిట్టు, శాపం, చేతబడి, దెయ్యం, బాణామతి , పూనకం... ఇవన్నీ మనిషిలోని భయం, పెంకెతనం, వలన ఎక్కువగా రెచ్చగొడతాయి. ఆలోచింపనీయదు.

హేతుదృష్టి, పరిశోధనాదృష్టి పెంచుకోవాలి. మేధస్సులోని అనేక తలపులు తలుపులు తెరచుకుంటాయి.

**– హేమలత**

* * *

# "దమ్మిడీ"కి విలువున్న కాలం

ఎవడారగించు అమృత భోజనంబున కలిసెనో యీ లేమ గంజి బువ్వ ఎవడువాసము చేయు శృంగార సౌధాన మునిగినో యిన్నారి పూరి గుడిసె ఎవుని దేహము మీది ధవళాంబరములో నొదిగెనో యిన్నాతి ముదుక పంచె. ఎవడు దేహము సేర్చు మృదు తల్పములోన నక్కెనో యీయమ్మకుక్కిపడక

"ఇది నాది అని ఏ మానవుడు ఒక స్థలం గిరిగీసి, చుట్టూ కర్రలు పాతి, కంచెకట్టి మొదటిగా ప్రకటించాడో, ఇతరుల నమ్మించాడో, అతడే మొట్టమొదటిగా సభ్యసమాజాన్ని స్థాపించాడని చెప్పవచ్చును. కానీ, యీ మోసగాడిని నమ్మవద్దు. భూమి ఇచ్చే ఫలాలు మన అందరి ఉమ్మడి ఆస్తి అని విస్మరించవద్దు. ఈ భూమి ఏ ఒక్కరిదీ కాదు అని ఏ ఒక్కడైనా ఆనాడే తన సోదర మానవులకు చెప్పి ఆ కంచెను ఊడ బెరికి, గుంటలు పూడ్చి వుండి వుంటే, అతడు ఎన్ని నేరాల నుంచీ, ఎన్ని హత్యల నుంచీ, ఎన్ని ఘాతుకాల నుంచీ, ఎన్ని దురదృష్టాల నుంచీ మానవ జాతిని రక్షించి ఉండే వాడో చెప్పలేము. **– రూసో**

కోటమ్మ, వెంకటసామి ఇద్దరూ రెక్కలు, ముక్కలు చేసుకున్నా నలుగురు పిల్లలకూ, తమకూ కడుపులు నిండని పేదజీవితాలు. తిండి లేని కోటమ్మ పాలిండ్లు ఎండిపోయి ఆకలి తీరక ఏడ్చే చంటిది, బిడ్డలను కని, ముద్దు మురిపంగా చూచుకుంటున్నారేగాని, వయస్సు కలిగిన ఇవ్వవలసిన, అమర్చవలసిన తిండి బట్ట అవసరాలను తీర్చే శక్తి లేక నిత్యం ఆ దంపతులు సగం జీవితాలే సాగిస్తూ ఉన్నారు.

కోటమ్మ జీవితాన్ని మరింత కుంటిగా చేస్తూ, వెంకటసామి ఒకనాడు శాశ్వతంగా విడిచి వెళ్ళాడు. ఆమె హృదయాన్ని శతధావిదీర్ణం చేసింది. రెండు సత్తుగిన్నెలు చింకి బట్టలు చెక్కపెట్టెలో సర్దుకొని పసిదాన్ని చంకనేసుకుని, బిడ్డలు వెంటరాగా గ్రామం విడిచి కోటమ్మ పట్నం చేరింది. ఒకనాటి సాయంసధ్యవేళ కనబడిన ఒక పెద్ద భవంతి గోడ నీడలో ఆ రాత్రి గడిపింది. "అన్నం పెట్టవే" అనే పిల్లల ఏడుపు. పాలురాక ఒట్టి చనుమొన చీకుతూ గీపెట్టె చంటి దాన్ని సముదాయించుకుంటూ ఆ రాత్రి గడిపింది.

బళ్ళున తెల్లవారింది. ఆ భవంతి భాగ్యవంతుడు ఆసామి ఈ కుటుంబాన్ని చూచి చీదరించుకుంటూ "ఏమే! ఎవతెవే! ఇక్కడ సంసారం పెట్టావు... పో" అని కసురుకోగా... ఆ పక్కనే ఉన్న వృక్షపు నీడకు చేరింది.

పేద కుటుంబాన్ని చూసిన దయామయి. "పేదరాల! ఆ వీధులో పెళ్ళి జరుగుతున్నది. పేదలకు అన్నదానం చేస్తారు. నీ బిడ్డలతో వెళ్ళు. అన్నం దొరుకుతుంది. అంటూ... ఇదిగో ముందు ఈ చద్ది నీ బిడ్డలకు పెట్టు. అన్నది ఆర్ద్రహృదయంతో. కృతజ్ఞతా భావదీప్తితో ఆ పేదరాలి ముఖం ప్రదీప్తమైంది.

'తల్లీ! నీ చల్లని మాటలతోనే ఆకలి దప్పులు తీరినవి. తిరస్కారంతో గాయమైన హృదయం చల్లబడినది."

ఆకలి మంటలను కృశించిన పొట్టలతో దీనంగా రోదిస్తున్న బిడ్డలకు ఇంత పెట్టి, మిగిలినది తాను తిని ఆకలి శోషను తట్టుకున్నారు.

"కుడువుమని చెప్పి బంగారు గుడులు కట్టి

పెట్టు చుందురు నరులునైవేద్యములు

సృష్టికర్తకు, దానిని భుజింపడతడు, భిక్షకుని చేత ఎంగిలిపిడచగాక"

పెండ్లి పందిరి వద్దకు పిల్లలు వెంటరాగా ఆ పేద బయలు దేరింది. దూరం తక్కువ, కానీ మృగాల నిండిన దట్టమారణ్యం దాటుతున్నంతగా... ఆ కొద్ది దూరం జనారణ్యమైంది ఆమెకు.

**"ఎడగా బొమ్మని చీదరించుకొనువా రీవంక నా వంకఒ**

**త్తిడి సేయంకరమెత్తి మొక్కుచు మహాదీనంబుగా బ్రక్కుకున్**

**బుడతలు, తాను తొలంగుచుం, బెదురుచు పుత్రసమేతంబకా**

**రడివిన్ దాటినయట్లు కష్టమున రథ్యల్ దాటి శ్రీఘ్రంబుగన్"**

అంతలో.... కొత్తగా సైకిలు నేర్చుకున్న షోకిలా వచ్చి ఆమెపై పడ్డాడు. "అయ్యో" అంటూ జనం మూగినారు. పిల్లలు ఏడుపులు మధ్య దెబ్బలు తగిలిన ఆ పేదరాలిని దగ్గరనున్న వైద్యశాలకు గొని పోయినాడు ఒక దయాశాలి. ఈ వార్త, ఆ దయాశాలి భార్యకు అందించి వారెవరో "నీ మొగుడు ఒక మాల దానిని తాకి మైలపడినాడు" అంటూ చిచ్చు ముట్టించినారు.

దయాశాలి ఇల్లు చేరగానే... రౌద్రమూర్తి అయిన భార్య "నిలువుండటు అక్కడే... మాలపడతిని ముట్టుకొని మైలపడినారు. స్నానం చేసి లోపలికి రండి....

దానికతడు లోలోన నవ్వుకొని ఇది ఒక మూర్ఖురాలు. దీనితో వాదించినా ఫలితముండదు.' అని స్నానం చేసి ... 'అలుక శమించెనా? పేదరాలి కష్టం చూచి, నా హృదయం ద్రవించినది... మరి హృదయం కూడా మైలపడినది కదా. దానికి స్నానం అక్కరలేదా! యీ వెలుపలి శుద్ధి జీవులకు ముక్తి నిచ్చునా?

ఆ పేదరాలి బిడ్డలను ఒక కరుణామయుడు ఆశ్రమ పాఠశాలలో చేర్పించి ఆమె బరువు కొంత తగ్గించాడు.

ఒకనాడు పంతులు తోడు రాగా ఆ పిల్లలు తల్లిని, చెల్లిని చూడటానికి వచ్చారు.

బిడ్డలను కౌగిలించుకొని, "వీరు దిక్కులేనివారు పంతులుగారూ! ప్రేమగా ఆదరింపవలెను" అంటూ పాదాభివందనం చేసింది.

బిడ్డలను పొలిమేర వరకూ సాగనంపి ఆ అనాధపట్టణం చేరింది.

**"వసుధపైనున్న భోగసర్వస్వమునకు స్వామిత**

**వహించి మనుజుండు ప్రభవమందు**

**ఎవడపహరించె, ఏమయ్యె నీమె సుఖము**

**కలుష మెరుగని దీని కొడుకులసుఖము'.**

ఎటువంటి కాలం అది. బంగారు కాలం అనవచ్చు. దమ్మిడీకి విలువున్న కాలం. రూపాయకు 192 దమ్మిడీలు. ప్రతి దమ్మిడీకి విలువ ఉంది. కాణీకి మూడు దమ్మిడీలు. మూడు వస్తువులు వచ్చేవి. మంచిబస్తా సన్నబియ్యం ఐదురూపాయలు!! సజ్జలు, జొన్నలు, వరిగెలు, అరికెలు రూపాయికి పదిహేను. పదహారు మానికలు....! అయినా.

**గుటకల్ మ్రింగుచు పేద తండముక్షుదాక్షుబ్దార్ధమై నీకుఅం**

**గట వీక్షింప మతాపదేశమున సంకల్పించి సాగించున**

**ప్పటి సంతర్పణ లిప్పుడున్ జరిపి సంపాదింతునే ? వట్టిపు**

**క్కిటి పౌరాణిక పుణ్యమున్ నగరలక్ష్మీ నిర్దయస్వాంతమై.**

ఆకటి చిచ్చులో రగిలే మనిషికి లేని ఆతిధ్యం, ఆకలి దప్పులు లేని దేవతలకు ఎందుకో తెలియదు.

**ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు**

**వ్యయించుగాని దుఃఖతమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్**

**మెతుకు విదల్పదీ భరతమేదిని ముప్పది మూడుకోట్లదే**

**వతలెగవడ్డదేశమున భాగ్యవిహీనులక్షుత్తులాఋనే**

అప్పటి ఆ సంతర్పణలు ఇప్పుడునూ సాగిస్తున్నావా, ఉట్టిపుక్కిటి పురాణ పుణ్యములు సంపాదిస్తున్నావా! నిర్దయవై వినుకొండా!

ఆర్థిక న్యాయం పంచి పెట్టడంలో ఎక్కడో, ఏదో స్వార్థపూరిత పథకం ఈ పేదసాదలకే చేయబడింది. ఆర్థికంగా బలవంతులైతే, యిక మాకు కూలీలు ఎవరు? కార్మికులు ఎవరు? అనేటి అధర్మపు ఆర్థికనీతి, స్వార్థపు ఆలోచన యీ నాటికీ వినపడుతూ ఉంది.

ఆర్థిక న్యాయాన్ని, ఆర్థిక సమతను ప్రభుత్వమూ నిష్పాక్షికంగా పంచిపెట్టలేదు. ఆనాటి రాజులు, చక్రవర్తులు. ఈనాటి ప్రజాప్రతినిధులు యీ సమత సాధించలేక పోయారు.

సులతానీ సులతానులు మణిగణాంశులు తట్టుమిట్టాడుమే

డలలో వాసముచేసినారు, పేదల నోరూర భుజించి వారు

ముక్తారత్న పాత్రంబులన్ నిజ రాష్ట్రంబు ఆకటదూలన్

అణచబడిన వాని నోటి నుండి స్తబ్దతను, నిర్లితప్తను, కర్మ సిద్ధాంతాన్ని పేల్చగల ప్రశ్న ప్రళయమై రావాలి.

**కర్మ సిద్ధాంతమున నోరు కట్టివేసి**

**స్వార్థలోలురు నా భుక్తి ననుభవింత్రు**

**కర్మమననేమొ దానికీ కక్షయే మొ**

**యీ శ్వరుని చేత ఋజువు చేయించవమ్మ**

ఈ మత్తు నుండి ఆ దరిద్రుడు మేల్కొనాలి. ఆర్థిక, సాంఘిక న్యాయం సమంగా పంచాలని ధిక్కరించాలి. పూర్వజన్మ ఫలితం, సుకృతం... యీనాటి జన్మకు కారణం అనే చచ్చు కథలు, ప్రచారాలు సంపూర్ణంగా ఆగిపోవాలి. ఆపాలి. పదివేల గొంతులొకటై, వదురు అబద్ధ ప్రచార వాహిని కెదురై బ్రతుకుట నేర్చుకోవాలి. ఈ పేదరికం, ఈ దీనత్వం ఎప్పటికైనా పరిష్కరింపబడేనా?

ఈ దారిద్ర్యానికి కారణములేమిటి? మాకు ముందైనా ఈ దేశం స్వేచ్ఛా పవనములు ఆస్వాదిస్తూ పెద్దలు మా వ్యధలకు మార్గమున అన్వేషించగలదా? ఆకలి దుఃఖమును ఆపగలదా? ఈ స్వరం సహచరాచర జగత్తును అరవది ఏండ్లు చూచాను. నాయీ ప్రశ్నలకు సమాధానం లభించలేదు.

అది ఒక పట్టణం అక్కడ బలవంతులు బక్క వానిపై స్వారీ చేస్తారు. బలవంతుని అధికారమునకు పలుకబడికి దిక్కులు కూడా అదిరిపడి తలవంచుతాయి. ఆ బలవంతుల

చరిత్రను పెద్ద పెద్ద గ్రంథములలో వ్రాసి బహుమతులందుకుంటారు కవులు. అందులోని చెత్తను ఆహారముగా భుజించి నెమరు వేస్తూ ఉంటారు ప్రజలు. అక్కడ సత్యము అసత్యములై కూర్చుంటుంది. అసత్యము సత్యమై ఏలుకుంటుంది. బ్రతికియున్న వారికంటే చచ్చిన వారికి పెద్ద పెద్ద భవంతులు నిర్మాణం జరుగుతుంటాయి. ప్రజలను దోచుకునే వాడికి విగ్రహాలుంటాయి. నిజాయితీపరులకు ధర్మజీవనం సాగించే వారికి అచట ఉనికి లభించదు. బలవంతులైనవారు విందులారగించిన విసరి వేసిన ఎంగిలి విస్తరాకులకై పేదల కలహాలు సాగుతుంటాయి.

ఆ సుందర భవంతుల్లో మధుర భక్ష్యములతో విందారగించుచున్న ధనికులను చూస్తూ చూస్తూ అర్చి నిలువునా ప్రాణముల విడిచినాడు ఒక దరిద్రుడు. అన్నము తినునప్పుడు ఇతరుల కన్నులలో బడుట తప్పుగా భావించారు. సంపన్నులకు అతని చావు చూచుట కంట్లో పాతకంగా తోచినది. “ఈ గాడిద ఎవడో ఇక్కడ చచ్చినాడుఈడ్చి పారవేయుడు. మా నిష్టను గంగ కల్పినాడు” అని విందునుండి లేచి వెళ్ళి పోయినారు. హృదయ విదారకమై సహించరాని వేదనతో కూడియున్న ఈ పేదవాని అకాలమరణం గురించి అచ్చటి కవులు ఒక బాష్పకణం అయినను రాల్చలేదు. కానీ వారి కలం దుర్మతులైన రాజుల కథలను సురాసుర వ్యర్థపదార్థ గాథలను వర్ణిస్తుంది ఆ కలం”

ఇక్కడి వీరికెవరికీ ఒక భవిష్యత్ దర్శనం కాలేదు. భవిష్యత్తు ఎదురు చూస్తుందని వీరికి తెలియదు.

**“చచ్చిన పేదవాడు కడసారి విదిల్చిన కంటి నీటిలో**
**వెచ్చదనంబు. తత్పురము వీధుల నున్నత కుడ్య పంక్తిలో**
**జొచ్చి సజీవమై యెదురు చూచుచున్నది. ధర్మ దేవతన్**
**హెచ్చరికించుచున్ ఫలితమే యవతారము దాల్చివచ్చునో”**

“నేను సోషలిస్టును” ఈ వ్యవస్థసర్వదీన దారిద్ర ప్రజకు అన్నం పెట్టగలదని కాదు. అసలు ముద్దేకరవైన వానికి, ఒక ముద్దయినా పెట్టగలదేమోనని.

దేశం సమస్త సంపదలతో తులతూగాలి. పరిశ్రమలు స్థాపించాలి. వర్తక వాణిజ్యాలు వృద్ధి కావాలి. ప్రతి ఒక్కడూ పేదరికం నుంచి ఆకలి నుంచి విముక్తులు కావాలి. ముందు కడుపు నిండాలి. ఆ తర్వాతనే భగవచ్చింతన. కాలేకడుపుతో ఏ మనిషీ భగవంతునిపై దృష్టి నిలుపలేడు. అలా దృష్టి నిలపమని పేదవానికి బోధించడం కూడా నేరమే!”

**– స్వామి వివేకానంద**

ఈనాటికి నా ప్రశ్న ప్రశ్నగానే యుండిపోయినది. ఈ ఆర్థిక వ్యత్యాసానికి, సాంఘిక వ్యత్యాసానికి కారణము ఏమిటి అన్వేషిస్తూనే యున్నాను. నా ఈ అన్వేషణలో రెండు

జవాబులు దొరికినవి. ఒకటి సహ మానవునిపై మానవుడు చేసే దోపిడి. స్వార్థం మూలం తన స్వార్థ ప్రయోజనములకు కొందరు పేదవారిగానే యుండిపోవాలి. అందుకు పేదరికం పోవాలనే నినాదములు చేస్తూ ఉంటారు. పేదరికం కూలి జీవనం సాగుతూనే యుండాలి. ఆ కూలి కూడా ధనికునితో సమానమై ఎదిగితే ధనికుల పనులు జరగవు.

నాకు లభించిన, రెండవ జవాబు.... మానవుడు సృష్టించుకొన్న పుణ్యకార్యములు దైవసృష్టి ఈ దేవతల సంఖ్య తామర తంపరగా ఎదిగిపోయినది. ఆ రాతి విగ్రహములకు, లోహవిగ్రములకే నైవేద్యములు చాలడం లేదు. పేదల ప్రశ్నలను పక్కదారి పట్టించే ప్రయత్నంగా భావిస్తున్నాను. దేశాధినేతలు ప్రజాపాలకులు యీ ప్రశ్నకు జవాబు దారి.

*''RICHES'' John Runkin declared '' are a power like that of electricity acting through in equalities or negations of itself. The force of the guinea you have in your pocket depends wholly on the default of a guinea in your neighbor's pocket. If he did not want it, it would be of no use to you''-*

అందుకే ఎటుచూచినా ఆకలిసొద. ఎటువిన్నా అన్నమో రామచంద్రా!...

**అన్నమో రామచంద్రాయంచునల్లాడి**

**పరదేశములకేగి బ్రదుకునారు**

**యకర మొక్కటికి మానిక గింజరాలక**

**హరిహరీ యంగలార్చువారు**

**పన్నుగట్టుట కింద్ల వాకిళ్ళు తెగనమ్మి**

**మై మీద బట్టతో మసులువారు**

**సుంకు వట్టిన కంకి సురిగి వర్షములేక**

**యెండి పోవగ జూచి యేడ్చువారు**

**నీకు దాపున నున్నారు నిశ్చయముగ**

**నిన్ను కన్నార వీక్షించి నిబ్బరించి**

**సంతసించిరి నీకు నిచ్చలును పూజ**

**జరుగు నాగార్జునాచార్య సాగరంబ;**

నాగార్జున సాగరాలు, శ్రీశైలం జలాలు, భాక్రాంనంగల్, గంగాప్రవాహాలు ఎండిన బీటలు వారిన భూమిపై ఉరకలేస్తూ సస్యశ్యామలం చేస్తున్నాయి. కష్టజీవులు కూలీలు, కార్మికుల శ్రమ బిందువులతో తడుపుకొంటున్నారు.

**వెలుతురు వాయువున్ జలము విశ్వమునం బ్రతివానియా స్తిపా**

**స్తులు లభియింపవేరికిని సుంకముగట్టక రాచవారి యం**

**ఘ్రుల రజ మంటకుండ వెలుగుం గనజాలవు సంస్థ లిట్టి విం**

**తలు విపరీతముల్ బహువిధంబులు గల్గు ధరాతలంబునన్**

ఈ సమాజాన అందరూ పరుల శ్రమ దోపిడీదార్లు కారు. పరాన్నభుక్కులు, పరభాగ్యోపజీవులు కారు – పరహితం, సమాజశ్రేయం – సర్వసమత్వం కోరిన కోరుకుంటున్న మానవతా మూర్తులున్నారు. వారి మతం విశ్వమానవత్వం – వారికి యీ పేదల అన్నార్తుల, దీనుల కష్టాలు జ్ఞాపకం వస్తూ ఉంటాయి.

కరుణార్ద్ర హృదయులై మానవతామూర్తులు ఆశించే సమాజంలో... నేను కోరుకున్న కొత్తలోకంలో

**కనుపింపరాదన్న కటకటాకటఁ దూలి**

**క్షుభితమౌ దీనభిక్షుకచయంబు,**

**ప్రవహింపరాదన్న స్వార్థ బీజములఁబో**

**షణ సేయు దీర్ఘ తృష్ణాఝురంబు,**

**సాగరాదన్న రాచరికంబు సేయు తు**

**చ్ఛంబైన యుచ్చ నీచతల దాడి**

**మనగూడదన్న దుర్మతముల పేరిట**

**దలయెత్తు నెత్తుటి కలహ రభస**

**బ్రతకరాదన్న టక్కరి పన్నుగడలు,**

**సాగరాదన్న ఘన నిరుద్యోగ ధాక,**

**ధనము దాన్యంబు నొకని పెత్తనము క్రింద**

**కట్టువడి వ్యర్థముగ తుప్పుబట్టరాదు.**

ఇటువంటి న్యాయవంతమైన సాంఘిక వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థను మనం స్వార్థం, ద్రోహం, కర్మ సిద్ధాంతం, పూర్వజన్మ సుకృతాలు వదలి – నిర్మలమైన విశ్వమానవతతో ఏర్పరచుకున్న నాడు బుద్ధుడంతటి మహామహులు కోరుకున్న స్వర్గం మరెక్కడా లేదు. యిక్కడే యీ భూమిపైనే ఉంది.

* * *

# కవిగా ఎదగడానికి...!

**నా** చిన్ననాటి సాంఘిక వాతావరణంలో కడగొట్టు జాతి వారికి అస్తిత్వమే లేదు. ఎవరూ దానిని గుర్తించలేరు. మాదిగలు, మాలలు అని మర్యాదలకు తావులేని అభిధలతో పిలిచే పిలుపులు పలికే దీనులు, పేదలు, అనామకులు వారు.

ఆనాటి పంతుళ్ళు అందరూ సవర్ణ హిందువులై కడగొట్టు జాతి వారిపై కోపము రోత నింపుకున్నవారు. మా పుస్తకాలు దాచుకొనుటకు, మేము కూర్చుండుటకు అందరి పిల్లలకు దూరంగా ఒక మూల మాకై ఏర్పాటు చేసిన ముసలి బెంచి ఒకచోట వుండేది. పంతుళ్ళకు కోపం వచ్చినా మమ్ము చేతితో కొట్టే వారు కారు. ఆటలలో మాకు స్థానము లేదు. అప్పుడే నా కన్నులలో మెదిలిన దృశ్యం ఒకటి మరల చిత్రిస్తున్నాను–

**అన్ని కులాలు బాలురిసుమంతయు భేదములేక, స్వేచ్ఛగా**
**అన్నలుదమ్ము లట్లెదుట నాటల పాటల నొప్పుచుండగా**
**కన్నుల జూచి, నా చిఱుతగర్భములో, నపుడెంత బాధ యు**
**త్పన్నము నందెనో! యడుగవచ్చు కళాసదనాంగనామణిన్.**

ఆనాడు నావంటి పేదల చదువులు కోరికలతో పాటు నడిచేవి కావు. నా చదువంతా ఎనిమిదో తరగతితోనే పూర్తి అయింది. ఆ చదువు మావంటి వారికి అందుబాటులో వున్న పంతుళ్ళ ట్రైనింగ్ వరకే. అదీ ఆనాటి క్రైస్తవ మిషనరీలు నడుపుతున్న బోర్డింగ్ స్కూలులోనే మాకు ప్రవేశార్హత.

బాపట్లలో మిషనరీలు నడుపుతున్న టీచర్ హైయర్ గ్రేడ్ ట్రైనింగ్ చేరాను. రెండు జతల బట్టలు దొరసాని ఇచ్చిన పుస్తకాలు, చెక్క దువ్వెన, చిన్న అద్దం, చిన్న సీసాలో ఆముదము, సత్తుకంచం, గ్లాసు ఒక చెక్క, పెట్టెలో పెట్టుకొని మరో ఇద్దరు స్నేహితులతో బాపట్ల చేరాను.

ఆనాటి బోర్డింగ్ స్కూళ్ళలో మూడు పూటల ఉచిత భోజనం పెట్టి పుస్తకాలు ఇచ్చేవారు. నిరుపేద విద్యార్థులు ఆ ఏర్పాటే సర్వ సౌఖ్యాలుగా భావించేవారు.

ఈ వసతులతో పాటు క్రైస్తవ మతబోధ, బైబిలు పఠనం, ప్రార్థన ఉండేవి. ఈ సహాయం అందించిన మిషనరీ దొరలకు మేము బానిసలకు బానిసలుగా ఉండేవారం. ఆనాడే నా మనస్సుకు ఈ వ్యవస్థ కంటగింపుగా ఉండేది....

**"సహియింప దయ్యో శైశవమందె నా చిన్ని**

**చిత్తంబు తెలవారి పెత్తనంబు**

**హర్షించదయ్యో నా యంతరంగము నిస**

**ర్గ జ్ఞాన మరికట్టు కట్టు కథలు"....**

బానిసత్వముతో పాటు పెరిగిన దైన్య స్థితి ఎటువంటిదంటె బోర్డింగ్‌లో... మాకు మూడు పూటల అన్నం పెట్టేవారు. సజ్జ, జొన్న, సంకటి, వారానికొకసారి, ఆదివారము నాడు వరి అన్నం మాంసాహారము ఇచ్చేవారు. దానికోసం ఈ పేద విద్యార్థులందరూ అర్రులు చాచేవారు. రాత్రి భోజనాన్ని మర్నాటి ఉదయానికి చెక్కపెట్టెల్లో దాచుకునేవారు. ఆ దాచుకున్న అన్నాన్ని దొంగిలించి తినేవారు. ఇంతటి దైన్యస్థితి ఈనాటికి నా హృదయాన్ని కలిచి వేస్తున్నది. ఈ మాత్రము తిండి దొరకక ఆకలి చిచ్చులో పడి నశించిన వారు ఎందరో....

**"దీనులనామకుల్ గుడువ దిండియెఱుంగకయే యుగాననో**

**మేనులు వాసి రాపులుగు మేసిత్యజింప విశీర్ణ శల్యసం**

**తానములై రహింప నెడదన్ గదిలించెడు నల్ల కాటికీ**

**శాను దిశన్ మదీయ జాకికి మొన్న సమాధి జేసితిన్.**

బోర్డింగ్ స్కూలుకు శెలవులు ఇచ్చారు. చాలామంది విద్యార్థులు అతి ఉత్సాహంగా యిళ్ళకు బయలుదేరారు. నేను, నా స్నేహితులిద్దరు.. మాలో యింటికి వెళ్ళాలని ఎంతో బలీయంగా వున్నా ప్రయాణ ఖర్చులు లేక దిగులు పడి కూర్చున్నాం. అంతలో బాపట్ల నుండి వినుకొండ నడిచిపోవాలని ఆలోచన వచ్చింది. మా వస్తువులు చెక్కపెట్టెలో పెట్టుకొని దానిని మోసుకుంటూ కాలినడక ప్రారంభించాము. బాపట్ల నుండి వినుకొండకు. దారిలో కనపడిన కాయకసురులు తింటూ, నా స్థితిని వినిపించి అన్నం పెట్టినచోట తింటూ ఆ మర్నాడు సాయంత్రానికి నర్సరావుపేట రైల్వే స్టేషన్‌కు చేరాం. నా కాళ్ళు వాచిపోయి నడవలేని స్థితికి వచ్చాను. నా స్నేహితులు నా స్థితికి జాలిపడి ప్రయాణీకుల వద్ద దమ్మిడీలు వసూలు చేశారు. ట్రైయిన్ టిక్కెట్టు కొరకు.

**పేదరికంబు పెద్ద వింత చదువులబడి**

**దానిలోన లజ్జకాన బడదు**

**ఉదరము వొజ్జ యగుచు ఓరంత ప్రొద్దులు**

**ఓర్మి విద్య నేర్పుచుండునచట.**

నా ట్రైనింగ్ పూర్తయింది. ఉపాధ్యాయుడుగా పాస్ అయ్యాను. మేరి అనే సద్గుణ రాశిని మేనరికం అనే జన్మహక్కుగా ఎదిగిన దానిని, తల్లితండ్రులు కూర్చిన దానిని వివాహమాడాను. మాది బాల్య వివాహము. మా పల్లెటూరు చాట్రగడ్డపాడులోనే బడిపంతులుగా చేరాను.

చాట్రగడ్డపాడు కుగ్రామములో మా చుట్టాలు వున్నారు ఇప్పుడూ. ఆనాటి కానాటికి దారిద్ర్యం వారి వెంటే నడిచి వచ్చింది. చాలీ చాలని అన్న వస్త్రాలతో సంపూర్ణ దాస్యంతో మా మతం మా ప్రార్థన, పైలోకాన్ని మాకు అందిస్తుంది అనే గర్వంతో నేటికి జీవిస్తున్నారు.

**"మురిగిన పాటలున్, మనసు పూయని చచ్చు కథానకాల్పున**

**శ్చరణ మొనర్చుచున్న దిగజారునె స్వర్గము నేలమీదికిన్**

**నరుని మనస్సులో కలుష నాటక వహ్ని శమింపకుండిన**

**పరమను మాట కర్థమును సమత్వ సుఖంబని విన్నవించెదన్"**

అటువంటి సమయములో నాలోని కవితా కన్య కువకువలాడింది. ఆనాడు ఆంగ్ల భాషా వాతావరణం కూడా ఎక్కువగానే వుంది. ఆ భాషా ప్రవాహంలో ఈతలు కొడుతూ ఆగ్రహం వచ్చినా ఇంగ్లీషులోనే తిట్టుకుంటూ సంస్కృత తెలుగు విద్వాంసులను నాగరికత లేని పశువు అని వర్ణించేవారు. మరోప్రక్క తిరుపతి కవి, వేంకటకవి ఇద్దరూ జంట కవులై మీసములు మెలవేసి కవులెల్లా బిత్తర పోయేటట్లుగా అసమాన కవితా పటిమతో అష్టావధాన, శతావధానాలు చేస్తూ బుడి బుడికవులు దిమ్మర పోయేట్లు ఆంధ్ర దేశమంతా సుడిగాలిలా తిరుగుతూ కవితా ఝుడివానలు కురిపిస్తున్నారు.

ఆ జంట కవుల కవిత్వం తేజం ఆంధ్రదేశపు నాల్గు దిక్కులను తేజరిల్ల చేసింది. తెలుగు భాషా కన్యకు నాజూకు నడకలు నేర్పించారు.

అసమాన పాండితీ ధీ శక్తితో ఆ జంటకవులు బహు అవధానాలు చేసి అఖండ పండిత విశిష్ట సభా జయకీర్తి ధాన్యరాసులు కుప్పలు పోశారు. తెలుగువాణి పులకరించింది. ఆ ప్రభావానికి ఉత్తేజితులై ప్రజ్ఞాపాటవాలు కలిగిన కవినందనులు పల్లెపల్లెనా ప్రభవించారు. పద్యమందుకున్నారు.

అప్పుడూ ! "శ్రవణానందము" చదివిన నావంటి యువకులలో వలపు ఊహాలు ఉబికి వచ్చి ఆ వెంటనే నవనవ కవితా కోకిల కువ కువలాడుతూ పాడింది. నాలోని కవితా కన్య సర్వాభరణ భూషితకావడానికి నా హృదయమందిరాన అందెల రవళులు

ప్రోయిస్తున్నది. నాలో మొలకెత్తుతున్న కల్పనాశక్తి ప్రతిభావుత్పత్తి వేళ్ళు నాటుకొన్నది. చిగురు తొడుగు కుంటున్న నా కవితాలతను పెరికివేయ ఎవనికీ శక్తి చాలదనే! ధీమా కూడా జొరబడింది! నాలో ఆనాడు తెలుగులో వచ్చిన కావ్యాలను తెంచే శక్తి విజృంభించింది నాలో తెలుగు కావ్యాలు, ప్రబంధాలు చదవాలనే కోరిక బలీయమై ఒత్తిడి చేస్తున్నది... ఎక్కడ దొరుకుతాయి! ఎలా కొనగలను? ఎవరు నా కందించగలరు? అనేక ప్రశ్నలు నా ఆర్థిక స్థితిని, ధ్యైన్ని హేళన చేస్తూ ఎదురు నిల్చాయి.

**"తీంద్రల్ కలిగిన వారికి ఏ కరణిన్ విద్య రాకుండెనే?'**

వాక్యం నాకు కొంత ధైర్యాన్ని అందించింది. నేను

సాధించగలను. అనే తుది నిర్ణయం నిలువెత్తున లేచి నిలుచుంది.

**"నీ దృక్పథమునందు నిఖిల ప్రపంచంబు**
**నగ్న సుందరమైన నల్లపూస**
**నీ మానసము దయారామాభి వృద్ధికి**
**అమృతంబు జిల్కు వర్షాగమంబు**
**నీ చరిత్రము గాఢ నిద్రా దరిద్రాణ**
**కుతల చక్రమునకు కోడి కూత**
**నీ వాణి వికట భావావేశ రభసకు**
**గిరిదాటరాని సుగ్రీవముఁ ద్ర**
**సుప్రశాంతిరత్న శుద్ధాంతముల నిల్చి**
**తపమొనర్చు యోగధనుడ వీవు!**
**భావ దాస్యమునకు నీ వతీతుడవంద్రు**
**ప్రజ్ఞ విస్మరింపవలదు సుకవి.**

ఆశువుగా పద్యాలు చెప్పడం, మెప్పించడం, ఆశ్చర్యపరచడం ఆనాడు అది ఒక నూతన కవితా ప్రక్రియ అయింది. తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులు ఆశు కవిత్వంలో అసమాన ధీరులై అసమ మేధా నిధులైనారు.

ఆ సమయంలోనే వారిద్దరి మధ్యా వైదీకి – నియోగి తెగల కలహం అంకురం నాటుకొన్నది..... ఈ విత్తనం వారిలో (ఆ కవులలో) ఏ పుణ్యాత్ముడు నాటి తమాషా చూడాలనుకొన్నాడో... తెలీదు. మొత్తానికి నాటుకున్నది... జ్వాల అంటుకున్నది.. అది ఇంతింతై, వటుడింతైనట్లు – కలహాగ్ని ప్రళయాగ్ని కీలలై..... ఇద్దరి మధ్యా ద్వేషపు జ్వాలలు రేగినాయి.

తెలుగుదేశ చరిత్ర సాంఘికంగా దీనస్థితికి కుంగి, తాత ముత్తాతలనాటి వర్ణ కలహాలు తలెత్తి కుల కక్షలూ బలం పుంజుకొన్నాయి. వీటికి కుమ్మక్కుగా యీ కవులు నిలిచారు. కులాలు, జాతులు, తెగలు, మతాల మధ్య సామరస్య శాంతి జీవనాన్ని ప్రోత్సహించవలసిన కవిత్వం... చివరికి వారి మధ్య రగులుతున్న ద్వేషానికి ఆజ్యం పోసేవిగా మారడం.....

శాంతి, సౌభ్రాతృత్వం కాంక్షులైన వారందరికీ, మనస్థాపాన్ని కలిగించింది ఆ వాతావరణం.

వైదిక, నియోగి కక్షలు పాదుకున్నవి. ఆనాటి కవులకు ఆ తగాదాలు దోహదం చేశాయి. వాళ్ళ పాండిత్యం గుట్టలు గుట్టలుగా దిమ్మరించి తిట్టు కవులుగా మారు మ్రోగినివి.

అప్పుడు నాలో నూతన ఆలోచనలు రేగినాయి. సాహిత్యం సర్వమానవ జాతికి మంగళకరమైనదిగా ఆవిర్భవించాలి. కానీ నేడు కవిత్వమంతా సీతారాముల పెండ్లి పేరంటాలు. శ్రీకృష్ణ శృంగార లీలలు ఏ నాటివో యజ్ఞ యాగములు నిండిన పుక్కిటి పురాణ గాథలే కవితా కథా వస్తువులా. ఇక కథలే లేవా?

నిత్యం మనకళ్ళ ఎదుట జీవించే ఎన్నో కథలు కావ్య వస్తువులు కాలేవో, సోదర మానవుల క్షుధార్తి దీర్ఘ దారిద్ర్యాన్ని నిరసించి సర్వ మానవులకు ఒక భవిష్యత్తును, ఆశా జ్యోతిని అందించి కవితలు, కావ్యాలు ఉద్భవించాలి. అని మనసు పలువిధాల వాపోతూ వుండేది. అవకాశం ప్రోత్సాహం కరవు. జూపూడి హనుమచ్ఛాస్త్రి సహృదయంతో నాకానాడు కాళిదాసత్రయం, అభిజ్ఞాన శాకుంతలం, మేఘసందేశం, కుమార సంభవం కావ్యాలు భావార్థాల సమ్మేళితమైన వాక్యంతో బోధించారు. శృంగార నైషధ కావ్యములోని సంస్కృత సమాస పద భూయిష్టమైన పద్యాలు కంఠస్థం చేసి నా ప్రాయపు వారిని గుంపు చేసి తప్పులు, ఒప్పులు కలగాపులగంగా పాడి, మిత్రులు బెదిరిపోయేట్లు చేసి ఆనందించేవాడిని'.

**నా తోటి బాలు రందరు పృచ్ఛకులు గాగ**
**తల తోకలేని పద్యములు చెప్పి**
**కుతి దీరకను పట్టు ప్రతి పదార్థము మీద**
**కృతలల్ల కలాలు కాగితము దడవి**
**ఆల కింపుడు పద్దియముల నల్లితి నంచు**
**వలదన్నవారి వీనులకు బులిమి**

**పది మందిగల రచ్చపట్ల నల్లన జేరి**
**కవితా ప్రసంగంబు గదలనైచి**
**ఒక్క పదము సాగి, తక్కిన పాదముల్**
**పెకలి రాక ధార బిగిసి పోవ**
**చెలులు పరహసింప జెప్పితినష్టావ**
**ధానములను శతావధానములను –**

దారిన పోయే వారు కూడా నిలచి నా పద్యపాటవం విని "వీడా వీరయ్య కుమారుడు" ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ వుంటే నేను ఉబ్బి తబ్బిబ్బై పడిపోయేవాడిని ఆనాటి ఉద్రేకం తలంచుకుంటే యీనాడు గుండెలు అల్లలాడి సిగ్గు వస్తున్నది.

తెలుగు కవిత్వం వ్రాయడం సామాన్యమైన సాధారణ విషయం కాదు.

పద్యం మొదలై గణాలు కూర్చు కొని కొంచెం సాగగానే 'తగ్గవయ్యా' వకీ అంటూ 'యతి' ఎదురై నిలుస్తుంది 'నేనేగతి' అంటూ, 'యతి'ని బుజ్జగించి, మచ్చిక చేసుకొని మరో అడుగు వేయగానే 'ప్రాసగాడు' అడ్డం వచ్చి, నీ యిష్టారాజ్యం అనుకున్నావా? ఏమిటి? అంటూ నిలదీసి కుతి పట్టుకుంటాడు. ఎలాగో ఒక విధాన యతి, ప్రాసల కష్టాంబుధి యీది ప్రాస వేదన దాటి పయనం సాగిద్దామనుకుంటే... అప్పటి వరకూ సాగిన 'భావం' తలాతోక ఏది నాయనా? నన్ను అర్థం పర్థం లేకుండా వ్రాస్తున్నావ్? అని ఇబ్బందుల పాల్జేస్తుంది. సరే ! భావాన్ని కూడా పొందు పరచుకొని పద్యాన్ని యికపూర్తి చేద్దాం అనుకుంటే 'రసం' కాస్తా రసాభాసమై.. రసహీనమై పద్యం ఎందుకులే కవిగారు! అని అది నిరాశ పరుస్తుంది.

ఇన్ని ఇబ్బందులు దాటి గట్టెక్కుదాం అనుకుంటే 'వ్యాకరణం' ఆదరింపదు.

"శబ్ద మర్యాద దెబ్బతిన్నదయ్యా కపీశ్వరా" అని ప్రయత్నాన్ని జటిలం చేస్తుంది.

ఇక యతి, ప్రాసలు మనసులో జొరబడి మరో పని చేయనివ్వవు. అసలు మాట వినవు. సర్దుకు పోవు. ఎదురు చూచిన ప్రకృతి వర్ణనో, మరేదో విషయం తీసుకొన్న పద్యం వ్రాద్దామంటే యివన్నీ చేరి "నన్ను అతికించు' నన్ను వదలలేవు అన్నట్లుగా దెయ్యాలై వెంటబడి వేధిస్తాయి. ఈ గోల పడలేక పద్యం లేదు. నిద్రలేదు మానుకో అని అనుకున్నా.... లోపల పెరుగుతున్న కవితా సృష్టికాంక్ష నిలువనీయదు.

**మానస గోచరంబగుచు, మాటలకందని భావరాశి, ఛం**
**దో నియమాంతికంబగుచు, దోచుచు కూరుపు చేయబోవ, స్వా**
**ధీనముగాక, దూరమయి, తిప్పలుబెట్ట, కవిత్వకర్దమ**

**స్నాన మొనర్చుచుం, గడపినాడ ననంతనిశాపరంపరల్.**

ఇదీ తెలుగు కవిత్వపు తీరు తెన్నులు... ఏమని వివరించనులే యీ కవిఘోష! కవిగాని బ్రతుకు శ్రీరామ! రామ! కనబడిన, చేతి కందిన తెలుగు కవిత్వాలు చదివీ కండ్లు జబ్బు చేసే దాకా చదివాను.

కవితా పరిశ్రమకు ముడి సరుకులైన భాష ఏది నావద్ద? అనుభవం ఏది? కనిపించిన ప్రకృతి వర్ణనో, ఏ స్వప్న సుందరియో పురాణాలు నా కవితావేశానికి ఆహారం ఇవ్వడం లేదు. యీ సాంఘిక దృశ్యాలే నాకు కవితావేశాన్ని కలిగిస్తున్నాయి. నా కవితా సంపదంతా వాటికే అంకితం చేయాలి. అందుచేత నాకున్న యీ కొద్ది భాష అనుభవం చాలదు.

కండ్లు తెరిచింది మొదలు నేటిదాకా వినుకొండ ఆ గుర్రం కొండలే నాకండ్లకు చిత్రాలు. ఆ చిన్న భూగోళమే నాకు లభించిన జ్ఞానం. ఆదివారాలలో ఆ దేవాలయంలో నేను పాడినవి, విన్నవి ఆముసలిపాటలే. ఆలోచన రేకెత్తటానికి ఏ మాత్రం ఉపయోగపడవు. ఇక నాకు ఏ కొద్ది భాషా జ్ఞానం. భావ సంపద లభించిందీ అంటే అవి వీధి భాగోతాలు. వీధి నాటకాలు, నాయనగారు పాడే గొల్ల సుద్దులు. పల్నాటి కథలు అవి పెట్టిన భిక్షయే.

ఇలాగ పరిమితమైన కురచ దృష్టితో నిలచి పోయిన నా ఆలోచనా తరంగాలు వినుకొండ దాటి, పరిసరాలు దాటి పోలేదు ఆనాడు. ఇక ఇతర నగరాల పరిచయాలు అసలే లేవు. కవుల పేర్లు విని స్పందించి, పుస్తకాలు చదివి కలము నడిపాను, కవినై నిలవాలనే తీవ్రమైన ఆకాంక్షతో.

నేను చూస్తూవున్న అనుభవిస్తూవున్న యీ సుఖదుఃఖ మిశ్రమ మహీవలయాన్ని, యీ దారిద్ర్యం, అసమానతల చక్రాల కింద నలిగిన, నలిగి పోతున్న దీనుల గాధలను, నా కవిత ద్వారా వెలికి తీయాలన్నదే నా లక్ష్యం. ఈ దుఃఖితులచే అనంతముగా న్యాయాన్ని ప్రశ్నింప జేయాలని నా ఆవేశం. ఈ చరిత్ర హీనులకు చరిత్రను సృష్టించాలన్నదే నా తపన.

తరతరాలు సాంఘికంగా, ఆర్థికంగా, కళారంగాన అణగగొట్టబడిన ప్రతిభలకు పట్టం కట్టించాలి. మూగలై, పిరికివారై, వెలికి, అగ్గమై పడివున్న యీ పతిత మానవులందరి హృదయంలో చైతన్య జ్వాల రగిలించాలి. పౌరుషం రేకెత్తించాలి.

వీరు రాజ్యాలు నిర్మించలేరా? కళా కారులుగా వెలగలేరా? కవులుగా ప్రతి సృష్టి చేయలేరా? అధికార పీఠాన్ని అలంకరించగల అర్హత లేదా?

ధనము, ధనమదమూ మతం, మత అహంకారము, కులమూ కులతత్వం, ఇవేనా రాజ్యాలు ఏల గలిగినవి? ప్రజలను పాలించే శక్తిగలవి? కాదు, కాదు అని చెప్పటానికే కలం అందుకున్నాను. నగారా మోయిస్తాను.

(అంతలో ఆనాడే యీ లావా కుత కుత ఉడికిందని... అది కవితాగ్ని పర్వత శిఖరం నుండి అన్ని దిక్కులుగా చిమ్మి, దూసుకు వస్తున్నాయి – ఆ తరువాత రచనలు తెలుపుతున్నాయి.)

కుదుపు లేక పద్యం రాదని నా నమ్మిక... స్వరాజ్య లబ్ధితో దేశం దుశ్శక్తులు సచ్ఛక్తులు విచ్చలవిడిగా లేచి వీరంగాలు వేయడం, ధర్మం గాయపడడం, అదొక కావ్యం కావడం పరిపాటైపోయింది.

మునుపు వంచన, అవినీతి, వర్గ దృష్టి, మతపిచ్చి ఒక ముసుగులో వుండేవి. ఇప్పుడా తెర కాస్తా పోయింది. కవియన్న వాడి చూపు, దాని పరిమితి,అసలు రంగు, తూకం, వైశాల్యం అటో యిటో తేల్చుకోవడానికి తరుణం. క్షుభ్య మానమై చురుకెక్కియున్న దేశం మోసాన్నిట్లే పసిపట్టగలదు. కవులకిది పరీక్షా సమయం విశ్వధర్మం, విశ్వమతం, ధీరవాక్కు, నేడవసరం. అష్ట కష్ట దేవతా కటాక్ష వీక్షణానికి అగ్గమైన నవ్య యుగాన్ని నేటికవి యెటు నడిపించి ధన్యుడౌతాడో కాలం నిర్ణయిస్తుంది. భయ కంపితమై హింసా పీడితమై యున్న ప్రజానీకానికి కవి వాక్కు ఆశాకిరణాన్నందించాలి. మిట్ట, పల్లాన్ని సమం చేసి చూపాలి. హింసిత ప్రజలమూకీ భాష్పాలకు నోరిచ్చిరచ్చకెక్కించాలి. కవుల ఆత్మవేదనోపశమనానికి ఇది ఒక సాధనం.

**"వాస్తవ జ్ఞానసంపత్తి ఖూనీ చేయు**

**గాధలు, జీర్ణంబుగావు నాకు**

**ఒక జాతి శ్రేయస్సునకు, సాయ మొనరించు**

**కపట సంస్థలు నాటకములు నాకు**

**అనుభవంబునకు గిట్టని నభఃకుసుమవే**

**దాంతముల్, ప్రబల స్వార్థములు నాకు**

**ప్రజల రక్తంబు నాస్వాదించు రాజకీ**

**యములు గుండెలకు భారములు నాకు**

**సహజమైన ప్రకృతి సౌఖ్యంబులొక వ్యక్తి**

**దొంగిలించి మనుట దొసగు నాకు – "**

**నిఖిల లోకమెట్లు నిర్ణయించిన, నాకు**

**దరుగు లేదు; విశ్వనరుడ నేను!**

(ఇది ఆనాడే జాషువాలో నాటుకొన్న స్వేచ్ఛా భావజ్వాల.... అదే తరువాత అభివృద్ధి చెందినది, ఆధిక్కారం!)

ఆనాడే నా మిత్రడు ఏలియా చాట్రగడ్డపాడు పాడిగేదెలు కాసేవాడు. ఆ దీనగాధ నాలోని కవితా పుష్టికి దీక్షా కంకణం కట్టింది. కలానికి పదును పెట్టింది. ఆ చాట్రగడ్డపాడు, గుండ్లకమ్మ వాగు ఒడ్డుమీద నుండి ఆ ఉదయపు సమయాల్లో మధ్నాహ్నపు వేళ్లలో, సాయం సంధ్యా సమయాల్లో ఒక అద్భుత గానం వినిపిస్తూ వుండేది ఆ పరిసర గ్రామాల ప్రజలకు.

ఏలియాకు సంగీతం నేర్పిన గురువే లేడు. 'నీ సంగీతం అద్భుతం' అన్నవాడే గాని నీకు శాస్త్రీయంగా నేర్పుతా! రా! అన్నవారే లేరు. పుట్టరానిచోట పుట్టాడు వాడు!! అనే సానుభూతి ఏలియా పాట ఆ చింత చెట్టు గుబుర్ల నుండీ, ఆ మర్రి కొమ్మల నుండీ, ఆ వేప చిటారు కొమ్మలనుండీ వినిపిస్తూనే వుండేది. దారినపోయే వారు, వినేవారు.

"వాడిపాట అడవిగాచిన వెన్నెల. పుట్టరాని చోట పుట్టాడువాడు" అనే సానుభూతి మాటలే తప్ప ప్రోత్సహించి, అవకాశం కలుగు జేసి అగానాన్ని కనీసం చాట్రగడ్డపాడు పొలిమేరలు దాటించలేదు ఎవరూ కూడ!

ఒకనాడు సాయంకాలం గేదెలు ఇళ్ళకు చేరాయి. ఏలియా చేరలేదు – ఆ మరునాటి నుంచి ఆ గానం వినబడలేదు.

**ఎంత కోయిల పాట వృధయయ్యనో కదా**

**చిక్కు చీకటి వనసీమలందు**

**ఎన్ని వెన్నెలవాగు లింకి పోయెనో కదా**

**కటికి కొండల మీద మిటకరించి**

**ఎన్ని కస్తురి జింక లీడేరెనో కదా**

**మురికి తిన్నెలమీద పరమళించి**

**ఎన్ని ముత్తెపురాలు భిన్నమయ్యె నొకదా**

**పండిన వెదురు జొంపముల లోన**

**ఎంత గంధవహన మెంత తంగెటి జున్ను**

**యెంతరత్నకాంతి యెంత శాంతి**

**ప్రకృతి గర్భమందు భగ్నమైపోయెనో**

**పుట్టరాని చోట బుట్టకతన.**

అది 1918, 1919 ప్రాంతం. అప్పటి నా వయస్సు 23,24 వుంటాయి.

వ్రాసిన వ్రాతలు చూచి 'సెహబాష్' అనే వాడొక్కడూలేడు. మా వూరి ఇద్దరు సంస్కృత పండితులూ వున్నారు. కాని బ్రాహ్మణ పండితులకు ఎక్కడలేని ఆచారం. సంస్కృత సముద్రంలో మునిగి నిరంతరం ఈతలు కొడుతూ వుండే పురాణప్రియులు. కర్మ సిద్ధాంతంలో పూర్తి నమ్మకమున్న వారు. నిమ్నజాతుల వారికి వారు పెను నిప్పులు! ఇక వారి నర్థించి లాభమేమిటి?

అప్పుడే దీపాల పిచ్చయ్య శాస్త్రి పరిచయమై స్నేహితులమైనాము. మా ఇద్దరి మధ్య స్నే హ వారధి నిలువడానికి 'కవిత' కారణం. పిచ్చయ్య శాస్త్రి సంస్కృత పండితుడు. ఆయన ఇంటికి మా ఇల్లు మతాచారం చేసిన 'దూరం' యెక్కువ. అంచేత ఇద్దరం కొన్ని రహస్య ప్రదేశాలు ఎన్నుకొని అక్కడ కలుసుకొని కవితా చర్చలు సాగించేవారం.

ఆనాటి జంట కవులుగా ప్రసిద్ధి పొందినట్లుగా మేము జంటకవులుగా రాణించాలని మహా ఉబలాట బడ్డాం. ముందు మా ఇద్దరి పేర్లు అతికి పోవాలి. తరుపతి వేంకట కవులు కొప్పరపు కవులు లాగ, పిచ్చయ్య పేరు, ముందుచేర్చితే పిచ్చి జాషువా లేక నా పేరు ముందుంచితే 'జాషువ పిచ్చి' ఎటు చూసినా జాషువాకే పిచ్చి పట్టేట్లు వుంది గనుక, ఆ ప్రయత్నం మానుకున్నాం. పేర్లు కలవకపోయినా స్నేహ బంధం గట్టి పడింది. ఆ నాటి మా స్నేహం నిన్నా మొన్నటిదాకా సాగింది. పిచ్చయ్య ఉద్యోగ బాధ్యతతో నెల్లూరు చేరారు. నేను మరలా ఒంటరి వాడినైనాను. నా కవిత్వంలో తప్పులు  చెప్పి దిద్ది మార్గం చూపేవారే లేరు. నేను కవిత వ్రాయడమే పాపం అనే నిప్పులు కక్కే వర్ణ భేదం. ఒకవేపు, ఆంగ్లేయుల నీడలో పెరిగే స్వజాతి ఆంధ్రకవులు అంటేనే గిట్టని జనం మరోవేపు ఇటువంటి పరిస్థితులలో నా తిప్పలు ఏమని చెప్పను? ఎవరికి చెప్పుకోను? ఆ రోజుల్లోనే కొప్పరపు కవులలో ఒకరు వినుకొండలో ఏర్పాటు చేయబడిన కవి సమ్మేళనంలో పాల్గొన్నాడు. ఆ కవిపై అభిమానంతో పద్యాలు వ్రాశాను. ఆ పద్యాలు కవికి అందించాలనే ఉత్సుకత. నాకు సభలోకి ఆహ్వానం లేదు. నేను సభకు చేరువగా తచ్చాడుతూ వుండటం గమనించి మిత్రుడొకడు.

**"కులమత విద్వేషంబుల్**

**తలసూపని తావులేక కళారాజ్యంబుల్**

**కళలా యుష్మంతములై**

**యల రారెదు నెలవు స్వర్గమగు చెలికాడా !**

ఈ చేరిన గుంపు అంతా రసజ్ఞులు కారు.. పద, అంటూ నన్ను చేయిబట్టి సభ్యులంతా ఆశ్చర్యంతో చూస్తూ వుండగా ఆశు కవికి నన్ను పరిచయం చేయించాడు. ఆశుకవి బంగారు కడియం ధరించిన చేయిచాచి కవులుకాదగు యువకులు యీ పట్టణాన గలరా? అంటూ నవ్వి కాగితం అందుకొన్నాడు.

అంతలో సభలో గుసగుసలు బహిరంగ తిరస్కారం ప్రారంభమైనది. "నిమ్నజుడు యీ సభలోనికి ఎట్లు జొరబడే" అంటూ కొందరు ఆగ్రహించి లేచి వెళ్ళినారు. అంత నలుగురూ నాలుగు మాటలన్నారు. పగబట్టిన త్రాచు బుసకొడుతూ తీక్షణ దృష్టి చూస్తున్నట్లుగా వున్న ఆ చూపూలు వెంట తరుమ నేను ఘోరతప్పిదం చేసినట్లుగా తలవంచుకొని ఇల్లు చేరాను.

ఆనాడంతా ఇల్లు వదలక నిరాహారినై కుమిలి పోయాను. అవమానాగ్ని దహించివేయగా రోమ రోమానా వెచ్చని నిట్టూర్పులు చిందుతున్నవి. మనస్సును నమిలివేసే దుఃఖం ఆ రోజంతా నన్ను దహించి వేసింది.

భారత గ్రంథం తెరచి 'మత్స్యయంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని చేపట్టే ఘట్టం చదువుతూ నిద్రపోయాను... పాండవులతో పాటు పోటికి వచ్చిన కర్ణుని చూచి గురువులు అతని అభిజాత్యాన్ని ప్రశ్నించి, పోటీకి అర్హత లేదని హేళన చేసి, తలవంపులు చేసిన ఘట్టం.

శరీరాన్ని పదివేల అంపములతో ఖండించి నట్లై లజ్జా కుంచిత గ్రీవుడై కర్ణుడు సభ విడిచి పోయినాడు.

మిత్రుని దుర్యోధనుడు ఓదార్చుతూ "సత్యము విస్మరింపదు కర్ణా! నీ సహజ తేజమును నార్పగ జాలునే వ్యర్థమైన జాత్యం? సత్కవి కోటి కలాల నిత్య సాంగత్యము కలిగి రాగల యుగంబు నీ చరిత్రను నుతించగలవు" – ఆ పలుకులు నాతోనే అన్నట్లై.... కన్నులు విచ్చితివి. అది కల అయినా నాకా కల ఊరటనిచ్చింది.

**పాపి వీడటంచు పదుగురు గుమిగూడి**

**యేసుక్రీస్తు ప్రభున కెఱుక జేసి**

**బాగు చేయుమంచు ప్రార్థింప సాగిరి**

**మేటి భోధకులును, మిషనరీలు**

యౌవ్వనపు వేధింపులకు నేనూ గురి అయ్యాను "చదువుకొనవోయి ప్రణయ శాస్త్ర ప్రపంచ మధుర మంజుల సాహిత్య మధన" – ఎవడో కొంటెవాడు గుండెలో

జేరి నన్ను బలవంత పెట్ట సాగినాడు. నేను ఏవేవో ప్రణయ కలాపములు సాగించాను. రసిక కవిమహా శయులవలె!

ఇది తెలిసిన క్రైస్తవ మత బోధకులు నాపై వ్యభిచార అభియోగం తెచ్చి 'పాపివీడు" అన్నారు. మరొక పాపం చేస్తున్నాడు వీడు. హిందూ గ్రంథాలు చదవడం, హిందూ పురాణాలు, కావ్యాలు వాటిలోని కథలను నాటకాలుగా వ్రాస్తున్నాడు.

'హిమద మార్క పరిణయం; ధ్రువ విజయం' నాటకాలు వ్రాసి వున్నాను. వారికి కంటకింపుగా వున్నవి. ఈ నెపం మోపి నన్ను 'సంఘం నుండి' వెలి వేశారు.

ఆనాడు 'వెలి' అంటే చాలా పెద్ద తప్పు. వానికి కుటుంబానికి ఎవరూ సహాయం అందించరు. అవసరమైన వస్తువులు కొననివ్వరు. ఎవరూ వారిని శుభ సమయాలకు ఆహ్వానించరు. మా తల్లితండ్రి మిషనరీల ప్రాపకంలో బ్రతుకుతున్నారు. తండ్రీ పాదరీ ఉద్యోగం కూడా ఊడవచ్చు. కుటుంబం కష్టాల పాలు అవుతుంది. అంచేత యీ వెలిని వారు ఎదిరించ లేకపోయారు. మా అమ్మ, భార్య రాత్రింబగళ్ళు దుఃఖించారు. నేనే ఇంటినుండి పోయి, ఆ వూరిలో రైలు పట్టాల పక్కనే వున్న (ఈ నాటికీ వుంది అది!) ఒక పాడుబడిన మసీదు రా ! రమ్మని పిలిచింది. పగలు గూబలు, రాత్రులు గబ్బిలాలు తిరుగుతూ వుంటాయి. ఆ మసీదులోనే పగలాంతా గడపడం రాత్రులు గుడ్డి దీపపు వెలుగులో కావ్య పంచకం పూర్తి చేశాను. ఒక రాత్రివేళ రహస్య దారిన ఇంటికి పోయి అన్నంతిని, మరలా తెల్లవారకముందే మసీదు చేరేవాడిని.

ఈ పాపి ఉద్యోగానికి కూడా అర్హుడుకాదని ఉద్యోగం నుండి తీసివేశారు. మూడు నెలల జీతం మూడు రూపాయలు మాత్రమే ఇచ్చి, ఊడెను బడిపంతులు పని... మర్యాదకూడా ఊడింది... వూడిందిలోన ఉత్సాహం... సంసారం మాత్రం ఊడలేదు. ఈ సంసార భారాన్ని మోయడానికి పల్లెలు, పట్టణాలు తిరిగాను.

భయపడే వాడిని చూసి హేళన చేసే సమాజం, భయపడని వానికి బానిస–నిజం నిక్కచ్చిగా చెప్పాడు కవి ఆనాడు. జాషువా సమాజానికి భయపడ్డాడు. హిందూ ఆచారాలకు భయపడ్డాడు. దూరంగా పో అంటే పోయాడే గాని, ఎందుకు? అని ప్రశ్నించలేని పిరికివాడైనాడు... తనను అవమానించిన వారిని ఎదిరించలేని శక్తిహీనుడై నాడు. కారణం? సమాజం. మనిషి మనిషికే బానిసై వుండాలి. మనిషి మనిషికే లోబడి జీవించాలి.

ఇదీ సమాజం ఆశించే సాంఘిక వ్యవస్థ. మనిషిని భయపెట్టేది బలహీనుణ్ణి చేసేది యీ వ్యవస్థ. ఈ వ్యవస్థను చీల్చుకొని బయటకు రాగలిగిన నాడు చరిత్రను సృష్టించగలడు! జాషువా చరిత్రను సృష్టించాడు. అతనిలో పెరిగి పెరిగి వృద్ధి చెందిన ధిక్కారం......

**"గవ్వకు సాటిరాని పలుగాకుల మూకలసూయి చేత న**
**నెవ్విధి దూరినన్ ననువరించిన శారదలేచిపోవునే**
**ఇవ్వసుధా స్థలిన్ పొడమరే రసలుబ్దులు? గంటమూనెదన్**
**రవ్వలు రాల్చెదన్, గరగరల్ సవరించెద నాంధ్ర వాణికిన్"**

వేయి శతఘ్నులు పేలిన శబ్దశక్తి వినవచ్చింది ఆ కవీశ్వరుని కలంనుండి

అప్పుడు సమాజం అతనికి నమస్కరించింది. నవయుగ కవి చక్రవర్తీ! అని పిలిచి సన్మానించింది.

"1914లో బెట్రాండ్ రస్సెల్ కొలంబియా విశ్వ విద్యాలయంలో ఉపన్యసిస్తూవుంటే – బక్కగా పలచగా పేలగా పాలిపోయి, ఎప్పుడైనా మరణించేట్టు కనబడ్డాడు. కానీ పదేళ్ళ తరువాత అదే వ్యక్తి 52 ఏళ్ళ వయస్సులో సంపూర్ణ ఆరోగ్యంలోనే కాక తుళ్ళుతూ, పేలుతూ, ఉరకలు వేస్తూ, తిరగబడే ఉత్సాహంతో ప్రత్యక్షం కావడం ఎంతో ఆనందాన్ని కలిగించింది. ఆ పదేళ్ళు ఎటువంటివి? అతని ఆశలు నేలపాలైనవి, స్నేహితులకు దూరం; ఒకప్పటి సుఖ మయ జీవితానికి దూరం అయినాడు – అయినా అతను నిరాశతో కృంగి, కృశించి పోక పోవడం ఆశ్చర్యం".

**– విల్ డ్యూరాంట్**

సాంసారిక జీవనయాత్ర గావించాలనుకునే ప్రతి వ్యక్తినీ ఆర్థిక ఇబ్బందులు పిరికి వానిగా, నీచునిగా, దొంగగా, బానిసగా మార్చివేస్తాయి. ఎంత శ్రమించినా ముప్పూటలా ఆకలి తీరని బ్రతుకులు, ఎంత రెక్కలు విరచుకున్నా శరీరం నిండా గుడ్డ కప్పుకోలేని లేమి.... ఎంత ప్రేమించినా బిడ్డల ఎదుగుదలకు అవసరమైన ఏర్పాట్లు చేయలేని తల్లితండ్రుల ఆశక్తత... ఇవన్నీ మనిషి అభివృద్ధికీ ప్రతిభా ఉత్పత్తికీ ఆరోహణకు అడ్డంకులు, తెగని బంధాలు.

ఆ రోజుల్లో నా భార్య, తల్లీ కూడా రోజు కూలీకి పోయినా గడవడం అంతంత మాత్రంగానే సాగింది. నేను తిరగని పల్లె లేదు ఏదైనా ఉద్యోగం కొరకు, నా కవితకు యింకా ఆర్థికాదరణ లభించలేదు.

ఈనాడు (1950) నా ఆర్థిక స్థితి చెప్పుకోదగినంత తృప్తిగా లేదు. నిత్యం రేపటికై ఆలోచనే. ఈ ఉదయం చిత్తు కాగితాలన్నీ అమ్మితే వచ్చిన రూపాయి పావలాతో యీ "నవయుగ చక్రవర్తి" తృప్తి చెందాడు.

జాషువాకేం యీ సన్మానాల వలన చాలా సంపాదించాడు అనుకునే బంధువులు, మిత్రులకు అసలు రహస్యం తెలియదు.

**"కలవారిచ్చిన పట్టు వస్త్రములతో గన్పట్టునన్ జూచి శ్రీ**

**గల వాడీత డటంచు నల్వురన, నా కర్ణించి, నా కన్న కొ**

**డ్కులు జుట్టాలును డబ్బు లేదనిన సంకోచింతు రీ నాటిక**

**న్యుల మాటేల? ప్రచార మందు ఋతమున్ శుద్ధానృతంబు య్యెడిన్**

చిత్రమేమంటే... ఇంతటి ఇబ్బందులున్నా... నా కవితా సంపద మాత్రం తరగలేదు. అది అక్షయమై నూతన భావాలతో సాగుతూనే వుంది. అంచేతనే అంటాను కవిత్వానికి, కళలకు ప్రతిభాపాటవాలకు దారిద్ర్యంకాని, అస్పృశ్యతగాని, కులంగాని, కారణం కాదు. అని సహజంగా జన్మతః లభించిన ప్రతిభలు, అంచేతనే దారిద్ర్యం వలన ప్రతిభ మరుగున పడుతుంది. అంతేకాని అణగారిపోదు. అవకాశం లభించగానే అది ప్రజ్వలిస్తుంది.

ఈ అసమానతలు యీ ఎగుడు దిగుడుల బ్రతుకుల గురించి నా ఆలోచనలు ఎప్పటికప్పుడు సాగుతూనే ఉన్నాయి.

అనాధ కావ్యం వ్రాసే రోజులలోనూ ఇలాగే ప్రశ్నించాలనుకున్నాను. ప్రశ్నించాను? నేనేకాదు ప్రతి ఒక్కరి తలలోనూ ప్రశ్న ఉదయించాలి.

**ఎవడా రగించు నమృత భోజనంబున**

**గలిసెనో ఈలేమ గంజి బువ్వ**

**ఎవరు వాసము సేయు శృంగార సౌధాన**

**మునిగెనో యిన్నారి పూరి గుడిసె**

**ఎవని దేహము మీది ధవళాంబరములలో**

**నొ దిగెనో యిన్నాతి ముదుక పంచె**

**ఎవడు దేహము సేర్చు మృదు తల్పము లోన**

**నక్కెనో యీ యమ్మ కుక్కిపడక**

**వసుధపై నున్న భోగ సర్వస్వమునకు**

**స్వామిత వహించి మనుజుండు ప్రభవ మందు**

**నెవడపహరించె నేమయ్యె నీమె సుఖము**

**కలుష మెరుగని దీని కొడుకులు సుఖము**

యీ నా ప్రశ్నలకు, జవాబు యింకా లభించలేదు.

ఆ రోజుల్లో టూరింగ్ సినిమాలు, మూకీ చిత్రాలను ప్రదర్శించేవారు.

గ్రామ గ్రామాన వినుకొండ వంటి చిన్న పట్టణాలలో డేరాలు వేసుకొని నడిపేవారు. అటువంటిదే మావూరి కొచ్చింది. ఆ సినిమాలో నన్ను కథావాచకునిగా తీసుకున్నారు. అవి మూగ చిత్రలుగనుక (శబ్ద రహితం) జరుగుతున్న కథకు అనుగుణంగా కథను పెద్దగా అరచి చెప్పాలి. ( ఆ రోజుల్లో మైక్‌లు లేవు గనుక) సినిమా టిక్కెట్లు ధర కూడా చాలా తక్కువ. కాణీలలోనే అదీ ఇవ్వ లేనివారు 5, 6 మానెకల సజ్జలో, జొన్నలో ఇచ్చేవారు.

ఆనాటి జనానికి వీధి నాటకాలు, తోలు బొమ్మలాట, డ్రామాలు, బుర్రకథలు, గొల్లసుద్దులు లాటివే సరదాలు. ఈ సినిమాలు వాటికన్నా మించినవి.

ఒకటి రెండు నెలలు వినుకొండలో ఆడి రాజమండ్రికి ఎత్తి పోయేప్పుడు వారునన్నే రమ్మన్నారు. నేను రాజమండ్రికి ప్రయాణమైన రోజున మా అమ్మ దుఃఖం అంతా యింతా కాదు. రైల్వే స్టేషన్‌లో ఆమె నన్ను విడవలేకపోయింది ! పిల్లగాడు అగంతానికి వెళ్తున్నాడని !

రాజమండ్రిలో దిగి సినిమా ఆడే స్థలానికి ఎద్దుబండీ అడిగాను. వాడు రెండు రూపాయలు అన్నాడు. చాలా దూరం అని. నేను సరే అన్నాను. నా వద్ద రెండే రూపాయలున్నాయి. వాడు రెండో మూడో సందులు తిప్పి తీసుకుపోయాడు. వాడు కావాలని తిప్పాడుగాని, సరాసరి వెళితే రెండు ఫర్లాంగుల దూరమే నా అమాయకత్వాన్ని వాడు బాగా ఉపయోగించుకున్నాడు.

ఆ రాజమండ్రి నా కండ్లకు మహా నగరంలాగున్నది. అక్కడా ఆనాడు అంటరానితనం తన్ని తరుముతూనే వుంది. నేను ఆ డేరాలోనే ఒక మూల బస ఏర్పరచుకున్నాను. మిత్రులు వారి పూటకూళ్ళ ఇంట భోజనం చేసి, నాకు పట్టుకు వచ్చేవారు. నా జీతం పదిహేను రూపాయలు పెంచినా, ఒక్క నెల కూడా జీతం ఇచ్చిన పాపాన పోలేదు మా అధిపతి.

మూడు జతల కొత్త బట్టలు కుట్టించుకొని వచ్చాను. అవి మాసిపోగా చాకలికి వేశాను. మూడు రోజుల తరువాత ఇస్త్రీ బట్టలకై వెళ్ళి అడిగితే "ఎవడవురా నువ్వ' బట్టలు ఎప్పుడు వేశావ్! ఏమైనా పిచ్చా"! అంటూ నిలువెత్తిన లేచిన ఆ ఖండిక రాక్షసి అమ్మను చూచి డేరాదాకా పరుగు తీసాను. మా మిత్రులు వెళ్లి అడిగారు... వారు నా కన్న మరింత వేగంగా డేరా చేరారు.

ఒక చొక్కా, ఒక్క పంచె మిగిలాయి, రెండవ ఆట సినిమా అయిపోయాక గోదావరికి పోయి బట్టలు ఉతికి ఆరవేసుకొని వచ్చేవాడిని. ఈ రకంగా నా జీతం ముఖం చూడలేదు. ఒకనాడు యజమాని వద్ద శెలవు తీసుకొని ఇంటికి పోయి వస్తానన్నాను.

నాకు ఒక చిన్న సంచీడు డబ్బులు (నాణేలు అప్పటిలో కాగితాల నోట్లు తక్కువ) అందించాడు. అమితానందంతో వాటిని లెక్కపెట్టుకున్నాను.

నలభై రూపాయలు !!

గౌతమీ కోటిలింగాల దాపులో ప్రాథమిక పాఠశాలలో పంతులు ఉద్యోగం దొరికింది. జీతం ఎనిమిదిన్నర రూపాయలు. ఇంటి అద్దె నెలకు అర్థరూపాయి. మిగిలిన సంభారాలన్నీ అందులోనే జరగాలి.

**ఇద్దరు సుతలుం గూరిమి**

**ముద్దియ మేరాంబతోడ ముట్టెడు జీతం**

**బద్దెకు, ముద్దకు చాకలి**

**పద్దుకు సరిపోక పెక్కు పొట్టంబడితిన్.**

అవి మొదటి ప్రపంచ యుద్ధపు రోజులు సైనికునిగా చేరితే నన్నా బ్రతుకు గడుస్తుందేమోనని 'రిక్రూటింగ్' ఆఫీస్‌కు పోయాను. 'యుద్ధం ఆగిపోయిందని' వార్త. ఆ వార్త నాకానందాన్ని కలిగించక పోగా నిరాశను కలిగించి 'ఇది నా గ్రహచారం' అనుకున్నాను. ఇది ఆనాటి జీవనం నా కష్టాలు తీరవు!

ఆ సమయంలోనే తోలేటి సుబ్బారావు అనే డ్రామా నటునితో పరిచయం లభించింది. నా కష్టాలు చూచి జాలి పడి ఏదీ ఒక పద్యం చెప్పు వింటాను. అప్పుడే నేనా పద్యం వినిపించాను. వహవా! జాషువా మొనగాడవోయి, అపూర్వమైన కమ్మని పాకము, నుడి కారమునకు గుడికట్టితివి?"

ఆనాటి భాగ్య సంపన్నులు నాటక కళాపోషకులు అయిన గున్నేశ్వరరావు గారికి పరిచయం చేశాడు మిత్రుడు

**"ఊరేది? పేరేమి? కృతుల్**

**కూరుతువా? భేషు భేషు! గురు వెవ్వరు ? మా**

**ధరణీసురులు సనాతను**

**లేరీతి సహింత్రు బ్రాహ్మణేతరప్రతిభల్**

కుడ్యం పైనున్న చిత్రంపై అశువుగా పద్యాలు చదవగా మహదానందంతో నన్నభినందించి "మా చింతామణి నాట్య మండలికి నాటకాలు రచింపుము కవీంద్రా? అంటూ రెండు వందల రూపాయలు నా చేతనిడి... నన్ను ఆశ్చర్యానందాబ్ధింలో ముంచినాడు.

వేయి ఏనుగుల శక్తి నన్నావహించింది. మహాగౌతమి తటిన హాయిగా నొకపులిన సీమ నాసీనుండనై "రుక్మిణీ కళ్యాణం" పూర్తిచేశాను.

ఒడిదుడుగులు తగ్గి సంసారం సాఫీగా సాగుతూనే వున్నది.

తెలుగు భాష కన్య సర్వాలంకార భూషితమైన పట్టణం ఆ రాజ మహేంద్రవరం. ఆనాడెంత కీర్తిగన్నదో యీనాడు సంస్కర్త కందుకూరి వీరేశలింగం గారు, మహా గ్రంథ రచయిత చిలకమర్తి మహామహులున్న నగరం. వారి దర్శినాభిలాష నన్ను నిత్యం వెంటాడుతూ వుండేది.

తన మేథస్సును దేహ దారుఢ్యమును సమస్తంబున్ సాంఘిక విప్లవానికి అర్పించిన మహానీయుడు వీరేశ కవీశుని దర్శనం చేసుకున్నాను. వారి కోరికపై 'రుక్మిణీ కళ్యాణం" లోని పద్యాలు చదవగా 'బాగు' 'బాగు' కవీ. నీకు ఉజ్వల భవిష్యతున్నది. కుల భేద శాకినుల్ మెదలెడు దేశమిది... నిను మెచ్చదు. అది మెచ్చినను మెచ్చుకున్నను. – నీ కవితా పరిశ్రమ సాగించు – "అని నన్ను అభినందించి ప్రోత్సహించె ఆ సంస్కర్త. నా మనస్సు ఉప్పొంగి పోయింది.

మరొకనాడు చిలకమర్తిని చూడ బోయితిని 'కన్నులు లేక కండగల కమ్మని కావ్యము లల్లి భాషకున్ కున్నల్ వొసంగి నట్టి 'నారసింహుని వీధి గుమ్మంలో అడుగుపెట్టానో లేదో 'రండు రండు అని పిలిచే, చక్షు లేటికి విజ్ఞాన చక్షువులకు" వారడిగిన మీదట మా వినుకొండలో ఒకనాడు కవితా స్పందనచే నేను రచించిన పద్యం చదివాను.

వినుకొండలో మత విద్వేషముతో ఏనుగు దంతాలతో చితక పొడిచిన ఒక జీర్ణ దేవాలయం ముంగిట ఒకనాడు ఆ గుండురాయిపై కూర్చుండి నేను.

**"జారిన కాల ధ్వని కాలద్వాంతాంతరాళగతప్ప**
**త్తాంత విచారంబు మదిని తళు కొత్తగా...**
**"ఏరాజన్యుని పాలనంబునను నీ కీదివ్యదేవాలయ**
**ప్రారజ్యప్రతిరూప మబ్బినది మీయానాటిపూజాపున**
**స్కారాచారము లేమి? భూమిజ సమాచారంబు రాముం డిటన్**
**బ్రారంభంబున విన్నవా దట నిజంబా ? వృద్ధపాషాణమా!"**

ఆ నరసింహ విబుధుని వదనంబుఒకనవ్వు వెలిగి సంతోషంబున నన్ను కౌగిట చేర్చుకొని ఆశీర్వదించినాడు. కళ మరింత బలం పుంజుకొన్నది. ధృతి వహించి ఐదు మాసాలలో 'మదాలస' నాటకం పూర్తి చేశాను.

నాయీ కవితా యజ్ఞం....."ఒకడు ప్రోత్సహింప, నొక్కడు నిరసింప, ఒకడు చేర బిలువ, నొకడు తరుమ మిట్ట పల్లములను మెట్టుచు నెట్టులో పలుకులమ్మ సేవ సలిపినాడ"

ఆ రోజుల్లోనే గోదావరి పుష్కర ఉత్సవాలు జరిగినాయి. భక్తులు అర్పించే భక్తి తత్పరతను చూచే అవకాశం కలిగింది. ఆ పుష్కరాలపై ప్రచారమొందిన పుక్కిటి కథలు, మూఢ నమ్మకాలు విన్నాను. ఒకనదికి యీ విధంగా అర్చనా విధులు సలుపుట మేలా? ఏమిటా మేలు? ఏమి శుభములు? మేధస్సు పెరుగుతుందా? లక్షల సంఖ్యలో భక్తులు కాన్కలు డబ్బు ఆ లోతులకు వెదజల్లడం జబ్బో లేక ఆరోగ్యమో ! నాకు అర్థం కాలేదు.

ఆ అఖండ గౌతమీ గర్భంలోనికి భక్త కోటి విసిరే "డబ్బు" నా కన్నుల నీరు నిండించినది. .. ఆవేపుననే తిండి చాలీ చాలని బక్క చిక్కిన పేదలు... రోగాలతో రోష్టులతో దిక్కులేని దీనులు భిక్షార్తులకు కొబ్బరి ముక్కలు విసిరి కొడుతూ చీదరించుకుంటూ... నడిచే భక్తులు... ఇది చూచి నా కన్నులు చెమ్మగిల్లినవి –

**అన్నమో దైవ మాయని అహర్నిశల్ దురపిల్లు పేదకున్**

**కన్నులు చెమ్మగిల్ల చిరకాలము నీ పరమార్థము యిష్ట మృ**

**ష్టాన్నముగా భుజింప మని ఆకలి దీర్పగా జూతువేల ఆ**

**పన్నులకే మేలు ధనవంతుల మేలుకే మంత్ర తంత్రముల్ –**

దొంగనోట్లు అచ్చు వేసిన నేరంపై గున్నేశ్వరరావు అరెస్టు, నాటకం మూత జరిగిపోయినవి.

నటులు, రచయితలకు మరల సంకటి కరువైంది. మరలా బడిపంతులునై ఆదాయము లేక కటకటలు.

అనుకోని విధంగా గుంటూరు టీచర్ ట్రైనింగ్ విద్యాలయంలో తెలుగు పండితునికిగా ఉద్యోగం లభించింది. అది మెకాల్ అనే దొరసాని నడుపుతున్నది. ఆమె పంతుళ్ళమీద ఊరక గంతులు పెట్టుచున్నది. చిన్న కారణములపై పెద్దింతలుగా తలచి నెలకొక పంతులపని ఊడగొట్టి పంపును.

రెండుసార్లు నాకూ అదే గతి పట్టబోయి ఆగింది. ఎందుకోమరి.

డి.ఇ.ఓ. తనికీకి వస్తున్నాడు. ఇస్త్రీ చేసిన బట్టలు ఇయ్యగలవా అని మా పక్కింటి రైల్వే టిక్కెట్ కలెక్టరును అడగగా అతను నల్లని సూటు, అంతకంటే నల్లని టై, యీ డ్రస్సు వేసుకో పక్కా దొరలా వుంటారన్నాడు.

డి.ఇ.ఓ. తెలుగు పండుతుడెక్కడ? అని నన్ను చూచి ఆశ్చర్యపడి "ఇతడా ఆంధ్ర పండితుడు"? అని ఆశ్చర్యపోయాడు.

"గుండు, గుండు మీద పిలక, కుండలమ్ముల జోడు పండుతులకు సహజ అలంకారాలు. పైన ఇంగిలీసులోలోన ఆంధ్రమా?

అప్పుడే 'భారతి' మాసపత్రికలో నా కవిత "కర్ణ" పద్యాలు ప్రచురింపబడి "నీ పద్యములు ఇంపుగనున్నాయి. పాతికి రూపాయలు విరాళం" పంపారు. అది నా ఉత్సాహాన్ని ఆకాశాని కెత్తించింది.

ఉభయ భాషా ప్రవీణులు ఎందరో ఉండగా యోగ్యత లేని నాకు బాపట్ల ఉన్నత పాఠశాలలో ఉద్యోగాలు ఇప్పించినారు. ఆనాటి జల్లా బోర్డు అధ్యక్షులు.

ఆ తరువాత, ఫిరదౌసి, స్వప్నకథ రచించినాను.

పిఠాపురం రాజావారిని దర్శించి నిరాశ పొంది వచ్చాను.

ఒక రాజన్యుని దర్శనార్థం యెన్నో యత్నాలు చేసి నూరు రూపాయలు పైన ఖర్చుపెట్టుకొనగా, ఒక యేగాని కూడా లభించలేదు. అటు తరువాత లెక్కకు మించిన ఓదార్పు వాక్యాలు, ఆయన పంపగా ఇప్పటికీ పెట్టెల నిండా నిండి మూల్గుతున్నవి.

మరోవేపు నా కృతులు రసజ్ఞుల, కవుల ప్రశంసలనందుకొంటూ సన్మానాలనందు కొంటూ వస్తున్నాయి పట్టణాలలో, గ్రామాలలో.

నెల్లుట్ల కవి తన రచన 'సురబాల' నా కంకితం యిస్తూ –

**వతులు సహోదరా! నిను మనంబున జూచితి నీ కృతుల్ సమం**

**చిత రసికోత్త మభ్రమర సేవిత మంజుల పుష్ప మంజరీ**

**తతులు సమార్చయే తెలుగు తల్లికి, బేషర ! జాషువా, సువా**

**సిత సకలాంధ్ర భూవలయ సిద్ధ కవిత్వ వసంత వైభవా!**

నా జన్మభూమి వినుకొండలో నాకు ప్రప్రధమ భూరి సన్మానం నాకెంతో ఆనందాన్ని తెచ్చింది.

ఆ సన్మానంలో అందుకొన్న నూట పదహార్ల రూపాయలు మా అమ్మచేతిలో పోసినప్పుడు ఆమె నను ముద్దాడి ఆశీర్వదించడం, నేను పులకరించిపోయి "నను కన్నందుకు నీకు నేను తీర్చుకున్న ఋణం అమ్మా" అంటూ ఆమెను కౌగిలించుకున్నాను.

ఆ సభలో

**కవితోద్యాన వసంత కోకిలవు! త్వత్కంఠ స్వరోద్యన్మహా**

**నవ మింతే చవి జూచినన్ ద్విజతతుల్ సన్మార్గమున్ ద్రొక్కి మా**

**ధవ సేవా పరతంత్రతన్ నవ రసోన్మాదంబునన్ నీదు చెం**

**త వసంతోత్సవ మాచరించుటొక వింతా? జాషువా సత్కవీ!**

అంటూ నన్ను గౌరవించినారు.

శ్రీ ఏకాందండయ్యల పంతులుగారి పరిచయం నాకు మరింత బలాన్నిచ్చింది.

ఆయన కవితా పోషకుడు కాదు. కానీ నా కవిత్వం ఆయన్ను బహు ఆనందపరిచిందని అంటూ నన్ను తన యింటికి ఆహ్వానించి "ఆ రహస్యదాత"గా ప్రసిద్ధి చెందిన పంతులుగారు.

**"రైలు ఖర్చులకిద్ది రిక్షాలకిద్ది**

**ఆకు బీడీల కిది తిండి కగున దిద్ది**

**మొత్త మగు మూడు రూకల మూడణాలు**

**మొదట 'కొమ్మ'ని నా హస్తమున నొసంగె"**

"అసలు కవిత్వం, రసమన్నవి నాకు తెలియవయ్య కవిత్వం వ్రాయడంలో నీవు దిట్టవని విన్నాను. అంచేత చేయగల మేలు చేస్తాను".

ఆ మేలు.. రెండు ఖండకావ్యము సంపుటల అచ్చు ఖర్చులు ఆయన ఇచ్చారు.

ఆయన వీలునామాలో జాషువా గ్రంథాలు పున ర్ముద్రణ ఉచితమని తలంచితే అచ్చు వేయవచ్చును అన్నారట. వారసులకు "ఉచితమని తోచలేదు" అంచేత అచ్చు వేయించలేదు.

**ఈదితివాఙ్మయాంబునిధి ఏబది యేడులు సర్వ పండితా**

**మోదముగా రచించితిని ముప్పది కావ్యము లిట్టినీవు ని**

**ర్వేదము గల్గు ధిఃకృతిలభించెడు దేశములోన నీకు నా**

**కేది శరణ్య మంచు తల యెత్తక చింతిలె కావ్య కామినుల్**

వెంటకగిరి మహా రాజ ప్రసాదం నుండి ఆహ్వానం రాగా కొండంత ఆశతో బయలుదేరి వెళ్ళాను.

నా కృతులను సమాదరించి పద్య పఠనాన్ని ఆనందించిన రాజా వారు తీయగా మాట్లాడి నవ్వించి మెల్లగా సాగనంపుతూ వుంటే నేను మనస్సులో ఉవ్విళూరుతున్నాను. మాంచి బహుమానం అందిస్తారని... ఒక బస్తాడు అభినందనలు, మునిగిపోయేటన్ని ఆశీర్వచనాలు అందజేసి పంపారు.

కొండంత ఆశ గబాల్న కూలిపోయింది. యావశ్చరీరం చచ్చుపడి, అన్ని అంగాలు నిండిపోయింది. ఉప్పొంగుతున్న విచారంతో నిందా గర్భితంగా కొన్ని పద్యాలు వ్రాసి భారతికి పంపాను.

**"ఈ కవిగాని జీవిత మదిట్టుల గష్ట సుఖాల మధ్యబిం**

**దీకృతమై నశింపవలెనే? నరనాథ 'తెలుంగు వాణికిన్'**

**జాకిరి చేయసాగి కడచన్నవి పాతిక వత్సరాలు; నా**

**యాకటిపాట మాన్పిన మహాత్ములులేరు? రసజ్ఞ శేఖరా !**

కాలం గడిచే కొలది నా కృతులకు చతుర్దిశలలో అభినందన పరంపర నూట పదహార్లు, వెయ్యి న్నూట పదహార్ల డబ్బుతో సన్మానాలు అందుతూ వున్నాయి. ఊరూరా సభలు, సన్మానాలు జరుగుతున్నాయి.

జయపురాధీశ్వరుడు అఖిల శాస్త్ర ప్రవీణుడు, విక్రమ దేవ వర్మ, భారత వర్ణ సంస్థ ఉత్సవానికి ఆహ్వానం పంపెను.

ఈ సభ దిగ్విజయంగా జరిగింది. "కవితా విశారద" బిరుదంతో వెయ్యిన్నూట పదహార్లతో నన్ను సన్మానించారు.

ఉబుసుపోక భావాలతో, ఉత్తుత్తి ప్రయత్నాలతో యీ సమాజ భావ పునర్నిర్మాణం రాదుగాక రాదు. ఒక గట్టి దీక్షాబద్ధమైన ఆచరణ అన్నిరంగాలలో కావాలి, రావాలి –

**సమరసభావ నిశ్చల పరిశ్రమకు బ్ర**

**హ్మాండంబు లున్ముఖంబయినదాక**

**వ్యత్యయంబైన తీవ్రాస్పృశ్యతాజాడ్య**

**మన్ని విధాల రూపటినదాక,**

**నాజాతి నాయూరు నాదేశమని పొంగు**

**స్వాభిమానము శూన్యమయినదాక,**

**విశ్వసౌభ్రాత్రంబు వెలయించు నైక్యసం**

**ఘవ్యాప్తిదిశల పెంపారుదాక,**

**జ్ఞానమత సాంఘిక స్వేచ్ఛ నల్వురకును**

**నేకరీతి లాభించునందాక, రాదు**

**భావిభారత కల్యాణ పరమ సుఖము!**

**కాక చల్లార దెపుడు సంగ్రామమఖము**

జ్ఞాన స్వేచ్ఛ, మతస్వేచ్ఛ, సాంఘిక స్వేచ్ఛ అందరికీ సమానంగా అందకపోతే, విప్లవం తప్పదు. అయితే నేను కోరుకొనేది శాంతియుత విప్లవం.

గుళ్ళు, గోపురాలకు చందాలెత్తి పొట్ట పోసుకొనుటపుణ్యమా? అన్నమునకు, నీటికి అంటు జాడ్యం అనే చుప్పనాతి మతం ఎలా గొప్పది అవుతుంది? ఈ కుల మతాలను ఈశ్వరుడు సృష్టించలేదు. హిందూ మతమే ఈ గజిబిజికి కారణం. జాషువా ఆలోచనలు మానవతా మార్గాన యిలా సాగుతూ వున్నాయి.

బహు దేశాల మత మహా పరిషత్తుకు, ఆహ్వానింపబడి వారిని మెప్పించి వచ్చినది. మా భరతసుతుడు. కండె బొట్టుతో అయిదు ఖండాలను ఓడించి కొలువు లందుకొన్నది మా గుజరాతు ముసలివాడు. సీమలో ఆచార్య పీఠాన్ని అలంకరించిన వాడు మా తెలుగువాడు. నోబెల్ కీర్తిని సంపాదించినవాడు మా వంగసుకవి. చెట్టు చేమల సుఖ దుఃఖ జీవితముల నిజము నిరూపించినవాడు మానేలవాడు... మరి యెందకో? నన్ను తొలగించి లెక్కించినారు. మేమంతా అన్నదమ్ములం. నా యీ భావం మరింత, మరింత పదునెక్కుతున్నది. నా కవితా ఆయుధం అన్యాయాలపై అస్తవ్యస్త సమాజంపై, పక్షపాత నీతులపై కఠినంగా, తీవ్రంగా విరుచుకుపడుతూనే వుంది.

**అంగనామణుల దాస్యక్రూర బంధముల్**<br>
**చిక్కముల్ చేయార ప్రక్క లించి**<br>
**అంటరానితనంపు టడుసులో దిగబడ్డ**<br>
**మనుజుల దుఃఖంబు నపనయించి**<br>
**నవ్య భారత సుధా నగరంబులో జిచ్చు**<br>
**దరి కొల్పు ప్రజల శత్రువుల నణచి**<br>
**ప్రేమ సంగతమైన విద్యార్థి జగమున**<br>
**నగ్న భావావేశ నదులు మలిపి**<br>
**సౌఖ్య సౌరభంబు సర్వభూములు నిండ**<br>
**పాడుకొందు; దిశల నాడుకొందు;**<br>
**నిఖిల భువనమెట్లు నిర్ణయించిన, నాకు**<br>
**తరుగులేదు; విశ్వనరుడ నేను !**

జాషువా కవితా కన్య ప్రౌఢమైగంభీర నడక నందుకుంటూ, నూతన భావ చైతన్యమై నిలచింది.

కవి ఆలోచనలు చాట్రగడ్డ పాడు పొలిమేరలు దాటి వినుకొండ పట్టణ హద్దులు వదలి... రాష్ట్ర సరిహద్దులు తరించి... ప్రపంచ పుటంచులు తాకింది.

తాను ఒక కులానికి, ఒక మతానికి చెందిన వాడననుకున్ననాడు ఆయన ఆలోచనలు చిన్నగిరితో బంధింపబడి వున్నాయి. ఆ గిరిని దాటి వచ్చే ధైర్యం చాలక, సమాజానికి భయపడిన తనలోని భావాలకు సంకెళ్ళు వేసుకున్నాడు.

ఆ గిరిని తెంచుకొని బయట అడుగుపెట్టి "మడమ దిప్పని ఆంధ్రుడను' అని కాక "విహరింపనే భీతి విడిచి మస్తమునెత్తి సకల సామ్రాణ్మహో సభలోన వ్రాక్రుచ్చనేరాలు వగలు బుగ్గలు చిమ్మనతనిశాత ప్రబంధాధికముల పగర గర్భకుహరిసారి గావిస్తాను కొండలన్నీ పిండి కొడతాను, అంటూ రొమ్ము విరచి చెప్పుకొన్నాడు... ఇక ఆనాటి నుండి అతడు మడమదిప్పని సాంఘిక దురాచార ఖిండించిన కవిగా సాంఘిక సమర సేనానిగా నిలబడినాడు.. కవితా  శంఖాన్ని ఉచ్చై స్వరాన పూరించినాడు.

నీదే కులం?

నేను విశ్వ మానవుణ్ణి; ఈ జవాడు వేయి ఏనుగుల శక్తిని పూరించుకొని వచ్చేది. అది హృదయాంతరంతరా లనూతన మానవుని కంఠధ్వని అది.

ఆయన ఆత్మ గౌరవం పెరిగింది. న్యూన తాఖావతమస్సు యీ నూతన వెలుగుతో పటాపంచలైపోయింది. ఆత్మ విశ్వాసంబల పడింది.

మనిషి జన్మతః స్వేచ్ఛా ప్రియుడు. ఆ స్వేచ్ఛను సంఘ ఆచారం బంధించినప్పుడు ఆర్థికంగా బలహీనుడై నిత్య జీవితం సాగడమే కష్టభూయిష్టమై నిలబడి నప్పుడు..సమాజంలో తానొక అల్పజీవి, అసమర్థుడు అనుకొన్ననాడు.... అతనిలో నిరాశ, నిస్పృహ బలంగా పెరిగి మనిషి నిర్వీర్యుడౌతాడు. అటువంటి వ్యక్తి అనామకుడై మరణిస్తాడు. అతని గురించి ఎవరూ తలంచరు ఆనాటి ఏలియా లాగా.

ఆంగ్ల కవి థామస్ గ్రే అంటాడు – ఏలియా వంటి కళాకారుల గురించే.

**Full Many a Gem of purest Ray Serene**

**The dark unfathomed caves of the ocean bear**

**Full many a flower is born to blush unseen**

**And waste its sweetness on the desert air"**

జాషువా పెరిగిన సాంఘిక ఆర్థిక పరిస్థితి పూర్తిగా ఇటువంటిదే. జాషువా కూడా కర్మ సిద్ధాంతాన్ని నమ్మి కర్మ సిద్ధాంతమున నోరు నొక్కి వేసినారని వ్రాసుకున్నవాడే – నిరాశతో

"ఎంత కోయిలపాట వృధాయయ్యెనో కదా చిక్క చీకటి వనసీమలందు" అని వ్రాసుకున్నవాడే... బాధతో...

కానీ యిక్కడ జాషువా ప్రత్యేకత.... ఈ నిరాశను తెంచుకొని, తనంతతాను యీ అడ్డంకులను పడగొట్టుకుని, ఆ సంకుల సమరం జయించి ధీరోదాత్తునిగా, విశ్వనరునిగా నిలబడుట జాషువా సాధించి గెలిచిన జీవనసత్యం – ప్రతి వ్యక్తి అననకూల పరిస్థితులను దాటి రావలెను. మనిషిగా నిలదొక్కుకోవాలి. జాషువా కవిగా గెల్చి కనకాభిషిక్తుడైనాడు.

ఏ సమాజం తనను అస్పృశ్యునిగా వుంచిందో, ఆ సమాజమే అతని ఎడమకాలుపట్టి బంగారుగండ పెండెరంధరింప జేసింది. ఏ సమాజం అతన్ని తరిస్కరించిందో.. ఆ సంఘమే అతనిని 'మనసారా' ఆహ్వానించి, గౌరవించి, ఆ తలపై 'కనకాభిషేకం' చేసి నమస్కరించింది.

కవిగా అతడు నవయుగ చక్రవర్తి, వ్యక్తిగా అతడు విశ్వనరుడు. తిరస్కరించిన సమాజాన్ని ధిక్కరించిన సాహితీ సమరయోధుడు.

సమరయోధుడై కవితాయుధాన్ని చేపట్టి సామాజిక దురాచారాలను ఖండిస్తూ కవిత్వం నా 'ఆయుధం' అని ప్రకటించుకున్నారు కానీ అతని యుద్ధం వ్యక్తిపై కాదు.)

అతని ఆయుద్ధం వ్యవస్థపై –

**ఆడిన మాట తప్పను, మహాత్ముని చెప్పుల జాడలోన కా**
**లాడ చరించెదన్, ప్రజల కన్నము బెట్టెద, వర్ణ భేదపుం**
**జీడ నణంచెదన్, గటికిచీకటి వాపెద, వెట్టి నమ్మకా**
**లూడని బాడ హస్తమున నూనెద శాత కళాకుఠారమున్**

* * *

# తిరస్కరించిన సమాజం సత్కరించింది

**విహరింపనే భీతి విడచి మస్తము నెత్తి**
**సకల సామ్రాణ్మహా సభలోన**
**వాక్రుచ్చనే రాలు వగలి బుగ్గలు జిమ్మ**
**నతి నిశాత ప్రబంధాదిక ములు**
**కల్పింపనే తెల్గు కళ్యాణి కొప్పున**
**సొగసైన కీరితి పొగడ దండ**
**ఎత్తింపనే మేటి హిమద్గిరుల మీద**
**శాశ్వత విజయ రాష్ట్ర ధ్వజంబు.**
**పగర గర్భ కుహరి స్వారిగా వింపనే**
**యింటి గుట్టు బయటి కెక్కకున్న**
**సమ్మతించి జాతి కుమ్మక్కుగా నున్న**
**కొండలన్ని పిండి గొట్టనొక్క.**

“ఓ మహీపతీ! అత్యంత మనోహరమైన భావనాకాశాన అలుపు లేక కవితాగానం చేశాను. శిరీష పుష్ప కేసరముల మృదుత్వాన్ని మించిన మృదువైన శైలి నడిపాను. నూతన భావాలు చింతన చేసి, పాత భావాలకు వీడ్కోలు చెప్పాను.

ఓ! రాజేంద్రా! నా గ్రంథాలు అచ్చుకు నోచుకోలేక, తెర చాటుననే కన్నీరు నింపుతున్నాయి. పేద కవిని ఏమి చేయగలను? నన్ను ఆదుకొనే రాజేంద్రుడేడి? అంతటి దాన వీరుడు కూడ కుల పరీక్ష ముందు ఏమాయెను?

మీ దర్శనార్థం వస్తూ వున్న నాకు ఒక అవమానం ఎదురైంది. చెప్పుటకు సిగ్గిలు తున్నాను. అయినా చెప్పక తప్పదు. ఎంచేత నంటే – యీ సమాజం “కళకు కాక

కులానికి, ప్రతిభకు కాక మతానికి ప్రాధాన్యతను" యిస్తున్నది. ఈ కుల పరీక్షలలో ఎంత కళ! ఎంత ప్రతిభ వ్యర్థమైపోయాయన్నదే తెలియపరచుటకే!

తోటి ప్రయాణీకుడు నన్ను పలకరించి, సంభాషణ సాగించి, నేను కవినని, తెలుసుకొని ఉత్సాహంతో కవితాగానం వినిపించమని కోరినాడు. అతి ఉత్సాహంతో పద్య పఠనం చేశాను. అతడు "భేష్! భేష్! భళీ, భళీ నీ కవిత మధురం. నీ గానం శ్రవణపేయం' అంటూ నన్ను, నా కవితా కన్యను ప్రశంసల ఆభరణాల అలంకరించి, వెంటనే "మీదే కులం" అని ప్రశ్నించినాడు. నా జవాబు విని "ఛీ" వాణి అంటు వడినది. అంటూ చివుక్కున లేచి దూరంగా పోయినాడు. మహీశ! ఏమి చెప్పను. బాకుతో పొడిచి నంత బాధతో విల విలలాడినాను" ఇది ఒక వేపు.

మరోవేపు నిష్కల్మష ప్రశంస – రచయిత, కవి, చిలకమర్తి నరసింహం సంభాషించి నా కవిత వినిపించగా

**"తలపంకించుచు మేలు మేలనుచు ఉత్సాహంబు, కల్పించున**

**య్యల ఛీస్వాంతునకు అస్మకృతులు ఆయా ఘట్టముల్ నిర్భజియం**

**బలరారన్ వినిపింపగా అలరి నేత్రాబ్జంబులన్ నమ్మదాశ్రులు**

**వర్షించి వచించె ధన్యుడవునటంచు పూర్ణ వాత్సల్యతన్!**

**నేను అమితానంద భరితుడనైనాను. గాయాల బాధలను మరచి,**

మరొకసారి మహా సంస్కర్త కవి, రచయిత, నాటక కర్త – వీరేశలింగం పంతులును చూచితిని.

నా పరిచయం విని "ఆదరంగా ఆహ్వానించి, పడకపై లేచి, రమ్ము కూర్చుండు" మని పిలిచే. నా కవనం విని.

**"చదివిన పద్యములు విని ప్రసన్న మృదూక్తుల మేల్ మేల్ మహా**

**భ్యుదయము ముందు ముందు కలదోయి కవీ కుల భేద శాకినుల్**

**మెదలెడు దేశ మిద్ది నిను మెచ్చడు, మెచ్చిన మెచ్చుకున్న శా**

**రద నిను మెచ్చె! మానకుము ప్రాప్తి కవిత్వ పరిశ్రమంబులన్"**

ఒకడు ప్రోత్సహింప, ఒకడు నిరసింప, ఒకడు చేర బిలువ మరొకరు తరుమ... ఎన్నో మిట్ట పల్లాలను నెట్టుకుంటూ యాభై ఏండ్లు శారదాంబ సేవ చేసినాను.

**"నలత్రాచుల్ బలె వర్ణ భేదములు నాల్కల్ సాచు కాలంబునన్**

**నలచెన్ నన్ను కవిత్వ వాణి, పసరుం ప్రాయం బునన్ వెట్టి బా**

**గులదై, పాపల్ గలదై చరించెడిని రాష్ట్ర ఖ్యాతి నార్జించుచున్**

నా కలం ఏనాడూ ఆగిపోలేదు. నిరాశా, నిస్ప్రహలను నా దరికి చేరనీయ లేదు. నా కలానికి విశ్రాంతినీ ఇవ్వలేదు. నేను, నాటకాలు, కథలు, కావ్యాలు నా కలం నుండి జాలువారుతూనే వున్నాయి.

"మనం శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా మనల్ని ఆవహించిన సమస్త బలహీనతలను వదిలించుకోవాలి. బలహీనత మృత్యువు లాంటిది. మనిషి బలంగా, నిర్భయంగా వుండాలి. మన దేశానికి ఇపుడు కావలసింది ఇనుప కండరాలు, ఉక్కు నరాలు! దేనికీ లొంగని అచంచల సంకల్ప బలం కావాలి. అవసరమైతే సముద్రం అట్టడుగుకు పోయి మృత్యు ముఖంలోకి చూడగల నిర్భయత్వం కావాలి"

**– స్వామి వివేకానంద**

ఈ నిర్భయత్వమే నాలో నాటుకొని, నాకు బలాన్ని కూర్చింది. నాయీ అచంచల సంకల్ప బలం, నన్ను కవిగా విశ్వ మానవునిగా మలచిందేమో!

నడుస్తున్న రోజులు అంటరానితనం సిగ్గుపడుతున్న తరుణం! ప్రతిభకే పట్టం, అనే న్యాయ గంట వినిపిస్తున్న కాలం.

'కవి కోకిల' అని పిల్చారు రసజ్ఞులు 'కవితా విశారద' అన్నారు రసలుబ్దులు.

మధుర శ్రీనాథ అని పొగిడినారు అభిమానులు. "నవయుగ కవి చక్రవర్తి" ని చేసి కవితా సింహాసనం అధిష్టింప చేశారు.

"మా జాషువా" అంటూ ఆత్మీయత ప్రదర్శించుకొన్నారు.

అది 1945 ఇంకా స్వేచ్ఛా వాయువులు ప్రసరించలేదు. స్వేచ్ఛకై తహతహ నూతన భావ ప్రచార సంరంభం, సంస్కరణలకై ఎదురు చూపు

**"క్షణము గడిచిన దాని వెన్కకు మరల్చ**

**సాధ్యమే మానవునకు ఇలా చక్రమందు**

**దాటి పోయిన యుగ యుగములనాటి చరిత**

**మరల పుట్టింప కవి సమర్థడ గును.**

"అలనాడు అల్లసాని పెద్దన పాడారు. శ్రీ కృష్ణ దేవరాయలు గండ పేండేరం తొడిగినాడు

**యీనాడు ప్రప్రథమంగా "జాషువా" కు యీ సన్మానం ఆంధ్రాన.**

**"ఈ కాలికి గండపెండేరం వేస్తా"** (అత్తోటి రత్నకవి ప్రత్యక్ష కథనం)

అన్నిటికంటె ఘనమైన సన్మానం బెజవాడలో జరిగింది. అదో అపూర్వమైన చరిత్రాత్మకమైన సంఘటన. కవితాలోకానికే గాక యావత్ జాతికి గర్వకారణమైన కన్నుల పండుగ. బెజవాడ నివాసి, కోటీశ్వరుడైన బంకారాములుగారికి హరికథలంటే చాలా ఇష్టం. హరికథకులను రావించి వారి ద్వారా కథలు చెప్పించి ఘనంగా సన్మానించే వారు. వారు నా పేరు (రత్నకవి) విని నన్ను పిలిపించి, కథ చెప్పించుకొని, ఆనందించి గౌరవించారు. ఈ పరిచయంలో నేను జాషువా గురించి చెప్పాను. కొన్ని పద్యాలు వినిపించాను. హర్షించారు. వారిని తీసుకొని రమ్మన్నారు. మరునాడు జాషువా గారిని లాగుడు రిక్షాలో బంకా రాములు (నగరాలు) గారి ఇంటికి తీసుకొని వెళ్ళాను. జాషువా గారు వచ్చిన సంగతి ఆ బజారులో కొందరు విని వచ్చారు. జాషువాగారు పద్యాలు చదివారు. రాములుగారు పరమానందమునొంది నాల్గుబండ్లు తెప్పించి అందరినీ ఆ బండ్లల ఎక్కించి పూర్ణానందపేటలో వారి వ్యాపారపు గది కడదింపించినారు. అక్కడ మరికొందరు వచ్చి జాషువాగారి 'స్మశానవాటిక' పద్యాలు విన్నారు. దానితో రాములు గారు బహుగా ఆనందించి 'ఈ కాలికి గండపెండేరం' వేస్తానని మోకాలు కట్టారు. అప్పటికప్పుడే ఇందు నిమిత్తమై ఒక కమిటీని నిర్ణయించారు. పట్నంలోని 15 మంది పెద్దలు, ప్రముఖులు, ముగ్గురు జమిందార్లతో కమిటీ ఏర్పరిచారు. వీరంతా జాషువా కవిత్వం చదివి హర్షించినవారే.

వీరందరూ చల్లపల్లి రాజాగారిని 'జాషువాగారి నూరేగించటానికి ఏనుగును పంపించ వలసినదిగా' కోరగా వారు అంగీకరించారు. రాములుగారు 10 నవర్సుల బంగారాన్ని గండపెండేరం చేయించేందుకు తెచ్చేరు. మరునాడే నాయకులంతా కంసాలి వారింటికెళ్ళి గండపెండేరం చేయమని కోరి పది నవర్సుల బంగారం ఇచ్చినారు. ఈ తీర్మానాలన్నీ 1946 సంవత్సరం డిసెంబరులో జరిగినవి. 1947 సంవత్సరం జనవరిలో కార్యక్రమం ప్రారంభించారు. కార్యక్రమానికి బెజవాడ మున్సిపల్ హైస్కూలును సభాప్రాంగణంగా నిర్ణయించారు.

సన్మాన కార్యక్రమానికి జాషువాగారి తండ్రి, బంధువులు అందరూ ఆహ్వానించబడ్డారు. మొదటిరోజు సభ ప్రారంభమైంది. ఉదయం సభకు నూజివీడు జమిందారు అధ్యక్షత వహించారు. ఒక పాటకుడు ముందుగా ప్రార్థనా పద్యములు పాడినాడు. మరికొందరు లేచి జాషువా గారు రచించిన పద్యములు పాడి సభను రంజింపజేసినారు. తరువాత అధ్యక్షుల ప్రసంగం. అధ్యక్షోపన్యాసంలో 'జాషువాగారి కవిత్వంలోనున్న గొప్పతనాన్ని మాధుర్యాన్ని వినిపించారు. మరికొందరు వక్తలు జాషువాగారి చరిత్రను వివరించారు. ఉదయం సభ ముగిసింది. సాయంత్రం 3 గంటలకు

మరలా సభ ప్రారంభమైంది. పట్టణంలోని ప్రజలు, పెద్దలు, పరిసర గ్రామాల నుండి తరలివచ్చిన ప్రజలతో సభ నిండుగా వున్నది. జాషువా పద్యాలు, వారి కవితా ఔన్నత్యాన్ని పెద్దలు వివరించారు. సాహితీ ప్రియులు వారి కావ్యాలలోని విశిష్టతను కొనియాడటంతో తొలిరోజు సభ ముగిసింది.

**'జాషువా! నీకైతభేషుభేషు!!'**

రెండవ రోజు ఉదయం ప్రజలు అధిక సంఖ్యలో వచ్చారు. సామాన్యుల నుండి సాహితీప్రియుల వరకు అందరితో సభ కిక్కిరిసింది. సభ ప్రారంభంలో జాషువా పద్యాలు కొందరు పాడగా మరికొందరు కీర్తనలు, గేయములు పాడి ప్రజల నానందింపజేసినారు. వక్తలు జాషువా రచనలలోని సౌందర్యాన్ని, విశిష్టతను కొనియాడారు. జాషువాగారు తన పూర్వ చరిత్ర – కవితా ప్రపంచంలో కాలు నిలదొక్కుకుని పరిపక్వదశకు చేరుకున్న క్రమాన్ని, రీతులను వివరించారు. ఆనాటి పేదరికము, కులంవల్ల తనకు కలిగిన ఇబ్బందులు వివరించారు.

సాయంత్రం సభ ప్రాముఖ్యత జాషువాగారి కాలికిగండ పెండేర ధారణ. మహాకవి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని వేదికపైకి రప్పించి ఈజీచైర్‌పై కూర్చుండబెట్టినారు. వారు చాలా వృద్ధులు. కార్యకర్తలు వారి చేతికి గండ పెండేరాన్ని అందించినారు. 10 నవర్సుల బంగారు గండ పెండేరమును జూచి చెళ్ళపిళ్ళ శాస్త్రిగారు 'జాషువా నీకైత భేషు భేషు' అంటూ తన సమీపమున చిన్న కుర్చీపై కూర్చుండ బెట్టించి జాషువా కాలికి గండపెండేరాన్ని తాకించగా, అక్కడ కూర్చున్నవారిలో ఒకరు వచ్చి గండపెండేరం చీలను బిగించినారు. సభాధ్యక్షులు చెళ్ళపిళ్ళ శాస్త్రిని, జాషువాగారిని ప్రశంసించి సభను ముగించినారు.

**గజేంద్రారోహణ–**

చల్లపల్లి రాజుగారు ఒక ఏనుగును; పది గుర్రాలను, రెండు ఒంటెలను, వాటిని నడిపించగల సమర్థులను బెజవాడ పంపించారు. ఇవిగాక జాషువా గారికి బహుమతిగా సన్మాన కమిటీకి వెయ్యి నూటపదహార్లు ధనమును కూడా పంపించారు. సాయంత్రం ఆరింటికి ఏనుగును సమీపమున పరుండబెట్టి, జాషువాగారిని ఏనుగుపై కూర్చుండబెట్టినారు. అనేకులు జాషువాగారి మెడనిండా పూలమాలలు అలంకరించగా కొందరు కానుకలు సమర్పించినారు. 75 స్టాండ్ లైట్లు 75 మంది శిరములపై నుంచినారు. ఫుల్‌బ్యాండ్ వాయించుచుండగా ఊరేగింపు ప్రారంభమైంది. ప్రజలు జాషువాగారికి జైజై నినాదాలు పలుకుతున్నారు. లైట్లు కొన్ని ఏనుగు ముందు, వెనుక,

ప్రక్కన నడుస్తున్నాయి. పట్టణమంతా పరమానందభరితమైనది. తెల్లవారు జామువరకు వూరేగింపు జరిగింది.

మూడవనాటి సాయంత్రం ప్రత్యేక కూటము ఏర్పరచబడినది. గత రెండ్రోజుల సభ విశేషాలు, సన్మాన విశేషాలు వక్తలు కొనియాడారు. జాషువాగారు పరమానందభరితులై తనకు జరిగిన సన్మానమును ప్రశంసించి, దానికి కారకులయిన వారినందరినీ కొనియాడుతూ వ్రాసిన పద్యాలు వినిపించినారు.

**తొడిగెన్ కాలికి చెళపిళ కవి ముద్దుంగండ పెండేరమున్**

**ముడిచెన్ కొప్పున నా కళసతియశో! పుష్పమ్ము గుచ్చంబుగా**

**నడిచెన్ గుర్రపు దండు నా వెనుక నాంధ్రంబెల్ల పొంగారు దే**

**వుడు నాకిచ్చినదీ కవిత్వము సదా పూజింతు నాదైవమున్.**

**అత్తోట రత్న మనునొక**

**యుత్తమ హరిదాసు నేటి యుత్సవమునకున్**

**విత్తనము నాటె నాకుం**

**భక్తుడతనికిచ్చువాడ ప్రధమాశిషముల్**

**కనకాభిషేకం –**

51 సంవత్సరాల వయస్సులో గుంటూరులో జాషువాగారికి కనకాభిషేకం జరిగినది. 'కవి విశారద', మధుర శ్రీనాథ, నవయుగ చక్రవర్తి, విశ్వకవి సామ్రాట్' బిరుదులిచ్చి పగటి దివిటీలతో ఊరేగించినారు. సభ నిర్వాహకులు వసూలు చేసిన 25 వేల రూపాయలలో పన్నెండు వేలతో హాప్ పేటలో ఒక బిల్డింగు, మూడెకరాల పొలము కొని జాషువాగారి కిచ్చినారు.

**భారీ యెత్తున నుత్సవాల్ జరిపి నా పాదాన రత్నాల పెం**

**డారంబుల్ గయిచేసి పంపిన వధాన్య శ్రేష్టులున్ సుంతయా**

**ధారంబున్ దలపోయ లేదనిన నేత ద్గౌరవం బెల్లగుం**

**టూరుంబౌరుల కీయగా దలచిరేమో, ఈశ్వర ప్రేరణన్**

గుంటూరు పుగాకు వర్తకులు, అభిమానుల గౌరవ మర్యాదల గురించి జాషువాగారు వ్రాసిన పద్యాలు విని గుంటూరు పట్టణం ఆయనకు స్వేచ్ఛా పౌరసత్వమిచ్చి గౌరవించినది.

జాతీయావత్తూ ఒక్క త్రాట నిలిస్తే సాధించనిదేముందీ.

"కవీ నీదే కులం?" అని కాదు ప్రశ్న

"కవీ! ఏదీ నీ కలం?"

జన్మభూమి వినుకొండలో ఘనసన్మానం చేసినప్పుడు, నా హృదయంలో అమృతం పొంగి పొరలింది.

**నా నిశ్చయము విన్నవింతు వినుఁడాంధ్రక్షోణి పొంగార మీ**

**వాని న్నన్ను బహూకరించితిరి; లోపంబింత రాకుండఁగా**

**నీ నూరారులు వెండి నాణెములు వేయీన్నూరు బంగారు సో**

**పానా లైనవి, మీ యశస్పతి వసింపబోవు సౌధానకున్**

గుంటూరులో పొలము, ఇల్లు ఇచ్చి, బంగారు పూలు సన్మానించినప్పుడు... జరిగిన అనేకానేక తిరస్కారాలలో నాడు అలంకారాలై నా కంఠము నలంకరించినవి కదా అని నా మనస్సు ఆనందంతో నిండిపోయినది.

ఆంధ్ర దేశపు నలుమూలలా, నగరాల, పట్టణాల, పల్లెల్లో కవిగా నన్ను సన్మానించి గౌరవించారు. "కులమత రాజకీయములకు గురిగాక సర్వమంగళకరమై సత్యమును కమ్మని వాక్కుల చెప్పిన యీ కవితా సరస్వతికి" కేంద్ర ప్రభుత్వం "పద్మభూషణ" బిరుదు అందించింది.

కంకిపాడు గ్రామమందు హరిజనులు క్రైస్తవులు బరా బరులు చేసి పన్నీటితో పాదాలు కడిగి గౌరవించారు.

అప్పుడన్నాను "అడుగులకు మడుగులొత్తుట, పాదాలు మంచి గంధపు పన్నీట కడుగగా బిడియపడితి. ఇవి బడాయి స్వాములకు తగును – కవియు ఒక మానవుడే. కవిని ఒక దైవముగ తలచి కాళ్ళు కడుగు మీరు – అవివేకులు... యీ అవివేకము మనకు అనర్ధదాయకము" – అని కృతజ్ఞతలు తెలుపుకొంటూనే హెచ్చరించాను!–

**రాజు మరణించె నొక తార రాలిపోయె**

**కవియు మరణించె నొక తార గగనమెక్కె**

**రాజు జీవించె ఱాతి విగ్రహములందు**

**సుకవి జీవించె ప్రజల నాలుకలయందు**

* * *

# నేను కోరుకున్న సమసమాజం

## - మానవతా పూర్ణం

అటు దక్షిణాన తంజావూరు మండలాన ఒకానొక గ్రామం. కొబ్బరి వృక్షాల నీడలో, పోకచెట్ల వుయ్యాలలో ఏలుకలతలు అల్లుకొన్న పందిళ్ళతో, ఆ గ్రామం చల్లగా పచ్చగా వుంది.

అందమైన భవనాలు వున్నా, ఆ పచ్చని వనాల నీడల్లోని కొబ్బరి ఆకుల పాకలే అందంగా ప్రకృతికి సహజ అలంకారాలలా వున్నాయి.

ఆ ఊరికి తూర్పుగా, పోక వృక్షాలు విసిరే చల్లగాలులు పందిటిలో ఒక చిన్న పూరిగుడిశ. ఆ గుడిశ చుట్టూ లవంగ తీగలల్లుకొన్న పచ్చని కంచె ఆ గుడిశెను ప్రేమతో పొదివికొన్నట్లున్నది.

ఎప్పుడో తెలుగు వాఙ్మయ లక్ష్మి దారిబత్తెముతోడ తంజాపురము వంక కదలి వచ్చిననాడే, అస్పృశ్యుడు గర్భ దరిద్రుడు ఒకడు వలస వచ్చి నివాసమున్నాడు. అతడు నిర్భాగ్యుడు కానీ నీతిమంతుడు, శ్రమజీవి.

చిక్కిన కాసు చేతనే తృప్తి చెందే అమాయకుడు. తన కష్టాలనన్నింటినీ ఒక్క ముద్దతో మరచిపోగల సంపన్నుడు.

పేదరికము పెద్ద వింత విద్యాశాల దానిలోన లజ్జ కానపడదు.

ఉదరం ఒజ్జయగుచు, ఓరంత ప్రొద్దులు ఓర్మి విద్దె నేర్చుచుండునచట

నీతిమంతుడైన యీ కష్టజీవిపై ఎవరికి, ఎటువంటి హక్కును ఎలాగున సంపాదించినారో కాని కులంతో, అంటరానితనాన్ని ముడిపెట్టి వానిని ఊరికి దూరంగా పొమ్మన్నారు.

ఏ శాస్త్రం? దానికేమి హక్కు? ఏ ధర్మం? దానికెవరిచ్చారీ హక్కు? వీనికి మాత్రం తెలియదు. ప్రశ్నించలేదతడు.

**"ముసలి వాడైన బ్రహ్మకు పుట్టినారు**

**నలువురు కుమారులనుట విన్నాము గాని**

**పసరముకన్నా హీనుడ భాగ్యుడైన**

**యైదవకులస్థు డెవ్వరమ్మ ! సవిత్రీ?"**

వేద చతుష్టయంబు ప్రభవించిన వ్యాసుని దివ్యవాణిలో మాదిగలుంటారా? అందరివలె రుధిర మాంసములు గల అంటరాని వారు ఆదిమ వాసులా?

భరత పుత్రుని పాదాలు కందిపోకుండా చెప్పులు కుట్టే యీ దరిద్రుడు, యీ శ్రామికుడు, జీవనం సాగిస్తున్నాడు. ఎవరినీ తిరస్కరించలేదెన్నడూ! ఈ యావద్దేశం యీ నిరుపేదకు ఋణపడే వుంది! ఇదీ సత్యం!

తానొక అస్పృశ్యుడు, సంఘ గౌరవం లేనివాడు, నిరుపేద, బానిస వివాహమాడి, మరికొందరిని గౌరవంలేని బానిసలను పుట్టించడ మెందుకని ఆ పేద కార్మికుడు బ్రహ్మచారిగానే వుండిపోయినాడు.

అతని రెక్కలు కష్టించకుంటే, అతని చెమటనే భూమి తడవ కుంటే.... యీ భూమి పులకరించ సంశయిస్తుంది... సస్యరమ ఫలించ వెనకాడుతుంది. యావత్ప్రపంచానికీ అతడు అన్నదాత ! విచిత్రం! "అన్నదాతకు బుక్కెడు బువ్వ" దొరకదు.

**"జలనిధిలోని ఉప్పొకరిస్వా స్థ్యవముకాదు ప్రభుత్వ శాసనం**

**బులకు శిరస్సులేదు, ప్రభువుల్ దయ మాలిన వారు, సూర్యచం**

**ద్రుల వలె అబ్దులున్, పుడమి, రోదసి పేదల సొమ్ము, భారతీ**

**యుల నిరుపేద గంజికి, కరువయ్యెనే ఉప్పురవ్వయున్ !**

ఆ ఇనప గజ్జల దారిద్రం యితని ఇంటనే స్థిర నివాసం ఏర్పరచుకున్నది. అదీ అతనికి అర్థం కాదు. ఎవర్నైన ఎప్పుడైనా ప్రశ్నిస్తే....

"నీ ఖర్మ, నీవు పూర్వజన్మలో చేసికొన్న పాప ఫలం" కాబోలు అని నోరు మూయింప చూస్తారు. నాలుగు పడగలున్న ఆ హిందూ నాగరాజు బుసకొట్టి అతన్ని భయ భీతుణ్ణి చేస్తుంది.

ఒకనాడు దినమంతా శ్రమించి ఇల్లుచేరి, గంజితాగి పడకపై మేనువాల్చినాడు. నాల్గు దిశలనుండీ చీకటి ముసురుకున్నది. అప్పుడు ముక్కు, మొగం వున్న చీకటి ముద్దా అన్నట్లున్న గబ్బిలం అతని ఇంటజొచ్చి గుడిశంతా విహారం చేస్తున్నది స్వేచ్ఛగా. ఆ వచ్చింది వూరు కున్నదా, దాని రెక్కల గాలికి గుడిశెలో గుడ్డి ఆముదపు దీపం ఆరిపోయింది. ఆ యింట చీకటి మరింత చిక్కబడింది. ఆ గబ్బిలం తిరిగి తిరిగి ఒక చోట తలక్రిందులుగా వేలాడింది. ఆ పక్షిని చూడగానే అతని హృదయం ఉత్సాహంతో విచ్చుకున్నది. ఏవో ఊహలు మొలకెత్తినవి. ఆ పక్షితో మాట్లాడి, తన ఊహలను దానితో చెప్పుకోవాలన్నంత ఉత్సాహం ఉరకలెత్తింది.

ఈ అభ్యాగతి తనకు మంచి మిత్రునిగా కనిపించి; ఈ మదోన్మత్త ప్రపంచాన పశు పక్ష్యాదులే కదా పేదలకు స్నేహితులు, అని తలంచి....

ఓ ! గబ్బిలాల రాణీ! స్వాగతం ! అతి పవిత్రమైన దేవాలయాన నివాసమున్నదానవు. నీవు ప్రవేశార్హతలున్నవి. పిడుగులు పడే ఝుడివానలో కూడా మాకు ప్రవేశార్హతలు లేవు. ఈ మహీతలం అంతా గాఢ నిద్రలో మునిగి వున్నది. ఏమి ఆశించి నా గృహం జొచ్చినావు. ఇక్కడ ఒక్క ఆనంద కిరణం కూడా నీకు కనుపించదే!

అంటరానివాడున్న నిసిద్ధ గృహము, నీవు వచ్చినట్లు తెలిసిందా, 'నీకూ బహిష్కరణ తప్పదు. సమస్త దేవాలయాలలోనూ, ఆ దేవతల సరసన ప్రసాదం ఆరగించగలవు. అన్నము లేని యీ పేద గృహం ప్రవేశించితివేల ?

నా కెందుకు ముద్ద కరువైనదో, నా ఆకలి ఎందుకు తీరదో తెలుసునా? సంపన్నుల ఆజ్ఞలో బ్రహ్మాది దేవతలు నడిచే లోకం యిది. వేలకు వేలు ఖర్చుపెట్టి ప్రతీ ఏటా రాతి విగ్రహాలకు పెళ్ళిల్లు చేయగలరు. భిక్షాపాత్రలో మాత్రం బియ్యపు గింజ రాల్చలేరు. దేవతలు ఒకరా, ఇద్దరా ముప్పైమూడు కోట్ల దేవతలు యీ దేశంపై ఎగబడ్డారు.

**"గుళ్ళు గోపురాలకు నీవు వెచ్చించు ధనము చూచి**
**పేదవాని కడుపున నర్తించుకత్తు లెన్నో లెక్క గట్టగలవే**

**పుట్టించె దయలేని లోకమున ఏ పుణ్యాత్ముడో కుక్షిలో**
**ముట్టించెం పొగలేని ఆకటి సొదన్ ముప్పూట లీ చిక్కులు**
**అట్టెట్టె తపియించు నాకు ఒదవు ఆహారంబు భక్షింపగా**
**పుట్టంజొచ్చిరి దేవతల్ బహుళరూపుల్ పుట్టలై చెట్టులై**

ప్రశాంతమైన యీ రాత్రి ఎల్లలోకాన్నీ బుజ్జగించి, జోకొట్టి నిద్రబుచ్చింది. అస్పృశ్యతా జబ్బు అంటుకొని బాధపడుతున్న నన్ను మరచిపోయింది.

ఓ పక్షి సోదరీ! నా విజ్ఞప్తి ఒకటి ఆలకించు నీవు సమస్త దేవతా గృహాలు సందర్శించ గలవు. ఈశ్వరాలయంలో నీవు స్వేచ్ఛగా ప్రవేశించగలవు. నా కష్టాలను, నాలో రగలుతున్నా యీ వేదనను చెప్పుకోవాలని వుంది.

ఆ ఈశ్వరాలయాన తలక్రిందుగా నీవు వేలాడు నప్పుడు శివుని చెవి నీకు దగ్గర అందుతుంది. అప్పుడు నా యీ గాథను ఆయనకు వినిపించు అన్నట్లు ఒక్క హెచ్చరిక, ఆ పూజారి లేని సమయం చూసి మరీ చెప్పు, ఆ పూజారి విన్నాడో! నాగతే నీకు పడుతుంది సుమా!

**"ధనమున్ దొంగిలు దొంగలుండ్రు భగవద్దత్తం బుదాత్తంబునే**

**మనుజత్వంబును దొంగిలించి యతి నిమ్నత్వంబు నటించి**

**రమ్ముని ఏ పాప మెఱుంగనట్టి పరమాప్తుం పంచమున్ మంచిగా**

**తినుచున్నాదవు, అహింస కింక బ్రతుకేది హిందూ సంఘంబునన్-**

వీరంతా నా యీ స్థితికి నా ఖర్మ కారణం అంటారు. ఈ కర్మ ఏమిటి దీనికి నాపైననే కక్ష ఎందుకు? ఆ దేవుణ్ణి అడిగి ఋజువు చేయమను. ఈ సిద్ధాంతాన్ని అడ్డుపెట్టుకొని నా నోరు మూయించ చూస్తారు. స్వార్థపరులు నాభుక్తిని వారే అనుభవిస్తున్నారు.

మమ్ము, మాయీ దుస్థితిని చూచి మా అమ్మ భారతాంబ కన్నీరు నించని రోజు లేదేమో!

**"ఎంతటి దాస్యమేని సహియింతును గాని సహింప జాల**

**స్వంత సహోదర ప్రబల బంధుర దాస్యము గబ్బిలాల శు**

**ద్ధాంతములైన వేల్పుల సుధాభవనాలకు దూరమైన నా**

**సంతతి ఉద్ధరింపగల సత్పురు షుండుదయింపకుండినన్ -**

అందమైన నీ రెక్కలు విసరి నా శ్రమ పోగొట్టివి. నన్ను ప్రేమించిన నీ ఉ పకారానికి ఏమీ బదులు ఇవ్వలేని ఋణస్తుడను.

మృగము, పక్షి రెండు విచిత్ర ధర్మములు దాల్చినట్టి దానివి. నీవు అపశకునం అని ఈలోకం నిన్ను చూడదు. కానీ నాకా పాత పట్టింపులు లేవు. నీకు నిత్యం స్వాగతం. నా హృదయపు దిగులు పోగొట్టి, నా సందేశాన్ని ఆ ఈశ్వరునికి వినిపించు.

ధర్మమునకు పిరికితనం లేదు. సత్య వాక్యానికి చావులేదు. ఆ ఈశ్వరుని మ్రోల నీవు భయపడపనిలేదు. అతడు స్రష్ట అయితే నీవు సృష్టివి....

ఆ వెండి పర్వతాన నివసించే ఈశ్వరునికి నా నమస్కారములు అందజేయుము. పక్షి సుందరీ! నీకు ఆ దూరం ఒక్కపూట ప్రయాణం కదా!

ఆ గౌరీ నాధుని కాశీకి పోయే మార్గం ఆ చుక్కలదారి. ఆ దారినే చనుము. భానూదయం కాగానే నీకు చత్వారం కలుగును కదా!

"మొలక సంధ్యారాగమున కెంపులెగ జమ్ము చరమా చలముపై కాలుపెట్టి ఆ సెలయేళ్ళలో ఈతలు కొట్టి, ఆ పిల్ల తెమ్మరల హాయిని అనుభవిస్తూ, కొండ శిఖరాలను ఢీకొని ముక్కలైన మేఘములపై గెంతుతూ, ఆ ఆకాశగంగ తరంగాలపై సంచరిస్తూ చిలుకలు ఎంగిలి తాకి చిట్లె తేనెలు కారు కమ్మని ఫలాలు ఆరగిస్తూ ఆ నూతన స్థలాల విహారం చేస్తూ కొన్ని నాళ్ళు యీ కుటిల సంసారపు దిగులు మరచిపో, సోదరీ !

స్వాత్వికమైన భోజనం నీది. నీ మనస్సున జాలి వెన్నెల విరసిన సుమనస్వినివి. నా కన్నీటి గాధను వర్ణించుటకు ఆర్ద్ర హృదయమే అవసరం...

నా మనస్సున నిత్యం ధర్మాధర్మ మీ మాంస జరుగుతున్నది.

ఈ కుల మతాల విభేదాలు ఏమిటి? యీ అస్పృశ్యత, యీ హెచ్చుతగ్గులేమిటి? పుర బాహ్యానికి నేనెందుకు నెట్టివేయబడినాను?

యిలాగ ఎన్నో ప్రశ్నలు నన్ను ప్రశ్నిస్తున్నవి.

ఈ సంసారం సాగరమన్నారు అనుభవజ్ఞులు. ఎగిసిపడే పెద్ద పెద్ద కెరటాలను, తిమింగలాలను కలిగి వున్న సాగరాన్ని ఈది రాగలము. కానీ మనల తరింప జేయదు యీ సంసారం, దట్టమైన చీకటి రాత్రి అలముకున్న నీశీథంలో దిక్కుతోచును గాని, యీ సంసారం కూపంలో చిక్కుకున్న దారి దిక్కుతోచదు. మహా సాగరం ఒకసారి ఉప్పొంగు, ఒక్కసారి నిమ్మళించు కాని అష్టకష్టాలతో నిండిన సంసారంలో మనం శాంతింపలేము.

యాభైసంవత్సరాలు దాటిపోయినవి యీ సంసారాన జన్మించి. వెలుతురు, వాయువు, జలము యీ విశ్వాస జన్మించిన ప్రతి మనిషికీ యీ ఆస్తిపై హక్కు గలదు, కానీ వీటికి నేను సుంకము కట్టవలె. లేదా రాచవారి ఆజ్ఞరాదు. వింతలు విపరీతములు బహు విధాలై కనబడుతాయి.

ప్రేమ వాహిని విశ్వ విశ్వంబరమునందు ప్రవహించునన్న ఆశతో క్రైస్తవ మతాన్ని నమ్మిన వారు కొందరు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి కలుష శక్తులను సంహరించగలనన్న హరిని మరి కొందరు నమ్మి... యీ సంసారాన ఎంత దౌష్ట్యము , ఎంత హింసా విధానము చెలరేగిపోతున్నా చింతపడక, నిశ్చైతన్యంతో శత సహస్రా బ్దములు సాగిపోతూ వుంటాయి.

విశ్వ మానవ గోత్రీయులైన కవులకూ కర్మబంధం కట్టిపెట్టి కులమును పులుముతూ వుంటారు మీ మనుషులు. మత పిచ్చి ముదిరి ఇతర మతాల నిరసించి గౌరవాలను, సహనాన్ని సంహరించుకుంటారు. పుట్ల కొద్ది రక్తాన్ని వర్షింపజేసుకుంటారు. మత సంఘర్షణలలో ఇక్కడ వింత వింత విషయాలెన్నో. మంచివాడు ఒక తెగకు, దుర్మార్గుడుగాను, – దుర్మార్గుడు ఒక తెగకు మంచివాడుగాను ఒకరు ఔనంటే మరొకరు కాదంటాడు.

పూర్వ సంప్రదాయాలకు దేవతలపై వెర్రి నమ్మకాలకు చావులేని విద్యనే పాఠశాలలో నేర్పుతారు. హేతువాదం; ప్రశ్న పనికిరావు.

అనేకులు వేదాంత జలధిలో బడి యీదుతూ, యీ సంసారాన్ని ఈదలేక రోదిస్తారు.

కులంతోనే మనిషికి గుర్తింపు. స్వర్గ నరకాల పాఠాన్ని మతం బోధిస్తుంది. పనిపాటలేక కాషాయ వస్త్రాలు కట్టిన వానికి ఇక్కడ బ్రహ్మరథం పడతారు. మరో ప్రక్క వివిశ రాజకీయ వేషాలలో దేశభక్తిని అభినయిస్తే చాలు ప్రజలు పూలహారాలతో పూజించగలరు.

ఇక్కడ స్త్రీకి స్వేచ్ఛ కరవు. గౌరవం హుళక్కి, పురుషుని ఇల్లు దిద్ది, సంతానం కనే యంత్రాలుగా మలచి పరదాలలో బంధిస్తారు.

తలబొప్పి కట్టే పెద్దలనాటి బూజుపట్టిన దొంగ ధర్మాలు వినిపించి, వినిపించి, – 'అబల' 'అసూర్యంపశ్య', అనే సౌందర్యం మాత్రం పెంచుకొనే బిరుదులు అంటగట్టి, ఆమెలో నెత్తురు చల్లబడేట్లు చేసినారు. 'భర్త' దైవం, భరించువాడు, పతి పాదాలే స్త్రీకి శరణ్యం అంటూ ఆమెలో పతిభక్తి రసాన్ని నూరిపోసి, భర్త ఎన్ని దురాగతాలు చేస్తున్నా పల్లెత్తి మాట్లాడరాదనే చచ్చుమందు పోసినారు.

స్త్రీకి విద్య అనవసరం, చైతన్యం తప్పు, ఆలోచన చేయరాదు అనే చిలుకల చదువులు నేర్పి ప్రవతములు, నోములు చేయించి ఆమె బుద్ధి బలాన్ని అదిమి చిదిమి జ్ఞానం పెరుగుదలను అరికట్టినారు. చిత్ర చిత్రంగా ఆమె జ్ఞాన బలాన్ని హత్య చేసినారు.

మొక్కుబడి అనే పిచ్చి నమ్మకాలతో ఎందరో ఆడ శిశువులను గంగానదికి అప్పగించారు.

పతిభక్తి, పతితో సహగమనం అనేపేరు ఎందరో చిగురు కొమ్మలను అగ్నికి అహుతి చేశారు. చదువులు, ప్రతిభల గొంతు పిసికినారు. స్త్రీకి యీ సంసారం సమాన గౌరవం, అవకాశం, ఆస్తి, చదువు పెరిగిందాక, పక్షపాత ధర్మం, సగం న్యాయం సాగుతూనే వుంటుంది. ఈ ప్రధాన మార్పు జరగకుంటే యీ సమాజ అభివృద్ధి ఎండమావే. –

**శిలలవంటి ఊరిసత్తులకు నెత్తుటికూ**

**డు రేవులు మాపులు మేపలేక**

**ఆచారమని, తప్పదని వెంటబడి వచ్చు**

**గురుల దక్షిణ లిచ్చుకొనగలేక**

**మంత్ర తంత్రముల సోమరి మాంత్రికుల**

**బారి బడి ధైర్యమును చక్కబట్టలేక**

**శత సహస్ర క్రూర మత సింహములు సేయు**

**కుటిల గర్జకు తట్టుకొనగలేక**

**అనుగు తమ్ముల సిరులు ఓర్చుకొనగలేక**

**పిచ్చి పూజల మమతలు విడువలేక**

**అమర మతమైన మాదుదేశాభ్యుదయము**

**ఉట్టికిని, స్వర్గమున కెక్కట్టి కూగులాడు**

"అట్టడుగు మనిషిని కూడా సముద్ధరించాలి, సంతోషం, సౌభాగ్యం అవి భాజ్యాలు. దేశంలో ఎక్కువ మంది రోగపీడితులై, అవిద్య, అజ్ఞానంలో కొట్టు మిట్టాడుతూ వున్నంతకాలం మిగతా కొద్దిమంది సుఖంగా, సంతోషంగా వుండలేరు. అలా వుండడం, ఉండాలనుకోవడం కూడా తప్పే. అంచేత ప్రతివారు తమకన్నా దరదృష్టవంతులైన వారిని తమ స్థాయికి తీసుకు రావడానికి ప్రయత్నించాలి.

లక్షలాది ప్రజ కూడు, గుడ్డ, నీడ లేకుండా అలమటించే దేశం మనది. వారిని సముద్ధరించడం కంటే దేశభక్తి వేరే లేదు. ఊరికే ఉపన్యాసాలివ్వడం కాదు."

– స్వామి వివేకానంద

రిచర్డ్ ఆర్లింగ్టన్ అనే సామాజిక శాస్త్రవేత్త ఏమన్నాడంటే దారిద్రం ఎక్కడో లేదు, – "

"The wealth of a Country

Lies in its men and women

If they are ignorant if they are illiterate, the country is poor" అని

కూటికి అల్లాడే పేదల డొక్కలు ఏనాటికైనా మూడు పూటలా నిండేనా? కులతత్వపు గాలి సోకకుండా ధర్మం నాలుగు పాదాల నడుస్తుందా?

ధనవంతుల చూపులు ఆ మేడలు దిగివచ్చి సామాన్య మానవుల సదనాలకు రాగలదా!

పంచభూతాత్మ కందైన ప్రకృతి సుఖములు అనుభవించే హక్కు ఒక్క మనిషికే కాదు, ప్రతి చిన్న ప్రాణికీ వుంది. మాకు ధనబలం, అధికార బలం వున్నది గదా అని దోపిడీ చేయ తగదు.

ఈ నా దేశం బుద్ధుని కనిన కరుణాంతరంగ; పావన నదీ జలాలచే తడుపుకొన్న నేల... అని పొంగి పోతూవుంటాము. మరో ప్రక్క ప్రకృతి రమణీయతను కౌగలించుకున్న పచ్చని భూమి ఆ పచ్చటి వనాలు, ఆ నీలి నీటి కొండలు, ఆ సెలయేళ్ళ గలగలలు, ఆ రంగు రంగుల పక్షుల కిలకిలలు,..... సస్యశ్యామలం, సుజలాం సుఫలాం... ఇదే మా పాట. మా రాగం మలయ మారుతం... మరి నీ ప్రయాణం యిటు దక్షిణం నుండి మొదలై దారిలో ఎదురైన ప్రసిద్ధచారిత్రక స్థలాలను – కీర్తిశేషులై శిధిలాలలో వున్న నగరాలను... కవితకు, కళల పుట్టి నిండ్లైన, ఊర్లను.... తప్పక దర్శిస్తూ, ఉత్తర దిశగా ప్రయాణం సాగించు.

ఈ తంజావూరు దాటి, అటు ఆ హంపీ క్షేత్రాన్ని దర్శించక మానకు. తెలుగుల వైభవశ్రీలకు ఒకనాడది కేళీరంగం. ఆ మెరుపు తీగలు ఆరిపోయిన భూమి. సిరికి పరదా పద్ధతి మాన్పిన రాచ నగరం.

శతృవుల కరవాలానికి ఆహుతి అయిన తెలుగు కళా సామ్రాజ్యం, ఆనాడు ఆ కృష్ణ విభుని నగరాన కుంకిన ప్రొద్దు, మరలా పొడవనే లేదు. ఋషి ఖగాంగనా! నీ బంధువులు గృహాలు నిర్మించుకొని ఏలుతున్నారిప్పుడు. నీకు స్వాగతం పలుకగలరు.

పౌరుషం, శత్రుత్వం, రాజ్య విస్తరణా కాంక్ష యివి మానవ విజ్ఞానాన్ని హరించి, అధఃపతనానికి దారినిచ్చే ప్రతాపాలు. ఇవి శాశ్వతం కావు. శాంతి స్థాపనే చిరంజీవి అన్న సత్యాన్ని యీ ప్రతాపోద్రేకాలు నిజంచేసి చూపించి పోయినవి, పక్షిణీ!

అలా నీవు ప్రయాణిస్తూ రాగా గుంటూరు మండలం తగులుతుంది.

తెలుగు రక్తం, శౌర్యం వ్యర్ధమైన కోడిపుంజుల తగాదాలో ఖర్చయిపోయినవి. ఇప్పుడు అటు పలనాడు సీమలో, ఆ కార్యం పూడి తిరునాళ్ళలో, ఆ కత్తులు, కటారులు తుప్పుపట్టి వున్నవి ప్రదర్శిస్తూ వుంటారు.

అదిగో ! అక్కడ చిల్క సరస్సు తేట తేట తీపినీళ్ళ సరస్సు. స్వచ్ఛమైన తెలుగు భాష వలె కన్పిస్తోంది...

అటు ప్రయాణం సాగుతూ వుండగానే ఆ ఢిల్లీ నగరం గోచరిస్తుంది. యుగ యుగాల కథలను ఉదరాన జీర్ణించుకొని, రాజరక్త ప్రవాహాల తేలి, నవ్వుతూ వున్న ఆ ఢిల్లీని చూడు. దాని అందమూ తరుగ లేదు. శిరస్సూ నెరియలేదు.

**"సులతా నీ సులతానులన్ మణిగణాంశుల్ దట్టు మిట్టాడు మే**

**దలలో వాసము చేసినారు నిజ రాష్ట్రంబు ఆకటందూల పే**

**దలనోరూర భుజించినారు ఇచట ముక్తారత్న పాత్రంబులన్**

**కలమాన్నాంబు, సుఖించినారు అఖిలభోగశ్రీ మహాడోలలన్ –**

ఓ!తబిసి పిట్టా ! ఒకడు అఖిల భోగశ్రీ మహాడోలల ఊగులాడ, మరోకడు ఆకటందూల ! యీ వ్యత్యయం ఏమి? ఏది కారణం? ఈశ్వరుని అడిగి, జవాబు తీసుకురావమ్మా!

ఆ ఢిల్లీకి అల్లంత దూరాన యమునా నదీగట్టున ఒక కళా పేటిక వుంది. తప్పక దానిని చూచిపో. షాజహాను చక్రవర్తికి ఎందరో భార్యలు వుండి వుండవచ్చు ఆయన హృదయ సీమలో ముంతాజ్‌కే స్థానం వున్నదన్న సత్యాన్ని ఆ కళాసదనం 'తాజ్‌మహల్' అనేక సంవత్సరాలుగా మౌన సందేశాన్ని, అందిస్తూ వున్నది. ఒక భర్త ఒక భార్యను ఎంతగా ప్రేమించాడో ఆమెకై ఎంతటి జ్ఞాపికను 'బహుకరించాడో, ఆ పాలరాతి కళాఖండం వెల్లడిస్తున్నది. అంతే మనం దానిని గురించి మంచిగా ఆలోచించ వలసింది. దానిని చూస్తూ వుంటే గంటలు గడచిపోతూ వుంటాయి.

దానిని నిత్యం చూస్తూ చూస్తూ కన్నీటి బొట్టురాల్చి కన్ను మూశాడు" అని షాజహాను ఆఖరి క్షణం గురించి చరిత్రకారులు వ్రాశారట. అదే నిజమైన చరిత్ర వార్త అయితే, షాజహాను భార్యపై ప్రేమను ప్రశంసించవలసిందే.

హిమాలయ శిఖరాభిముఖంగా మరికొంత ఆకాశమార్గాన నీవు హాయిగా ప్రయాణం సాగించగా....

ఈ ప్రపంచాన్ని దుఃఖాన్నుండి, జరా మరణాల నుండి రక్షించి..... అహింసాపూరిత జీవితాన్ని స్థాపించుటకై సర్వ సంసారాన్ని, రాజ్య భోగాలను, రాజ్య సింహాసనాన్ని త్యజించి భిక్షా పాత్ర చేతబట్టిన ఆ సిద్ధార్థుడు పర్యటించిన ఆ పుణ్య స్థలాలు తప్పక దర్శించి జన్మ ధన్యం చేసుకో –

గాయం బాధకు మూగ రోదనం చేయుచున్న రాజ హంసను పెంచి దాని దాహాన్ని కన్నీటితో తీర్చిన –

జీవిత కాలమంతా పరులకై కష్టించి, ప్రతి రక్త బిందువును వెచ్చించి శుష్కించిపోయి, నడవలేని బక్క ఎద్దును చూచి ప్రేమతో నిమిరిన –

మరణించిన జీవిని చూచి చింతించి –

సామ్రాజ్య వైభవాలను త్యజించి, బోధివృక్షపు నీడన గుండెదిగులె తీర్చుకొనిన ఆ బుద్ధుని యీ ప్రపంచం మరువరాదు.

ఆ రాజనగరిలోని అందాల భామల వాల్చూపు ఉచ్చులకు చిక్కుకొనక –

ఆ మనోహార రమణీయ రాజమహలు సౌఖ్యాలకు మోహంలో పడక –

అనుంగు సతి యశోధర అందాల బంధాలలో మనస్సు కోరికల కాంక్షల నుండి తప్పించుకొని –

అనుగు పుత్రుడు రచించు కడుపు చిచ్చునకు కంగారు పడక –

సర్వ సంగ పరిత్యాగ మొనర్చి శాంతి స్థాపనకై నడచిపోయిన ఆ బుద్ధ భూపాల చంద్రుని, శాంతిమూర్తి – జీవన శాంతి మార్గము.

ఆ అర్ధరాత్రి వేళ అరమైలు దాకా సాగనంపి, ఆ రాజమహల్ గోపురం శెలవు తీసుకొన్నది –

ఆ మహనీయుని నిష్క్రమణ గాంచి ఆ ఇంటి దీప కళిక, కాటుకతో మ్రొక్కుకున్నది–

ముంగాల భూమిని చీరుతూ కంట తడిపెట్టినది 'పంచ కళ్యాణి హయము –

వజ్రకాంతులీను ఆ సింహాసం మరునాడు శోకించినది –

అంధకారమే సాయముగా నడువ ఊరులేని ప్రయాణాన్ని కోరి, ఆనాటి నడిరేయి నడిచిపోయిన సిద్ధార్థుని తలంచినడువు.

కుంటె గొఱ్ఱెపిల్లను మోసికొని పోవు ఆ అహింసా మూర్తిని  చూచి గొల్లలు మొక్కుకున్నారు.

ఆ కారుణ్యమూర్తి ప్రసంగాన్ని కన్నీట ఆలకించి యజ్ఞ ప్రయత్నాన్ని, జంతు హింసను మానుకొన్నాడు గదా –

ఆ మూర్తి కడకంట వెలిగిన అహింస జ్యోతికి కొండలే కరిగినవి వెన్నపూసల వలె క్ష్మా మండలంబంత ఆచారణాబ్జముల ముద్దుగొన్నది.

పాములు గాలిమేత అలవాటు చేసికొనుట కతడే కారణమేమో! ఆమహానీయుని పదాంక ముద్రలో చీమకూడా హాయిగా నిద్రపోయినది.

ప్రపంచంలోని ప్రతి జంతువు ఆ కారుణ్యమూర్తిని తలంచిన రోజు లేదేమో – పక్షిణీ ! యీ సమాజంలో చెలరేగుతున్న హింసా దౌర్జన్యాలు సమసిపోయి సౌఖ్య శాంతులు స్థిరపడాలంటే ఆ బుద్ధ ధర్మాన్నే అవలంభించాలనే గట్టి భావన కలుగుతున్నది.

గబ్బిలాల రాణీ ! నా యీ హృదయావేదన విన్నావు కదా! చాలా తక్కువే చెప్పానేమో! బుద్ద దేవుని గురించి ఎందుకు వినిపించానంటే –

అహింసా పరమోధర్మః అంటూ వీనులు నిండా వినిపిస్తున్నది కదా ఆ అహింసను ఆచరణలో పెట్టమని నేను వినిపిస్తున్నాను.

ఈ నా సందేశం ఆ ఈశ్వరుని వీనులు నిండేలా చెప్పిరా :

అదిగో డబుడుక్కువాని ఢక్కా నినదంబు – హైందవ వీధిన వినవస్తున్నది. తెల్లవార వస్తున్నది. మన స్నేహం ఎటింగిరంటే కంటగించుదరు

వాని ఇష్టార్థములు కూర్చు దాని వలె విశ్వనాధుని గుడికి గబ్బిలము చనియె – వేయి చేతుల పెద్ద కాపు వేగిరింప, కచ్చుబిగించె ఆ పేద కార్మికుడు.

**"చెఱకు చిండిన లీల నాబలము ఓడ్చెన్ గానుగబట్టె యూ**

**పిరివోడె, ఏమ్ముల ప్రోవు నిల్చినది; నా వేషంబు వీక్షించి, నా**

**సరసన్నిల్చుటకు ఏవగించుకొని జ్యేష్టాదేవి భీతిల్లు, నిం**

**క ఒరులు ఏ లాగున నిబ్బరించు–"**

గబ్బిలం రాకకై ఆ పేదవాడు వేయి కన్నులతో తెన్నులు చూడసాగినాడు. వాని సందేశ ఫలితమో! సర్వమానవ సౌఖ్యం; సర్వమానవ సమత, అనే నూతన భావ సంచనలమో; ప్రసన్న వాయువులు వీవ సాగినవి. పేదవాని నిరాశాకాశంలో అశాతటిల్లతలు మోసులెత్తినవి.

భారతాంధ్ర జాతిలో తలెత్తిన అనైకమత్యం, స్వార్థలుబ్ధబహకుల మతావేశ వ్యాధిపీడ; కాబట్టి నితనం, పరస్పర యీర్ష్యా కుల దూషణలు నేడు తీరని వేదనలై అతనిని బాధింప సాగినవి. తన మిత్రము గబ్బిలంతో మరిన్ని చింతా సందేశాలను చెప్పుకొనసాగినాడు.

ఒకనాడు ఆ మునిపక్షి తన మిత్రుడున్న గృహానికేతెంచి, యధావిధిగా తిరుగుటం చూచి అతి ఉత్సాహంగా" పక్షి సోదరీ నీ సహాయమున నా ప్రయత్నం పండాయనా?

ఈ భూమిపై యింతటి కాలుష్యం పేరుకొని వుంటే ఆ భర్గుడు ఎక్కడో నాట్యం చేస్తూ వుండటం న్యాయమా? అని అడిగావా? అతను ఏమన్నాడో, ఏమనలేదో నాకు యిక అవసరం లేదు, ఇక్కడే యీ జన్మ భూమినే న్యాయం నడిచి వస్తున్నది.

ఈ భూమిపై సాగిన, సాగుతున్న న్యాయాన్యాయాలకు, ధర్మా ధర్మాలకు మేమే బాధ్యులం. ఈ సాంఘిక అసమానతలకూ మేమే శిల్పులం. ఒకవేళ అతడే సృష్టికర్త అయితే యీ అవకతవక సృష్టి చేయమని ఎవరడిగినారు? సకల కష్టాలను యీ భూమిపై నెట్టి తాను మాత్రం శాంతి సౌఖ్యాలను స్వీకరించి ఎక్కడో అందుబాటులో లేనిచోట వుండుట సబబా?

అసలు ఆ భగవంతుడనేవాడు ఉన్నాడో లేడో అనే సంశయం, భయం కల్పించింది అతని ఏజంటులే. తమాషా భక్తి నేర్పించిందీ వారే. దానితో వేలకు వేలు కులాలు, మతాలు ఏర్పడినాయి. ఒక్కో మతానికి ఒక్కో నమ్మకం. దానిలో పిలకలు, వర్ణాలు... ఇక వైషమ్యాలకు, ద్వేషాలకు కావలసినంత అవకాశం కలిగింది.

స్వర్గం, నరకం రెండింటి సృష్టి ఇక్కడే జరిగింది. భయం, ఆశ, ఆ రెండింటి యొక్క బహుమతులే. స్వర్గసుఖాలు. మోక్షం మానవునిలో మరణాంతర ఆశను కల్గిస్తే, నరకం దాని వర్ణన భయాన్ని కలిగిస్తుంది. మనిషి ప్రవర్తనపై యీ రెండింటి ప్రభావం వుండి, సత్ప్రవర్తన, భక్తి కలిగి వుంటాడని వీటి సృష్టిలోని రహస్యం. ఈ నవయుగంలో యీ రెండింటి యొక్క పట్టు తప్పినట్లు కన్పిస్తున్నది. దీనికీ ఏజంటులే కారణం.

రోజు రోజుకూ దేవ పూజపై మోజు సన్నగిల్లింది. మోక్షము పై నమ్మకాలకు బూజుపట్టింది...

ఆయన అల్లానో? మరియా తనూజుడో? ఈశ్వరుడా? బుద్ధుడా? వేదాంతాలు వల్లించే శబ్ద రూపుడా?

అవాఙ్మానస గోచరుడు కూడా కాదు. మరి ఏమిటి ఆయన ? నావంటి అతి సామాన్యుడే కాదు వేదాంతులూ తెలుసుకోలేక వున్నారు.

భగవంతుడొకడున్నాడని, యీ సమస్త మానవ క్లేశానికి, సౌఖ్యానికి అతడే కారకుడని నమ్మించి, కల్పనా కథలు సృష్టించి తమ పబ్బం గడుపుకుంటున్నారు యీ మతోన్మాదులు...

శిల్పుల చమత్కృతి వలన ఏవోవో రూపాలు కల్పించి 'దైవం' అని పేర్లు పెట్టుకున్నారు. శిలామయాలైన వారి తనువులు కదల్చే ఓపిక వారికి లేక, వాహనాలపై కదలుతూ వుంటారు. ఉత్సవాల సమయంలో.... దున్నలు, ఆబోతులు, ఎలుకలు, పక్షులు.. ఎన్ని వారికి వాహనాలుగా నానాక్షుద్ర జంతు సంతానాన్ని అంటగట్టినారు, వారే ఏ జంట్ల చేతుల్లో ఆ దేవుడే కన్నీరు నించుతున్నాడు. యిక మా యీ బురదను వారెట్లు తొలగించగలరు.

పూర్వపు చాదస్తపు, అవివేక ఉక్తులు, కుయుక్తులు వంకతో, విద్యాగంధం ఎరుగని ప్రజలు సత్తుల పూజలు చేస్తున్నవారికి, వద్దని వారించగల జ్ఞానవంతుడు లేడు యీ నాటికీ !

మహా మహులైన మానవతా మూర్తులు కొందరు యీ దేశపు దౌర్భాగ్యస్థితి నుండి ప్రజను ఆలోచించే శక్తిగల వారిగా చేయ ఎంతో శ్రమించనారు. యోగి వేమన విసిగిపోయినాడు. భావి భారత ప్రళయం సంభవిస్తుందని పోతులూరి వీరబ్రహ్మం వాపోయినాడు.

తల్లి దేశపు దారిద్ర్యం చూచి వివేకానందుడు దుఃఖించినాడు గదా. నిమ్నజాతుల దాస్యశృంకల జీవితాల చూచి గాంధి, అండేద్కర్, మహాత్మాపూవేలు తల్లడిల్లిపోయినారు.

అటు ఆ దేశాల అభ్యుదయ గాధలు విని, ఇటు మాతృదేశపు క్షీణదశ కన్నులార చూచి ఎందరెందరో పుణ్యమూర్తులు బాధపడినారు.

"ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్

త్యేనత్యక్తేన భుఞ్ధా మాగృధః కస్యస్విద్ ధనమ్"

ఈ ఉపనిషత్ శ్లోక సారం ఏమిటి? పర ధనాన్ని ఆశించవద్దు నీ కష్ట ఫలితమే నువ్వు అనుభవించు అనే కదా - మరి నా యీ శరీరమంతా శ్రమతో పునీతమై వుంది. ఏ ధనాన్ని ఆశించక పుణ్య పధాన నడుస్తున్నవాడిని...ఏదీ నాకు అభ్యుదయం? నా భాగం ఎక్కడ, ఎవని ధనాగారంలో బందీయై వున్నది?

ఇలాగ అన్ని మత గ్రంథాలు బోధించినవే.

"దొంగతనం' చేయకు - నిన్నువలె నీ పొరుగు వానిని ప్రేమించు- అని బైబిల్

ఈ ధర్మాలు, యీ న్యాయ నిర్ణయాలు ఏమైనవి? ఈ నీతులన్నీ నిజ జీవిత గమనానికి స్వార్థం తోడై, కాంక్షల సంకెళ్ళలో చిక్కుపోయి వుండటం వలనే

**"తొలుతున్న ల్వురు నాల్గు త్రోవలయి పుత్రల్ నాటు కొన్నారు ము**

**క్కలుగా వర్ణ చతుష్టయం బిపుడు అసంఖ్యా కంబులై యైక్యతా**

**బల విచ్ఛిత్తి యొనర్చి నన్నొరులకున్ పట్టించె యీ హెచ్చు త**

**గ్గుల కయ్యాలొక తల్లి పిల్లలకు సిగ్గుంజేటు యోచింపగన్"**

**అంచేత నాకు తోస్తున్నది...**

**"సత్యం హుళక్కి ధర్మం తమాషా మాటయే కాని యే**

**సత్యం బేడిచె, వర్ణభేద విషదూష్యంబుల్ మహా ధర్మములు**

**వ్యత్యస్తంబుల, అనైక మత్యములు, అసూయా ద్వేష భావంబులే**

**సత్యములు, చచ్చినవాడు శాయి యగు, మస్తాన్ ఆగు" -**

**ఇది కాదు నేను కొరుకున్న సమాజం.**

ధనాఢ్యుల మృష్టాన్నం చూచి నిరుపేదలు దుఃఖ పడని చోటు...

ఒకానొక వివాహ మండపం. ఆ వివాహానికి అంత దూరాన చిప్పలు, సత్తు గిన్నెలు పట్టుకొని కూర్చున్న అన్నార్తులు. వారు మీద పడకుంగా, కాపలాగా కర్రలు పట్టుకొని వున్న జవానులు... ఈ దృశ్యం ఎట్టి హృదయమున్న మనిషినైనా కదల్చక మానదు.

ప్రతిభకు, జ్ఞానానికి కులం, మతం రంగు పులుముట ఏమి? స్వేచ్ఛగా జ్ఞానం పెరగాలి.

కళలన్నీ జన్మతాః సంప్రతించే ప్రతిభలు, కళాకారుల కళలు జాతి వైషమ్యమనే పాదాల కింద నలిగి పోరాదు.

అధికార క్రూరతరమైన కత్తికి భయపడక స్వేచ్ఛ మసలే చోటు.

ఇటువంటి చల్లని హాయి గల చోటులో ఏను నివాసం ఏర్పరచుకోగలను.

**"ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వ**

**విశ్వసత్యము నాలపింప గలదొ**

**ఏనాడు మాజాతి దృష్టి మాంధ్యమువాసి**

**చుట్టుప్రక్కల దేరి చూడగలదొ**

**ఏనాడు మా బుఱ్ఱ లీ జుట్టు తలలేని**

**పుక్కింటి కథలలో జిక్కువడవొ**

**ఏనాడు మా విద్య లినుపసంఘమునుందు**

**చిలుము పట్టక ప్రకాశింపగలవొ**

**తనువుదాచక సోమరితనము మాని**

**యెన్నడీమరంబులు బిచ్చమెత్తుకొనవొ**

**అట్టి శుభ వేళకై కొంగుబట్టి నిలచి**

**నలిగి వాపోవుచున్నది నామనస్సు.**

ప్రియములు కాని సత్యాలు ఎన్నో చెప్పుతున్నాను. భయపడవలదు సోదరీ, నా పలుకులు భాష్పకణాభిరామములు.

నరుని కష్ట పెట్టె నారాయణుని కొలుచు 'ధర్మ శీలురు' వున్న యీ ధరణి మీద కాలు పెట్టలేక, నీవు ఒక్కదానికే నీ పాదాలు ఆకాశాన సాచి నడుస్తాను.

ఒక్కటి మాత్రం అందరం గ్రహించవలసిన సత్యం వున్నది.

పూర్వం వలె, గొర్రెలా తల వూచరు నేడు. ప్రశ్నిస్తున్నారు.

సర్వజనులూ ఒక మహా మాతృమూర్తి బిడ్డలని, అన్నదమ్ములమని భావించి ఆ మానవతనే ప్రచారం చేయాలి.

గుఱ్ఱాలకు రెక్కలుగల వెర్రియుగాల్ దాటిపోయే, విజ్ఞానంబున్ బుఱ్ఱగల గాంధీ యుగమిది కఱ్ఱలు ఖడ్గంబు లేలగా లేవు ప్రజన్ –

మాతృభాషల కర్థమగు మర్యాదలు చేసే సర్వ కళాశాల సాగుచోటు నేడు మనకు అత్యవసరం. ప్రజలను పిండి పిప్పిజేసే బహు మతాల దేవతలు లేని చోటు ఒక్కటే మనలో హేతువాద దృష్టిని కలిగిస్తుంది. విజ్ఞాన శాస్త్రం వెల్లి విరుస్తుంది. నవీన కవుల కమ్మని వాక్కు భయరహితమై వెలువడవలె– తన సంతానానికి కులమత ద్వేషాలు, వైషమ్యాలు నేర్పని తల్లిదండ్రులు అవసరం. విషపు నవ్వుల లాహిరీ వేషగాళ్ళ పాదముద్రల మరకలు లేని చోటు – ఇటువంటి స్థలమే మనవంటి సామాన్యులకు అనువైన చోటు.

వీర ప్రతాపాలకు యీనాడు చోటు లేదు. అవి నిస్సారములు. శాంతి సహనమే సత్యం, ధర్మము, సత్యము యీ రెండు పదార్థాములు అంగళ్ళలో దొరకవు. మనం సంపాదించు రత్నమాణిక్యాలు మన వెనుక అనుగమింపవు దేహాంతరమున. ఇది తెలిసీ కూడ – కొందరు ధనం ఆర్జింతురు తమ అవసరాలకు మించి దానిని దాచుకుంటారు. ఇతరులకు పెట్టరు.

ధనం మన ఇంట కుప్పపడివుంటే లాభం లేదు. ప్రయోజనం శూన్యం ఎరువు కుప్ప వెదజల్లితేనే సస్యశ్యామలం, అలాగే ధనం వ్యాప్తి చెందితేనే ఫలం. 'నీళ్ళు పారుతూ వుంటే పంటలు – పారవూ? పాచిపట్టిపోతాయి.

**"భూరి పరాక్రమోన్నతుల పుచ్చినమేటి కపాల పాత్రలన్**

**నీరము ద్రావుచున్నవి వనీ వన భూములలోని సింహముల్**

**వారల అస్తి పంజరములన్ ఊర్ణ నాభముల్**

**దారము తీసే ఇంతియెకదా భువి నాల్గు చెరంగు లేవినన్ !**

నా ఇంటికి ఎదురుగా, ధనవంతులు ప్రత్యేకం కట్టుకున్నా శ్మశానం వుంది. ఇంకెవరికీ (ఏ శవానికీ) అక్కడ స్థానం లేదు. అక్కడ ధనాఢ్యుల సమాధులు పాలరాతితో నిర్మించారు. సిపాయి, అధికారి సామాన్యుని సమాధులన్నా ఒకే నేలపైనే, అందరూ మట్టిలో సమాన స్థాయిలో కలిసి పోయినారు. అంతేగాదు శ్మశాన స్థలిలో పేద భాగ్య, హెచ్చుకులం, తక్కువ కులం లేదు. 'అట అస్పృశ్యత సంచరించడానికి తావే లేదు. నేల నాలుగు దిక్కులా పరిపాలించిన చక్రవర్తి కూడా అక్కడ మట్టే! ఈ సత్యం తెలిసి కూడా మానవులు గర్విస్తుంటారు.

ఈ ప్రపంచం ఒక ఆవిరి ఓడ. యీ ప్రపంచమనే వ్యాపార లావాదేవీలు ముగించుకొని వారి వారి రేవులలో దిగిపోతూ వుంటారు. వచ్చేవారికి స్థం ఖాళీచేస్తూ...

ఈ క్షణికమైన జీవితంలో అనంతమైన కాంక్షను పెంచుకొని, అశాంతిని దుఃఖాన్ని కోరి తెచ్చుకుంటారు.

ఆరడుగుల ధరాశకలమే ఆస్తి గడించి అనంత దీర్ఘ నిద్రారతులైన యీ మానవుల చూచి –

**"వెచ్చని యూర్పుగాడుపులు, వెచ్చ భాష్పముల్ స్రవించి, లే**

**పచ్చిక వ్రేళ్ళతో ఉడికి పచ్చిపొగల్ వెలిగ్రక్కు కాటిలో**

**పుచ్చులు నవ్వుచున్నవి ప్రమోదముతోడ విమోహరజ్జులన్**

**నిచ్చలు కుమ్ములాడు ధరణి నరులంగని హేళనంబుగా**

ఇంకా మానవ జీవితాన అంధకారం అలుముకోలేదు సోదరీ? దీపమున్నప్పుడే యీ మనిషి తన్నుతాను దిద్దుకోవలె – ప్రకృతి మనల హెచ్చరించుచున్నది.

**ఘనా ఘనా ఘనము చీకటి మేడ వెలిగించు**

**మెఱుపు దివ్వెల నూనె తఱగలేదు**

**పవలు రాతిరి తీరుబడి లేక ఘోషించు**

**తోయధీశుని గొంతురాయలేదు**

**ఇన బాలకుని దినమ్మున గర్భమును**

**పూచు పొడగపుదిక్సతి కాన్పులుడగలేదు**

**ఋతురాజు ధారుణీ సతికి సొమ్ములు పెట్టి**

**కులికించుపని మాను కొనగలేదు**

**మూర్ఖలోకమ ! దిన మెల్లముగియలేదు**

**దీపమున్నది హృదయంబు దిద్దుకొనుము.**

ఆ విధంగా, ఆ పేద కార్మికుడు వినిపించిన మహావధాను, గబ్బిలం హృదయము ఆర్ద్రమయినది. వేడి కన్నీరు. ఉబికి వచ్చినవి.

'అప్పువడ్డది భారతావని వీనిసేవకు' అని తలపోసి, ఆ మహామహుని చుట్టూ ప్రదిక్షిణచేసి గబ్బిలం ఇంటికి పయనమైనది –

తూర్పున స్వతంత్ర భారత విభాకరబాలుడుదయించే.

* * *

# కవిత పొంగిన వేళ

"Echoes of pain reverberate in my heart. Children in famine, Victims tortured by oppression helpless old people a hated burden to their sons, and the whole world of loneliness. Poverty and pain make a mockery of what human life should be. Long to alleviate the evil, but cannot, and I too suffer".

“బాధ యొక్క ప్రతిధ్వనులు నా హృదయంలో ధ్వనిస్తాయ్. తిండిలేని పిల్లలు, పీడకుల వల్ల చిత్రవధ అనుభవించే పీడితులు, తమ కొడుకులకు అసహ్యమైన బరువుగా వుండే నిస్సహాయులై వృద్ధులు. ఒంటరి తనంతోను, దారిద్ర్యం, బాధతో నిండిన ఈ ప్రపంచం అంతా కూడా మానవ జీవితం వుండాల్సిన పద్ధతి విద్రూప పరుస్తుంది. ఈ చెడును తొలగించాలని నేను ఆరాటపడతాను. కాని తొలగించజాలను. నేను కూడా బాధ చెందుతాను.”

– బెట్రాండ్ రస్సెల్

హిందూ గ్రంథాలు చదువుతూ హిందూ గాథలను వ్రాస్తున్నాడనే నెపంపై నెట్టి... క్రైస్తవ తెల్లదొర మిషనరీలకు చెప్పి వెలి వేయించారు నాన్నగారిని.

వెలికి బలై ఊరి బయట నున్న ఒక పాడుపడిన మసీదులో పగలు తలదాచుకొని, రాత్రి చాలా ప్రొద్దు పోయిన తరువాత ఇల్లు చేరి రహస్యంగా తల్లి పెట్టిన అన్నం తిని మానవతకు రసీదు ఇచ్చిన మశీదు చేరేవారు. అక్కడే గుడ్డి దీపపు వెలుగులో పంచ కావ్యాలు చదువుకున్నారు.

ఆ మసీదులో సాలీళ్ళు గూళ్ళు కట్టడం చూసి గమనించి, నిశితంగా పరిశీలించి.. ‘నే నెందుకు పైకి రాలేను’ అనే ధైర్యాన్ని పుంజుకొని ‘సాలీడు’ ప్రయత్నాన్ని, నేర్పరి తనాన్ని చూచి స్పందించగా వచ్చినవే సాలీడు పై పద్యాలు–

**"తలపం పున్నామినాటి వెన్నెలల దిద్దం జాలు నీ నూలు పో**

**గుల సింగారము చూడ వచ్చి అసువు ల్గొల్ పోయెడిన్ ప్రాణు లో**

**తులువా! నెత్తురు త్రావు నేత పసు లెందుజూడ ! మోరంత ప్రొ**

**ద్దులు నీకే ఉదరం భరిత్వమను కొందుం పెండ్లముం బిడ్డలున్" –**

ఆ వినుకొండ పొలిమేరను కాపలా కాస్తూ అంకాళమ్మ సత్తి కొలువుండిన చిన్న రాతి దేవాలయం. పగలు గూబలు, రాత్రి పావురాళ్ళు కాపురముండే దేవాలయాన నేతి దీపాలు వెలుగుతూ వుండేవి. ఆ జీర్ణదేవాలయ చీకటిని తరిమి వేస్తూ, మరి ఆ చీకటి ఏమైంది? దీపమే లేని ఆ పేదవాని గుడిశెలోనికి చొరబడి, అక్కడి చీకటిని మరింత చిక్క పరచింది!

ఆ మూగ బొమ్మ చెంత నోరులేని మూడ జీవులు తలలు దొర్లాతూ వుండేవి. ఎముకలు పిండి మూలుగులు ఇరిగి పోయే విధంగా శ్రమించిన ఆ పశువుల కదుపు ఎండ కడుతూ.. యీ రాతి విగ్రహానికి గంధపు పూత పూసి, మొక్కుతున్నది యీ భువనం. దీనికి జాలిలేదు. బొందిలో ప్రాణమున్నంత వరకూ జాలిపడువాడు లేడు. చచ్చి మరు, భూమిన ఒక సత్తియై వెలసిరా మూగబమ్మయై నిలచినదాక.

తన తాత ముత్తాతల కపాలముల నీ మెడలో ధరించిన ఆ మూగ సత్తి ఎదుట అమాయకమైన మేక కూనలు గెంతుతూ వున్నాయి.

ఆ స్థలం మతావేశపరుల విహార భూమి, కాదు, వద్దు అని ప్రబోధించబోయిన బుద్ధుని శిష్యుల కుత్తుకులను నులుమగలరు, పురిటి సింహాలవలె. –

ఈ దృశ్యాలు చూచిన నాన్నగారి హృదయం ముక్కలై ఒకనాడు కసితీర అంకాళమ్మ కన్ను సొట్ట పోయేట్లు రాతితో కొట్టారు. అయినా ఆయన మనసు కలత జెందుతూ వుంది. ఆ మూగజీవుల బలిని చూచి ఆవేదనే 'అవేదన'గా రూపొంది వెలికి వచ్చింది.

**"మరణ మెరుగక యజమాని పిఱంద నడచి**

**హేతిపాలైన లేత చింబోతు కనులు**

**మూత పడలేదు, కన్నీట మునగ లేదు**

**వెలుగు చున్నవి గాజు బిళ్ళల విధాన**

**నిట్టలపుటచ్చెరువు గుక్క వట్టె నేమో"**

అంటూ కవి కలం కన్నీరు కార్చింది.

వాస్తు శాస్త్రాలు చదివి, ఆ శాస్త్రం చెప్పిన విధంగా మానవులు గృహాలు నిర్మించుకుంటున్నారు. మరి ఏ శాస్త్రమూ చదవని గిజగాడు పిట్ట నిర్మించుకునే ఆ గృహం, ఆ తుమ్మ కొమ్మలలో తూగుటుయ్యాల గృహం ఆశ్చర్యాన్ని కలిగించక మానదు.

ప్రకృతిలో విహరిస్తూ  వున్న కవి కంటికి యీ చిత్ర విచిత్రాలన్నీ కనిపించి కవి కలాన్ని నడిపించేవి....

**"తేలిక గడ్డి పోచలను దెచ్చి, రచించెదవు నీవు తూగుటు**

**య్యేల గృహంబు, మానవులకేరికీ సాధ్యము గాదు, దాలోని**

**జాలరులు, అందులో జిలుగు శయ్యలు నంతిపురంబులు ఒప్పగా**

**మేలు భళీ ! పులుంగు టెకి మీదవురా గిజగాడ ! నీడ జా !"**

మా ఇంటికి ఎదురుగా శ్మశాన వాటిక వుంది. అందులో చిన్నవి పెద్దవి ఎన్నో సమాధులున్నవి. ఒక మూలగా ఒక సమాధి గోపురము ఆకారములో దాదాపు 39 అడుగుల ఎత్తుగా కట్టారు. అది ఒక సిపాయిదని నాన్నగారు చెబుతూవుండేవారు. ఆ శ్మశాన వాటికలోని మరొక సమాధిని చూపుతూ యిలా చెప్పేవారు...

నాన్నగారు బాలుడుగా వున్నప్పుడు ప్రతియేడూ ఒక రోజున పండు ముదుసలియైన విధవరాలొకతె వచ్చి, అక్కడ కట్టిన పాలరాతి ఫలకమున్న సమాధిచుట్టూ ప్రమిదలు వెలిగించి, సమాధికి నమస్కరించి చుట్టూ చేరిన పిల్లలకు పండ్లు, మిఠాయిలు పంచి పెడుతూ వుండేది. ఒక సంవత్సరం ఆమె  రాలేదు. ఆమె మరణించి వుంటుందని నాన్నగారు ఊహించారు. మా తాతగారు చెప్పగా ఆమె కథను నాన్నగారు విన్నారు.

గుంటూరు మండలానికి కొత్తగా వచ్చిన ఒక ఆంగ్లేయుడు కలెక్టరుగా వచ్చాడు. ఆయనకు వేట చాలా ఇష్టం. వినుకొండ దాపులో నున్న అడవుల్లో వేటకై వచ్చి, అచ్చట సత్రంలో బస చేశాడు. ఆయనతోపాటు ఒక భారతీయ యువతి కూడా ఆ సత్రంలో వుండేదట. ఆమె అతి సౌందర్యవతి. ఆమెను చూడటానికి ఆ చుట్టు ప్రక్కలవారు సత్రం వద్దకు వచ్చేవారట. అందులో మా తాతగారు కూడా వున్నారు. దొరగారు కొన్ని రోజులలో ఆమెను వివాహం చేసుకోబోతున్నారని అందరికీ తెలిసింది.

ఆ అడవుల్లో పెద్దపులి వుందని విన్న దొర ఒకనాడు దున్నపోతుల బండిపై తన కార్యదర్శితోపాటు మరి నలుగురు మనుషులను వెంట తీసుకుని పులిని కాల్చడానికి వెళ్ళారు. అడవిలో కొంత దూరం వెళ్ళాక ఆయన వెంట వున్న కార్యదర్శి ఒక ఎండిన మొద్దును చూచి పొరపాటున 'అదిగో పులి' అన్నాడు. ప్రక్కనే వున్న మరొకడు తన తుపాకితో మొద్దును కాల్చాడు. అక్కడ పొదలో పొంచివున్న పెద్దపులి ఒక్కదూకున వచ్చి బండిమీద పడింది. మనుషులంతా తప్పించుకొని చెట్లు ఎక్కారు. దొర తుపాకితో కాల్చగా గురితప్పి దున్న తలకు తగిలి అవి మరణించాయి. పులి దున్నపోతులను వదలి దొరమీదపడింది. ఆ పడటంలో దొర చేతిలో వున్న తుపాకి జారి క్రిందపడింది. క్రిందపడిన తుపాకీని తీసుకొనడానికి అవకాశం యివ్వక పులి దొరతో పెనుగులాడుతూ

నమిలివేస్తూ వుంది. దొరకేకలు పెట్టినా చెట్టుమీద వున్న ఒక్కడూ దిగిరాలేదు. తుపాకీ వున్నవాడు తన తుపాకీ క్రిందకు జారిపోవడంతో దిగి రావటానికి భయపడుతున్నాడు. 'రక్షించండి' అంటూ దొర చేసిన ప్రార్థన వినడానికీ ధైర్యం రాలేదు. చివరికి కార్యదర్శి చెట్టు దిగివచ్చి తుపాకీ నందుకొని మరలా చెట్టుపైకి వెళ్ళి పెద్దపులి చెవుకు గురిచూచి కాల్చాడు. పెద్దపులి దొర కలియబడుతూ వుండడంచేత తుపాకీ గుండు పులి తలనుండి దొర తలలోకి దూసుకుపోయింది.

ఈ కబురు విన్న ఆ యువతి దీనాతిదీనంగా విలపిస్తూ వచ్చింది. దొరను, పులిని బండిమీద వుంచి వినుకొండ తీసుకువచ్చారు. ఆ బండిమీదనే ఆ యువతిని కూడా స్పృహ కోల్పోయిన స్థితిలో తీసుకువచ్చారట! పులిని, దొరను కూడా ఒకే సమాధిలో వుంచారు.

ఆ యువతి జీవితాంతం వైధవ్యాన్ని స్వీకరించి, ప్రతి యేడూ ఆ దొర వర్ధంతినాడు సమాధిని అలంకరించి, పండు ముసలియై మరణించింది.

ఈ కథను నాన్నగారు నాతో చెప్పి 'స్మశాన వాటిక'పై ఆ యువతి "కన్నీటి జల్లు ప్రభావం వుంది" అంటారు. ఆ ఇల్లాలి దీనగాథయే...

ఇచ్చోట నే లేత ఇల్లాలి నల్ల పూ

సలసౌరు గంగలో గలిసిపోయె...

అన్న కవి వేదన

ప్రతి మనిషికీ ఏదో ఒక సమయంలో 'దుఃఖం' కలిగి తీరుతుంది. వేల, లక్షల మందిలో ఏ ఒక్కరో సిద్ధార్థునివలె దుఃఖ కారణం నివారణ వెతుక్కుంటూ సర్వ సుఖదుఃఖాలకు ఆలవాలమై సంసారాన్ని, ఐహిక బోగాలాలసరానుత్యజించి, సన్యసిస్తారు. సామాన్య సంసారికి అది సాధ్యం కాదు. లాలస అతనిని వదలదు. అయినా అతడు విషాద గ్రస్తుడైనప్పుడు ఏది సత్యం? అనే సందేహ సందోహాలలో కొట్టు మిట్టాడుతాడు. అప్పుడే మనిషికి ఒక జీవన తత్వం అవసరం.

నేను, మా చిన్నన్న పుట్టుక ముందు ఒక ఆడపిల్ల పుట్టి పాపగానే చనిపోయినదట. ఆ పాప పేరు హేమలత. ఆ పాపను నాన్నగారు చాలా ముద్దు చేశారట. ఆ పాప హఠన్మరణం... ఆయన్ను బహుగా వేధించి...

**"ముదురు తమస్సులో మునిగిపోయిన కొత్త సమాధి మీదపై**

**పొదలు మిణుంగురుంబురువు పోలిక వెల్గుచు నున్న దివ్వె ఆ**

**ముద ముడివోయినన్ సమసి పోవుట లేదది దీపమందు మా?**

**హృదయము సుమ్మి, నిల్పచనియెన్గత పుత్రిక యే అభాగ్యయో!**

**"ఇచ్చోటనే భూములేయి రాజన్యుని అధికార ముద్రికలంతరించే".**

ఆంగ్లకవి థామస్ గ్రే "ఎలిజీ ఇన్ ఎ కంట్రీ చర్చ్, యార్డ్" (Elegy written in a country Church- Yard) క్రైస్తవుల సమాధులు సామాన్యంగా చర్చి వున్న స్థలంలో వుంటాయి. అంచేత శ్మశాన స్థలాన్ని వారు 'చర్చి–యార్డ్' అంటారు.

గ్రే వ్రాసిన యీ గేయానికి జాషువా శ్మశానం పై వ్రాసిన పద్యాలకూ చాలా దగ్గర పోలిక లున్నాయి. గ్రే, జాషువా సమకాలీనులు కాదు. మరో విశేషం జాషువాకు అంత ఆంగ్ల కవితను చదివేటంత ఇంగ్లీషు ఆయనకు లేదు. ఆయన చదువు 8వ తరగతి దాటలేదు. తెలుగు – సంస్కృతం పరీక్ష ఉత్తీర్ణత.

"The boast of heraldry, the pomp of power

And all that beauty, all that wealth ever gave

Awaits alike the ineitable hour

The paths of glory lead but to the grave -

ఆ శ్మశాన స్థలం. వేప, పున్నంగి వృక్షాలతో ఎప్పుడూ చల్లగా వుండేది. ఆ స్థలంలో అప్పుడప్పుడు ఆయన కూర్చోవడం వలననేమో, ఆయనలో జీవితంపై ఒక వేదాంత దృష్టి వుండేది. తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులలో వున్నప్పుడు... నేను అనే దాన్ని "మనకు లక్ష రూపాయలు వస్తే" వెంటనే ఆయన ఖండిస్తూ "ఎందుకు రావాలి? అవసరానికి మించిన ఆశ వద్దు॥ అంటూ నా ఆశను ఖండించేవారు.

కళలు, కవిత్వం కులంచేత దూరంగా నెట్టబడడం, ప్రతిభను ప్రదర్శించుకునే అవకాశాలు లభించకపోవడం... ఎందరో కవులు, కళాకారులు తెరచాటునే రాలిపోయిన ఘటనలు ఎన్నో చూచారు. ఆయన... అప్పుడు వ్రాసిన పద్యం... "ఎంత కోయిల పాట వృధ యయ్యెనో చిక్కు చీకటి నన సీమలందు"..

వినుకొండకు క్రైస్తవ మత ప్రచారకునిగా వచ్చిన దొర కొడుకు నాన్నగారి మిత్రుడు. అతడు కలరా తగిలి హఠాత్తుగా మరణించాడు. ఆ కుర్రవాని సమాధి కూడా ఆ శ్మశానంలో వుంది. అతని పేరు సాచీ. "మనసా నందము పొందుట కన్నను మరియే భాగ్యము కలదన్న" ఆ పాటను ఎప్పుడూ పాడుతూ వుండేవాడట.

ఆ సమాధి ఫలకం మొన్నటి వరకూ చెక్కబడి వుంది. (యీ రోజు ఆ స్థలాలు ఆక్రమణలో ఆ శ్మశానపు నామ రూపాలే లేవు)

తమ ఏకైక బిడ్డను కోల్పోయిన ఆ తల్లిదండ్రులు ఎన్నో ఏండ్లు వరకూ ఏడ్చినారట. వారు ఆ ఊరినుండి బదిలీ అయినా వినుకొండవారు ఎవరు వెళ్ళినా ఆ తల్లిదండ్రులు, ॥మాసాచీ సమాధిని చూశారా" అంటూ అడిగేవారట. నాన్నగారు ఆ కుటుంబానికి సన్నిహితులు, ఆ తలిదండ్రులు ఆరని దుఃఖమే....

**"ఆలోకించిన గుండెయ ల్గరగు నా యా పిల్ల గోరీలలో**

**నే లే బుగ్గల సౌరు రూపతియేనో ! యే ముద్దు నిద్రించెనో**

**యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో**

**యీ లోకంబున వృద్ధిగా దగిన యేయే విద్యలల్లాడునో"**

అని కవి హృదయం చీల్చుకొని వచ్చింది.

నాన్నాగారి స్వీయానుభవాలే చాలా కవితలై వచ్చాయి.

ఒక డాక్టరుగారి ఇంటివద్ద కాలక్షేపం నిమిత్తం ఉద్యోగులందరూ సెలవుదినాల్లో పేకాట ఆడేవారు. అందులో నాన్నగారు కూడా వున్నారు. వారు ఆడే ఆడ "కుదేళ్లు", నాన్నగారికి కాఫీ తీసుకుపోతూ వుండేదాన్ని. ఒకనాడు ఆడే ఆట మంచి రసపట్టులో ఉండగా ఆ డాక్టరుగారి బంధువులు ఒకరు మరణించారని తంతి వచ్చింది. ఆటను మధ్యలో ఆపి లేచారు. అంతే మరలా నాన్నగారు గాని, ఆ డాక్టరుగారు గాని ఆట ఆడలేదు.

మా ఇంట్లో అప్పుడప్పుడు, కాలక్షేపం కొరకు "అద్దు-షరత్" ఆట ఆడేవారు.. పేకాటలోని పిచ్చి...

**"అనుగు బిడ్డడు బావిలోపడియె నన్నా ! లేచి రమ్మన్న దె**

**చ్చున దీమార్గమెకాయటంచు వచియించున్ జూదగాడందు రిం**

**దున సందేహం లేదు; కేవలము మందుండై విషగ్రస్తుడై**

**తనరున్ రంగనులంకరించిన మహాతత్వజ్ఞుడున్, బ్రేల్మిడిన్"**

నాన్నగారి మనసు నలరించిన స్నేహితులను తన రచనల్లో శాశ్వతం చేశారు.

శ్రీ మత్యుంజయుడు నాన్నగారికి చిన్నతనం నుండి మిత్రులు. వారు గుండెజబ్బుతో మరణించారు. ఆయనకు తొమ్మండుగురు పిల్లలు. అందరూ రెక్కలు రానివారు. ఆయన మరణవేదన పడుతూ వుండగా నాన్నగారు దగ్గరే వున్నారు. నాన్నగారిచేత పద్యాలు చదివించుకొంటూ పడుకొని కొంత సేపటికి లేచి "జాషువా! ఇక నీవు ఇంటికి వెళ్ళు, నేను బాగున్నాను" అన్నారు. నాన్నగారు నిజమేననుకొని ఇంటికి వచ్చారు. అర్ధరాత్రి సమయాన ఉదయాన్నే నాన్నగారు ఆయన ఇంటికి వెళ్ళారు. శవదహనపు ఏర్పాట్లు చూసి నాన్నగారు మూగవోయారు!... ఆ మూగబాధ నుండి...

**"ఏడీ నా నిజమిత్ర సత్తముడు శ్రీ మృత్యుంజయాఖ్యుండు నా**

**తోడంబుట్టని యన్న దమ్ముడు, మదాప్తుం డున్నత్యోద్యోగి, నా**

**నాడు న్నా కృతు లాలకించి మది నానందించువా దక్కటా !**

**యేడీ నేడు చరిత్రలో గలసినాడే దుఃఖ కావ్యంబుగన్”**

... వెలువడిన దీ పద్య రూపంలోనున్న గాథ

నాన్నగారి చిన్ననాటి ఆప్తమిత్రుడు తిమోతి. తల్లిదండ్రుల ఇంట దారిద్ర్యం వలన చదువు సాగక మేనమామల ఇంటవుండి చదువుకొనే ఆశతో ఆనాటి కుగ్రామం కురిచేడు చేరుతాడు, పశువులను కాస్తూ ఒకనాడు దగ్గరగా వున్న అడవి పరిసరాల వరకూ తానూ తన పశువులని తోలుకుపోతాడు. దాహము తీర్చుకొనే ఉద్దేశ్యంతో దిగుడుబావిలో దిగి కాలుజారి బావిలో పడతాడు. తోడుగా వున్న ఇతర బాలురు ఇంటికి పరుగెత్తి సహాయం తెచ్చేసరికి తిమోతి మునిగిపోతాడు.

తిమోతి తల్లిదండ్రులు నాన్నగారికి గురువులు. ఆ తల్లిదండ్రులు ఇద్దరూ తమ మరణపర్యంతమూ ఆ బిడ్డను తలచుకొని కుమిలి ఏడ్చేవారట. తన స్నేహితుని మరణము, తన గురువుల పుత్ర ప్రేమ నాన్నగారి మనస్సుపై గాఢ ముద్రను వేశాయి.

నలభై ఏళ్ళ తరువాత నాన్నగారు కురిచేడు వెళ్ళడం తటస్థపడింది. చిన్ననాటి మిత్రుని మరణగాథ మనస్సులో మెదిలి అతనిని సమాధిచేసిన స్థలాన్ని చూశారు. సమాధి నామ రూపాలు కూడా లేవు. తిమోతి పడిన బావిని కూడా చూచారు. సుడులు తిరుగుతున్న బావి నీళ్ళు, శిథిలావస్థలో నున్న ఆ బావి, పరిసరాల తుమ్మచెట్ల నుండి వినవచ్చే కీచురాళ్ళ రొద గువ్వల గుగ్గూలు ఆ ప్రాంతపు ఒంటరితనాన్ని తెలుపుతున్నాయి. కవి మనస్సులో భావం సుడులు తిరిగింది. ఒక్కసారిగా చిన్ననాటి స్నేహితుడు తిమోతి నాన్నగారి మనస్సును ఆవరించాడు.

**“కవినై వచ్చితినీ సమాధి కడకున్, గన్పట్ట దయ్యెం గదా**

**తిమోతి! చెలికాడ!మంద భాగ్యోదయా?”**

అంటూ రాల్చినవే యీ కన్నీటి చుక్కలు...

**“ఏ పల్లంబవై రూపంది ననుచూచి**

**చిరునవ్వుతో సైగచేసినావొ,**

**ఏ దివ్య రత్నంబవై దృష్టికందక**

**యెందుండి యారతు లెత్తినావో**

**ఏ నాలి గాడ్పులో నిమిడి నా కెదురేగు**

**దెంచి మక్కువగా కౌగలించినావో**

**ఏ పుట్టతేనెవై ఏ చెట్టునందుండి**

**యింపార నా కర్ణ మిచ్చినావో**

**మాయ కుపాంబువులలోన మర్మరించు**

**కరుణ కిరవైన యలనాటి మరణగాధ**

**చెలిమిమై యే విహంగ కూజితిముతోడ**

**చెప్పుకొన్నావో ! నా తోడ చెలిమికాడ.**

నాన్నగారికి తన తల్లియెడ విపరీతమైన ప్రేమాభిమానాలుండేవి. ఆమె మరణం ఆయనకు వేదన కలిగించినా వెంటనే పద్యాలు వ్రాయలేక పోయారు. ఆ తరువాత ఒక సంవత్సరానికి గాని కవిత్వం పొంగలేదు. ఒకనాడు ఏది ఆలోచిస్తూ నాన్నగారికి ఆ గదిలో మూలనున్న మా నాయనమ్మగారు ఉపయోగించిన మంచం కనిపించింది. దానితో ఆయన ఆలోచనలు కన్న తల్లిమీదకు మరలినాయి. అప్పుడు కన్నీరు నించుతూ...

**నిరుడీనాటికి గల్గు నీమహిత సాన్నిధ్యంబు నేడక్కటా !**

**మరుగై, నీవు పరుండు మంచమొక్కటే మా కింద ప్రత్యక్షమై**

**పురికొల్పున్ బరితాపవహ్ని ననయcంబున్ గర్భదేశంబునన్;**

**దిరిపెంబెత్తిన జూపు వారెవరు? ధాత్రిన్ నీ శుభాకారమున్.**

మాతృమూర్తికి కన్నీటితో కవితాంజలు లర్పించారు.

అంటరానితనంలోని అవమానాన్ని, దారిద్ర్యంలోని బాధను, తాననుభవించడమే గాక; తన తోటి సోదరులు, బంధువులు జీర్ణకుటీరాలలో వుంటూ రోజూ కూలీపై అర్థాకలతో మాడుతూ బ్రతక లేక బ్రతికే వారిని చూచినప్పుడు కలిగిన వ్యధకు చిహ్నం "గబ్బిలము". వినుకొండలోని కొండపైగల శివాలయాన్ని చూచినప్పుడు అందులో నివాసమున్న అనేక గబ్బిలాలు నాన్నగారి ఊహకు దోహదకారులైనాయి. ప్రతీయేటా జరిపే శ్రీరాముని పెండ్లి ఆర్భాటం చూచి...

**"ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని దుః**

**ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్**

**మెదుకు విదల్పదీ భరతమేదిని ముప్పదిమూడు కోట్ల దే**

**వత లెగవద్ద దేశమున భాగ్యవిహీనుల క్షుత్తు లారునే..."**

దాదాపు 31 ఏళ్ళు ఆయన సాన్నిధ్యంలో పెరిగాను. తండ్రిగా కూతురుకు ఎంత ప్రేమను ఇవ్వగలరో అంతకు రెట్టింపుగా ఇచ్చారు. తన జీవిత గాధను ఆ వెన్నెల

రాత్రులు ఆరు బయట పడకలు పరచుకున్నప్పుడు, ఆ సాయం సంధ్యా వేళల్లో.. యీ కూతురుకు చెప్పి... ఈ వెన్నెల నా కవిత– ఆ వడగాడ్పు నా జీవితం" అంటూ, తెలుగు సాహిత్యపు లోతుల్లోకి తీసుకుపోయి కవితా క్షీరాన్ని ఉగ్గు పట్టారు.

మా అమ్మ 1956లో చనిపోయిన నాటి నుండి నా వివాహం అయేటంత వరకూ... తల్లీ, తండ్రీ, బంధువు, మిత్రుడూ ఆయనే.

**"నాలుగు వర్షముల్ గడిచె నన్ను**
**మెరాయి పరాయి వానిగా**
**లీల త్యజించి పోయి మిగిలెన్**
**రసహీన కవిత్వ వాణియున్**
**దూలెను దేహ దార్ఢ్యము, తనూభవ!**
**తల్లిని తండ్రినైచు, నీ**
**నాలుగు వర్షముల్ మనిషినాడ**
**సుఖింపుమికన్ గృహస్థవై"**
**ఇదీ "తండ్రి దీవెన"**

నాన్నగారి కష్టనష్టాలను జయాపజయాలను, గౌరవాలను మా అమ్మ కూడా సమానంగా పంచుకొన్నారు. నాన్నగారి కష్టానికి వ్యతిరేకంగా ఒక్కనాడు కూడా ఆమె ప్రవర్తించి యెరుగదు. మూర్తీభవించిన సహనం ఆమె. "మెరాయ్ కొంచెం కటువుగా వుంటే నా జీవితం మరోవిధంగా మళ్ళీ వుండేది" అనేవారు.ఆకివీడు సన్మానానికి వెళుతున్న నాన్నగారితో "నన్ను కూడా సభకు తీసుకువెళ్ళండి" అన్నది అమ్మ. "మరోసారి తప్పక తీసుకు వెళ్తాను మెరాయ్! ఇప్పుడు ఏర్పాట్లు సరిగా వున్నాయో లేదో మరి" అంటూ చిన్నపిల్లలకు నచ్చచెప్పినట్లుగా చెప్పి సన్మానసభకు వెళ్ళారు. మూడురోజుల తర్వాత తిరిగి వచ్చిన నాన్నగారు తన జీవిత భాగస్వామిని మరిలేదు అని తెలుసుకున్నారు. అప్పటి ఆయన మౌనం. చూచేవారికి మౌనమే. కానీ "ముదిరిన ప్రేయసీ ప్రణయమూర్తి తిరోహితమైన యంతనే యెదనపు టగ్ని పర్వతము లెన్ని పెఠిల్లున బ్రద్దలయ్యెనో" మరి

ఆ బ్రద్దలైన అగ్నిగుండం నుండి ప్రవహించిన లావా "కొత్తలోకం" లోని మలికోర్కె...

**నీ వటు కాటిదిక్కు పయనించిన నాటి మరుక్షణాన స**

**ర్వావయ సంధిబంధనము లన్నియు వీడె కవిత్వ భారతీ**
**దేవత మూగవోయె సుదతీమణి నాదు కళా స్రవంతియున్**
**నీ వెనుకన్ శ్మశాన ధరణిన్ నిదురించినదో ! సతీమణీ !**

అని వ్రాశారు....

నాన్నగారి హృదయంలో అమ్మ మరణంతో యేర్పడిన గాయం మానలేదని చాలా నాళ్ళకుగాని తెలియలేదు. ఎన్నో ఏండ్ల తరువాత గూడా ఆమె సమాధిని తదేకంగా చూస్తూ వుండిన నాన్నగారి క్షుభిత హృదయం చలించి "మృతులు" అన్న ఖండిక వచ్చింది.

మృతుడైన క్రీస్తు మరలా సజీవుడై లేచిన కథలతో మమ్ము నమ్మించినారు. మీకు బ్రతుకు భిక్ష లభించునన్న విశ్వాసమే దుఃఖితులైన బంధువుల నూరడించి, దుఃఖాగ్నిని ఆర్పుతున్నది. నేటి జీవితులూ చచ్చిపోవుదురు దేవీ! కల్ప కల్పాంతరములు నిద్రవో యెదరు...

**"ఇందు చరిత్ర హీనులయి ఎవ్వరెరుంగక ఆప్తమిత్రులున్**
**బంధువులు కాన్క చేయరొక బాష్పలవంబునునోచనట్టి నా**
**రెందరు ఆనామకుల్ గలరో, మృత్యువు కోరలు చప్పరించగా**
**గ్రమందిన పేదలు ఇక్కడికి మంటి కరాళపు కౌగలింతలన్**

కళాకారుల చేతినుండి వెలసిన కళాఖండాలకు, రాతిబొమ్మలకు లభించినంత గౌరవం ఆ కళాకారులకు లభించడం లేదు. ఆ రాతి బొమ్మలు పూజలలో నిండివుంటే, యీ కళాకారుడు కటిక దారిద్ర్యంతో, గంపెడు బిడ్డలతో, చినిగిన కొంపతో, చింపిగుడ్డలతో జీవితాన్ని సాగిస్తున్నాడు. ఈ దుస్థితిని చూచిన నాన్నగారి కవితా హృది కరిగి ప్రవహించిన వేదనాక్షరములే "కొత్త లోకం" లోని శిల్పిగాథ. ఆ శిల్పిగాధలో అంటారు గదా –

**ఊరికి నుత్తరాన బడియున్నది శిల్పి శరీర మ్ముర్వికిన్**
**భారము గాగ రాపులుగు పంక్తులమధ్య  తదుజ్వలత్కళా**
**భారతి తత్కళేబరము పజ్జ రసజ్ఞుల హెచ్చరించుచున్**
**బోరున నేడ్చుచున్న యది పుట్టెడు దుఃఖములో ననాథయై**

తాను అనుభవించిన ఆర్థిక బాధలకు, అవమానాలను,

తాను చూచిన అన్యాయాలను, చూస్తున్న అసమానతలను తన ప్రతి పద్యంలోనూ ఏదో ఒక రూపంగా చెప్పుకొన్నారు. ఆ క్షుభిత కవితా హృదయం కేవలం సౌందర్యారాధన

చేయలేకపోయింది. అందుకే శిలల అందం, పూలతోటల సౌందర్యం; నీరజ నేత్రుల ముగ్ధమోహన రూపాలు ఆయన కవిత్వంలో మనకు కనిపించవు అంతగా... ఒక అజ్ఞాత కవి అన్నట్లు.....

**Can I admire the Starve great**
**When living men starve at its feet**
**Can I admire the Park's green tree**
**A roof for homeless misery**
**For when I am in those great places**
**I see ten thousand suffering faces**
**Before me stares a selfish eye**
**Behind me creeps a groan or sigh**

**– అజ్ఞాతకవి**

తన యింట మనుమలు, మనుమరాళ్ళు పొరాడుతూ వుండగా ఆ శిశువుల నిర్మల చిరుదరహాసం, తొనికిస లాడే అమాయకత గమనించిన ఆయన కలం నుండి వెలువడింది, గిలకపండు చేత పట్టుకొన్న 'శిశువు' ఖటన వ్రేలు ముల్లోకములు చూచి లోలోన ఆనందపడు నోరు లేని యోగి – కొదమ కండలు దేరుకొను పిల్లవస్తాదు, ఊయల దిగని భాగ్యోన్నతుడు.

**నవ మాసములు భోజనము నీర మెఱుగ క**
**పయనించు పురుటింటి బాటసారి**
**చిక్కు చీకటి చిమ్ము జేనెడు పొట్టలో**
**నిద్రించి లేచిన నిర్గుణుండు**
**.....బట్ట కట్టడు. బిడియాన పట్టువడడు...**
**తనచేతి గిలకపండునకు ముచ్చట సెప్పు**
**పలుక లేదనుచు కోపముసేయు**
**పొరుగింటి ఇల్లాలి సరస చీదర చెంది**

**పరులన్న భేదభావమును చూపు**
**మకరందమునకు సమ్మతి చూపి నోరూరి**

**దరిచేరి రుచుల భేదము తెలియు**

**ప్రతి శబ్దమీను ఉగ్రధ్వని నాలించి**

**కంపించి తల్లిని కౌగలించు**

**దాయలు ఆర్గురు నౌకరు ఇద్దరు తప్ప**

**చేరు కొన్నారలీతని చిత్తవీధి**

**జగతి నీతని జాతకచక్ర మందు**

**బొంచియుండినను అపయశంబో? యశంబో !**

ముంతాజ్ మహల్ కావ్యం వ్రాసిన నలభై ఏళ్ళకు కాబోలు ఢిల్లీ జాతీయ కవి సమ్మేళనానికి పాల్గొని తాజ్‌మహల్‌ను మొదటిసారిగా చూచారు.

ఆ ఢిల్లీ మొగలాయిల నివాస భవనాలను, కట్టడాలను సమాధులను చూచి–

**"పసిడి రేకులతో ముఖ ద్వారములకు**

**మెరుపు లీనెడు దొడ్డ అక్బరు సమాధి**

**నరసి అచ్చెరువంది, తదంతికమున**

**పూరి గుడిసెలు జూచి వాపోయినాను"**

సమాజంలోని మంచిని చూచి ఎంత ఊరట చెందేవారో; పేదరికాన్ని దోపిడీని చూచి అంతకంటే చలించిపోయేవారు నాన్నగారు.

ఒక ముద్ద అన్నం తిని యజమానిపై కొండంత విశ్వాసాన్ని నింపుకొని పూజించే కుక్కలు ఆయనకు మంచి మిత్రులు,

ఆయన పెంచిన కుక్కలలో 'జాకీ' కుక్క అత్యంత ప్రేమను గౌరవాన్ని సంపాదించుకున్నది.

ఆ కుక్క పద్నాలుగేళ్ళ సేవచేసి మరణించగా –

దానిని ఎక్కడ సమాధి చేశారు?

**"దీనులు అనామకులు కుడువ తిండి యెఱుంగక యే యుగాననో**

**మేనులు వాసి రాపులుగు మేసి త్యజింప విశీర్ణ శల్యసం**

**తానములై రహింప ఎడదన్ కదలించెడు వల్లకాటికీ**

**శాను దిశన్ మదీయమగు జాకికి మున్ను సమాధి జేసితిన్'**

పత్రికలో ఒకనాడు ఒక కథ చదివారు. ఔరంగజేబుని ఏకైక కుమార్తె కవయిత్రి జేబున్నీసా కథ. ఆ కథ ఆయన హృదయాన్ని తాకింది.

మొగలాయి చక్రవర్తి ఔరంగజేబునకు కుమార్తె జేబున్నీసా. ఆమె కవయిత్రి, ఆ చక్రవర్తికి సామంత రాజుకు జేబున్నీసాల మధ్య ప్రేమ పుష్పించింది.

ఒకే ఒకసారి ఇద్దరూ మొగల్ పూల తోటలో కలుసుకున్నారు. అంతలో తండ్రి ఔరంగజేబు తోటలోకి ప్రవేశించాడు. అది గమనించిన జేబున్నీసా ప్రియుని, అక్కడే నీళ్ళు కాసే గంగాళంలో కూర్చుండజేసి మూత వేసింది. చక్రవర్తి అది చూచాడు. తన సైనికుని పిలిచి ఆ గంగాళంలో ఏమున్నాయని అడిగాడు. "నీళ్ళు మహారాజా!" జవాబు.

"అయితే వాటిని కాచు"! చక్రవర్తి ఆజ్ఞ.

తన ఎదుటనే తన ప్రియుడు మౌనంగా కాలి, భస్మమై పోయినాడు.

జేబున్నీసా ఏమైంది?–

తనకై మౌనంగా బలియైన తన ప్రియుని కోసం తాను జీవిత వైభోగాలను, మొగలాయిల సువర్ణఖచిత మహళ్ళను త్యజించి సన్యసించింది.

ఆమె తల పోతలన్నీ అతనితోనే భస్మమైనవి. భావి కుటుంబం గాలిలో కలసిపోయింది. దురంతమైన దుఃఖమే ఆమెకు శరణ్యం. "నాకై తప్తమైన నీ మూర్తికి, అజరామరమైన నీ త్యాగానికి నన్ను నేను అంకితం చేసుకుంటున్నాను" అని ఆ ప్రమాణానికి శాశ్వతత్వాన్ని కల్పించి, ప్రేమలోని ఔన్నత్యాన్ని నిరూపించింది.

అది జాషువా కలం నుండి ప్రేమ సన్మానమై కావ్యహారమై జేబున్నీసాను అలంకరించింది. –

**"మొగలు రాజన్యుని పగడాల మేడలో**
**వసియింప దింకనీప్రణయలక్ష్మి**
**ఢిల్లీ నవాబుల మల్లెతోటల వంక**
**పరికింప దింక నీవలపు చిలక**
**ఔరంగజేబుని అపరంజి గిన్నెలో**
**భుజియింప దింకనీముద్దులాడి**
**పాదుషా నగరిలో పట్టుపాన్పుల మీద**
**పవళింప దింక నీ పాదదాసి**

అక్బరాది పితామహులు అదివసించు పాత గోరీల కడ నిన్ను పాడుకొనుచు తిరుగుచున్నది నీ తరితీపులాడి అగ్నిలో నిన్నుపాసించు త్యాగమూర్తి –

మహాత్మాగాంధీ అహింసాత్మక సిద్ధాంతాలు జాషువా మనస్సులో "మొగ్గలు తొడిగి, ఆయన కలంలో వికసించి విప్పారినాయి. ఒక మతోన్మాది చేతిలో హత్య గావింపబడి –

**కలకల నవ్వెడు తాతయ**

**శిలయై, కలయై యనంత శిల్పంబునకున్**

**బలమిచ్చి మాయ మయ్యెన్**

**కుల మతతత్వములు పుంజుకొని తలయెత్తన్.**

బాపూ మరణం జాషువా హృదయాన్ని కాల్చివేసింది. అప్పుడే ఈస్వరాజ్య రథానికి సారథి ఎవరా అని ఒకానొక భావం సుడులు తిరిగి "స్వయంవరం" కావ్యమై వెలువడింది.

**ఇదియే పోవడ మా జగజ్జనకా**

**రానే రావుగా – ముది తాత ప్రతి రక్తం బిందువు**

**గా మా పూర్వ స్వరాజ్యర్ధమై కొదలేకిచ్చిన**

**నీ విషాద మరణాగ్నుల్ గాల్చె ముల్లోకమున్**

తాత ఇచ్చిపోయిన స్వతంత్రతా శిశువుకు ఊరూరా ఉత్సవాలు, తిరునాళ్ళు చేసి దేశవాసులు మురిసిపోయినారు. ఒకవైపు స్వరాజ్య కుమారి జన్మోత్సాహము, మరోవైపు తాత మరణము, తాత మరణానికి గుండె కరిగి పోయేటట్లు ఏడుస్తున్న బిడ్డకు ఆనందం కల్గించటానికి తాత బొమ్మలు చూపి ఓదార్చినారు. మడత భజనలతో కన్నులు తుడిచినారు.

ఆ బిడ్డ అందరి బిడ్డ వలె కాదు అందాల స్వరాజ్యబాల, అవినీతి కొంచెము కనిపించినా పాలు తాగుటమాని ఏడుస్తుంది. కలుషం లేని మాట, గట్టితనం, వంకలేని నడవడి బలంగా పొందింది. అహింస ఆమెకు వజ్రాల అలంకారాలు. ఆమె వదనమున బుద్ధుడు, క్రీస్తు, గాంధీ, కనబడేవారు. బాల పనిలో ప్రవేశించి దేశ సౌభాగ్యమునకు కావలసిన పద్ధతులను నేర్చుకొండి. బాపూ వ్రాసి పోయిన ధర్మ సూత్రాలు చదివి తన చెలికత్తెలకు నేర్పుతుండేది. చిలిపి సిద్ధాంత భాష్యాలను చీదరించు కొనేది.

పూర్వపు భారత విషాద రక్త గాధలను, చదవదు. అభాగ్యులు కాలు పెట్టలేని దేవాలయాలకు వెళ్ళదు. అసమానతలను నిండిన సంఘం అనే సింహాలు చేయు, గర్జనలకు బెదరదు. పెద్దల నాటి పిశాచ ధర్మాలను విశ్వశించదు.

ఈ దేశాన తాండవించే దారిద్ర్యం, ఆమె మనస్సును బాధిస్తూ ఉండగా తాను మృష్టాన్న భోజనమును ఆశించదు. చింకి పీలికలు కట్టుకున్న కాంతలను చూచి, చీని చీనాంబరాలు ధరించలేదు. పరుషమైన వాక్కులు పలుకదు. పొరుగు బాలికలను ఆడిపోసుకోదు. ఎంత ప్రళయం వచ్చినా మనస్సు చలింపనీయదు. ఆమె బాల్యం గడచి కన్య అయినది.

యావత్భారత గుణాభిరాముడ, టువంటి వరునకై కులమత ఎన్నిక పట్టింపులేక బాలికకు స్వయంవరం ప్రకటింపబడింది. ఆ స్వయంవరానికి కన్యను వరించడానికి ఎందరో మూగినారు. మూడు రోజులు చెరసాలలో గడిపినవారు. పోలీసు లాఠీ దెబ్బలకు కాయలు కాచినవారు. రాట్నాలుకొని, ఇంట్లో సతీమణిపై పడవేసి గాంధీ టోపితో తిరిగేవారు. కులానికి దెబ్బ తగలనీయకుండ బ్రతికేవారు ఇలాగా, దొరలు, దొంగలు పెండ్లి కొడుకులై వచ్చారు.

స్వరాజ్యలక్ష్మి చెలికత్తెలు, ఆమెకు ఇరువైపుల నిలబడి ఆ వచ్చిన పెండ్లికొడుకుల చరిత్ర వివరించు చుండెను. "అదిగో అతను అహర్నిశలు దైవపూజకు ధనం వెచ్చించి చేసిన పాపం నశించి పోయినదని, ఆనందించు మహానుభావుడతడు".

'తెల్లదొరలు పాలన చేయునపుడు ఇతను మంత్రి పదవి సాధించుకొని తన వారికి, తన కులపు వారికి ఉద్యోగమునిచ్చి ఇతరులకు అన్యాయం చేసిన ఘనుడితడు'.

"అదిగో శాసనాల అటకాయింపులను చెవులాడించి బ్లాక్ మార్కెట్ చేసి నల్లధనాన్ని కూడపెట్టి ఎన్నో సంసారాలు కూల్చిన నల్ల వర్తకుడితడు"

"అదిగో చెవుల రత్న కుండలాల కాంతులు విరజిమ్ముతూ కూర్చున్న వాడు దేవాలయంనకు పూజారి".

"అదిగో అతడు మానవుడై వుండి ఎదుటి మానవుని గుర్తుపట్టలేని మూఢ భక్తుడు లోకం ఏమైన వీనికి పట్టదు".

అదిగో అతడు స్త్రీ విద్యా వ్యతిరేకి. ఇతడు వైకుంఠమును అరచేత చూపు పీఠాధిపతి...

**"మతమొక కంచుకోటవలె ఆనవ దుష్కృతి కప్పిపుచ్చి, యం**
**చిత మగు ఐక మత్యమును చిందర వందర చేసి చిన్నదై**
**వతముల ఈని సంకుచిత భావములం పురికొల్పి స్వార్థ భూ**
**షితులగు పీఠకాపతుల జీవిత యాత్రకు తోడు సూపెడిన్ –**

స్వరాజ్యలక్ష్మి యీ అనేక చరిత్రలను వినివేదనా భరితయై వేడి ఊర్పులు ఎగయ, జలజల అశ్రువులు జార, స్వరాజ్య పుష్పహారమును నలిపి, వివాహమంటమును పడవేసి, దుఃఖముతో, నిరాశతో ఆ వివాహవేదిక తొలగిపోయింది. ఆ కన్యారత్నం...

బాపూ తన వీలునామాలో వ్రాసిన, మూర్తికై వెదుకుచూ నేల నాలుగు చెరగులు నడిచింది. చెలికత్తెలు తోడురాగా, దేశాటనము చేయుచూ.

కాశ్మీరము, పంజాబ్, ఆవల బంగాళము, దక్షిణోత్తర, దిశా పర్యంతము, జనపదాలను, పల్లెలు, పట్టణాలు, తిరిగి అందందు గల చిత్ర చిత్ర విషయాలను, ఆ కన్య కామటి అనుభవ పూర్వకంగా అవగాహన చేసుకున్నది. కొన్ని విషయాలు ఆ యువతి హృదయాన్ని వేదనతో బరువెక్కించినవి. కొన్ని విషయాలు ఆమెకు ఆనందాన్ని కూర్చినవి.

ఆ లుంబినీవనం ఆలపించుతున్న వృద్ధుని జాలి గుండెకు ఆమె నమస్కరించింది. రాణాప్రతాపుడు తిరిగిన ఆరావళి కొండ గుహలను చూచి ఆ వీరుని కష్టాలు తలంచి కలత చెందినది. ఆ శివాజీ వీరుని కత్తి శాత్రవుల ఉసురు తీసిన చోట ఆమె మేను గగుర్పొడిచింది. జలియన్‌వాలా బాగ్ దేశం కోసం ప్రాణాలు అర్పించిన వారికై కన్నీరు విడిచింది. సతీసహగమనాన్ని మాన్పి స్త్రీకి ప్రాణబిక్ష పెట్టిన రాజా రామ్మోహనుడు తిరిగిన స్థలాలకు అంజలి ఘటించింది.

భోను బద్దలు కొట్టి బోసు బెబ్బులి పిల్లలా కన్న భూముని వాసిచన చోటు, గంగాధరుడు, లాలా లజపతిరాయ్, చిత్తరంజన్‌దాస్ మోతీలాల్ నెహ్రూ ఈ జాతీయ వీరులు తిరిగిన స్థలాలు పరికించి ఆ బాల గర్వీత అయ్యింది. అట్లు ఆ కన్యక దేశభక్తి హృదయాన పొందు పరచుకొంటూ, దేశవాసులపై అభిమానాన్ని పెంచుకొంటూ, కూటికి, గుడ్డకు నోచుకోలేని వారు ఎండకు వానలకు ఓర్చి స్వరాజ్యం ఏదో వస్తుందని ఆశతో,– ఆ బొజ్జలు నిండిన వారి పంచన జీవితాన్ని గడుపుతున్న అభాగ్యులను చూచి, ఆ స్వరాజ్యలక్ష్మి కన్నులు తడిసినవి. రాచ మర్యాదలు ఎరుంగని ఆ పేదలు చింకి పీలికలతో అర్ధ నగ్న శరీరాలతో పిల్లలు, తల్లులు, ఎదురేగి, నమస్కరించకుండానే, అనేక ప్రశ్నలు వేయజొచ్చిరి.

హాలము రవ్వంత సోకినంతనే అన్నపు రాసులు కుమ్మరించు భూతల సతి, అన్నపూర్ణ ఉండగా, వస్త్రహీనమైన ఈ దారిద్ర్యము, ఈ దయనీయ స్థితి ఆ కన్యక అంతరంగాన్ని వేలార్చి వేసింది.

దేశ స్వాతంత్ర్య దినోత్సవ శెలవు నాడే పెరటి బేరాలు సాగించి ధరలు పెంచే మాయ మార్కెట్లు వారి గమ్మతు చూచి –

అవినీతి పెచ్చరిల్లదని చెప్పుతూ అతి అవినీతికి పాలుపడే అటు నిటుగాండ్రు ఈ ప్రపంచానికే కుంటకులని –

అధిక ఐశ్వర్యము చేత మానవత్వాన్ని మరచి, దయలేని వారిని –

ఆచారమనే కవచము చాటున తెరచాటు బేరాలు జరిపే వారు –

పట్టభద్రులై పదవోన్నతి బడసి, సామాన్యుల స్నేహానికి దూరమై చెడినవారు, తాత తండ్రుల భుజా దర్పాలు వర్ణించి అధికార హోదాకై పీకులాడేవారు.

నిన్న స్నేహం చేసి నేడు విరోధం తెచ్చుకొను చిత్ర విచిత్ర ప్రకృతిలోకల వారందరిని చూచి – వికట విభిన్న వేషములు వేసి, తిరిగే రసహీన జీవిత పరిస్థితులను చూచిన భామ ఆత్మ కలచి వేసింది.

అవిద్య, అమాయకత్వం తాండవం చేస్తూ, అమాయక ప్రజల విజ్ఞాన చైతన్యాలను, ఆహుతిగొనే మూఢ నమ్మకాలు ఒక వంక–

భగవతపూజ నెపమున అగణితమైన జంతు హింస మరో వంక, స్వార్థపరమైన కపట రూపములు దాల్చి సకల దిక్కులు నాట్యము చేయుచుండగా, కంటతడి పెట్టుకొనుచున్న, గాంధీ మహాత్ముని విగ్రహం చూచి, ఆ కోమలాంగి మనస్సు కుంగిపోయింది.

తాను తిరిగి చూచిన అనేకానేక దుస్సహ దృశ్యాలు, శాంతి పావురం గొంతు నులుముచున్న దృశ్యాలు, ఆమె మనస్సును కోత కోయు చుండెను. నిరాశ, నిస్పృహలు ఆమెను ఆవహించినవి. అప్పుడు ఆమె చెలికత్తెలు, స్వరాజ్య భామనూరడించి, “శాంతి రాకపోదు, అభ్యుదయం అడుగు ఆగదు నెచ్చలి ! కాలం గారడీ వాని వలె కల్పన చేయును. నేటి ప్రజాపతినిధులు నిన్నపాత కేడీలు, లతాంగి! ఈనాటి దేశం ఒకనాటికి మెత్తనై నిలవకపోదు”.

చక్రవర్తినంతటి వానిని భృత్యునిగా చేసి, మిడిసి పాటున నున్న చెడుగును తెల్పి బంట్రౌతు నొకనాడు పరిపాలకునిగా చేసి అధికార గర్వ మద్యమును ఇచ్చి రూపవంతులను కూరుపవంతులుగా చేసి వైరాగ్య బీజములు పాదు కొల్పి, మసి బొగ్గులను వజ్ర మణిరాసులుగా చేసి, తీపి కోర్కెలకు పందిళ్ళు అమర్చి, మంచిని చెడ్డగా, చెడును మంచిగా చేసి నిముష వేగాశ్వములను ఎక్కి ఈ సృష్టిపై పెత్తనము చెలాయించుచున్న కాలముకన్న తుంటరి కానరాదు.

దేశ సంచారం చేసింది స్వరాజ్యలక్ష్మియే, హృదయం మాత్రం జాషువాది.

* * *

# ఫిరదౌసి

ఆనాటి సాహిత్య మాస పత్రిక "భారతి" జాషువా కవిత్వం ప్రచారం చేసింది భారతిలో ఒకసారి "ఫిరదౌసి" కవి జీవిత చరిత్ర సంక్షిప్తంగా పడింది. ఆ కవి కథ జాషువాను కదిలించి వేసింది. కవిని లెక్కచేయని చక్కవర్తిని, కవీ లెక్కచేయలేదు చక్రవర్తిని, రాచధిక్కారం చేశాడు కవి, "ఫిరదౌసి" కవి ప్రదర్శించిన ఆత్మాభిమానం తలవంచని ధీరోదాత్తత జాషువ నరనరాన ఆత్మ గౌరవ కాంక్ష పులకలెత్తింది... కలం నుండి బయలు వెడలి ఉవ్వెత్తున ఎగిసి పడిన కవి స్వేచ్ఛా కాంక్షయే "ఫిరదౌసి" కావ్యం.

పద్దెనిమిదిసార్లు గజనీ మహమ్మదు భారతదేశం పైకి దండెత్తి వచ్చాడు. నగరాలు, గుడులు, దోపిడీ చేశాడు, రత్నాలు, బంగారం, డబ్బు బస్తాలతో మోసుకుపోయినాడు.

పద్దెనిమిది సార్లు దండెత్తి వచ్చి తెరచిన తలుపులు నుండి దోచుకుంటున్న, ఆ బందిపోటు చక్రవర్తి ధైర్యానికి, వీరత్వాన్ని మెచ్చుకుంటూనే... భారతి ప్రజల ఆశక్తతను, పిరికితనానికి మరోవేపు కించపడేవాడు జాషువా. ఎందుకు ఎదిరించి యుద్ధం చేసి వాడిని తరిమికొట్టలేకపోయిందీ? అని. ఎప్పుడూ ఒక చారిత్రక విషయాన్ని నాతో చెప్పుతూ వుండేవారు నాన్నగారు –

"భారతదేశంపై మొదటిగా దండెత్తిన మహమ్మదీయ రాజు సైన్యం, ఒక పెద్ద గుట్టకు ఒక వేపు.. భారతదేశ సైన్యం మరోవేపు రాత్రిపూట నిడిది చేసి వుంది. ఆ రాత్రి ఆ రాజు గుట్ట ఎక్కి భారత సైన్యాన్ని పరిశీలించాడు. సైన్యం విడిది ప్రదేశంలో అనేక చోట్ల చిన్న చిన్న మంటలు కనబడినాయి అతనికి – మంత్రిని ప్రశ్నించాడు అన్ని మంటలేమిటి?

మహారాజా ! ఈ దేశం అనేక కులాలతో, మతాలతోనిండి వున్నది. ఒకరు వండిన అన్నం మరొకరు భుజించరు, ఒకరు తాకిన నీళ్ళు మరొకరు ముట్టరు. మనిషి మనిషికి మధ్య 'అంటు దోషం' వుంది అని మంత్రి జవాబు.

'అయితే వీరిని జయించడం చాల సులభం!' చక్రవర్తి సంతృప్తిగా అన్నాడు.

గజనీ మహమ్మదు అభూత పరాక్రమశాలి, మాంచి సైనిక బలంతో పదునెనిమిది సార్లు హిందూదేశంపై కత్తిదూసి, చిక్కటి రక్తంలో మొత్తం దేశాన్ని తడిపి, సోమనాధ దేవాలయాన్ని కొల్లగొట్టి అనేక రత్న రాసులను దొంగిలించాడు.

బంగారు నాణేలను బస్తాల, కూర్చి ఏనుగులపైనా, ఒంటెల మీద, రత్నాల గోతాలు, వజ్రాల మూటలను గుఱ్ఱాలపైన ఎక్కించి, తనతో పద్దెనిమిది మంది విజయరంభల గొనిపోతూ ఆ మతోన్మాది, తన పాప పరిహారార్ధం గంగాజలంలో నెత్తుటి కత్తిని కడిగికొని మరీ తరలివెళ్ళాడు గజనీ.

ధనాఢ్యుడైన గజనీ ఆ పట్టణాన మేడలు, మసీదులు, విజయ స్తంభాలు కట్టించి, తన వీర చరిత్రను బంగారు అక్షరాల్లో చెక్కించుకొని తృప్తి పడ్డాడు.

**భారత క్షోణిగల్గు దేవస్థలములు**

**చెదిరి గజనీ పురాన మసీదులయ్యె**

**ఇప్పటి మసీదులు ఏ రూపమెత్తగలవో**

**కాల మెరుగను ధారుణీ గర్భమెఱుగు**

హిందూవుల బాహుబలాన్ని ఆశ్రయించి బ్రతుకు ద్రవ్యమంతా తురుకరాజుని చేరి కాపురము చేస్తున్నది ఆలోచించి చూడగా 'సిరి చాలటక్కరిది' అని నిరూపించుకున్నది.

తను కావించిన యుద్ధ యాత్రలు, తన విజయ గాధలకు ఒక అమరత్వం కల్పించాలనే బలమైన కోరిక చక్రవర్తికి కలిగింది. పారశీక కవి తిలకుడు "ఫిరదౌరసి' కవిని రాజస్థానానికి ఆహ్వానించాడు చక్రవర్తి.

"ఓ కవి వర్యా! నీ సుకవి తోజ్జ్వల వాఙ్మయ పుణ్యభూమిలో నాకు కృతి ప్రదాన సదనంబు రచింపుము".

కవిని కన్న తల్లి గర్భము ధన్యమైనది. కృతిని పొందినవాడు మృతుడుగాడు.

**"క్షణము గడచిన దాని వెన్కకు మరల్ప**

**సాధ్యమే మానవునకు ఇలా చక్రమందు**

**దాటిపోయిన యుగముల నాటి చరిత**

**మరల పుట్టింప కవియ సమర్ధుడగును."**

సృష్టికి ప్రతి సృష్టి సల్పగల ఓ కవీ! ఒక్కొక్క పద్యమునకు ఒక్కొక్క బంగారు రూక ఇస్తాను. మక్కా మసీదుపై ప్రమాణం చేసి నిండు సభలో నీకు మాట ఇస్తున్నాను.

ఆ చక్రవర్తి ప్రమాణం విన్న "ఫిరదౌసి" కవికి అద్భుతావేశం శరీరమంతా అలుముకొన్నది.

"ఫిరదౌసి" ఆమరునాట నుండే గ్రంథ రచనకు ఉపక్రమించినాడు.

పారసీక గ్రంథాలయ భాండారముల శోధించి తీయని పదాలు సంతరించి, వ్యంగ్య రచనకు కావలసిన పద ముత్యాలను కూర్చుకొని, లలితములైన అలంకారాలను; దిరిశెనపు పూవు వంటి మృదు మధుర శైలితో 'షానామా' అనే పేరుతో గ్రంథ రచన సాగించాడు ఫిరదౌసి.

కవి హృదయాన సోకని తలపులు, వాని కను సన్ననలో తలవంచని ఉపమాలంకారాలు, అతని కలమున కులుకని పదాలు ఆనాటి వాఙ్మయమున ముందుకు కూడా లేవు.

కవి అనేక రూపాలెత్తగలడు. సార్వభౌముడుగాను ఒక పరి, మరొక సారి ధీరుడగును, ఇంకొక సమయాన భిక్షుడౌతాడు, దు!ఖితుడూ కాగలడు. నిత్య సంతోషి కాగలడు... సత్కవి ధరించరాని పాత్రే ఉండదు. ఇలా నానా పాత్రలు ధరిస్తూ, రాత్రింబగళ్ళు కవితా సాగరాన మున్కలు వేస్తూ ఫిరదౌసి కవి తన పరిసరాలనే మరిచిపోయినాడు. ఆతని సతి కవికి సకల సౌకర్యములు కలుగజేస్తూ కవితా లోకాన్ని మరింత అలంకరించింది.

కాల చక్రంబు గంభీర గమన మందు ఎన్నో చిత్రములు దాగి వుంటాయి. మనిషికి రాబోవు చిత్రములు తెలియవు. తెలియరాదు కూడా...

ఒకనాటి ఉదయాన... "మన ముద్దు బిడ్డ మూడు సంవత్సరాల చిన్నవాడు, కాలు సేతులుండి కదిలే ముద్దు, యింక మనకు లేదు" అంటూ పుట్టింట నున్న భార్య లేఖను అతను చదువుకొన్న క్షణాన విపుల సుఖైక సౌధము గుభిల్లున అతని తలపై కూలింది.

కొడుకు మరణం కవి హృదయాన్ని కోసి వేస్తున్నది. అతడు అన్న పానీయములు ముట్టక, కృశించి పోతున్నాడు. కాలం ఆగుతుందా? ఆగదు! కాల పురుషుడు దిన దినాకారుడై భావుకుని లీల అతనిని ఓదార్చిపోతూనే వున్నాడు. సర్వ దుఃఖ ఉపశమనానికి కాలమే ఔషధము.

మరో రెండు సంవత్సరాలకు చక్కని కుమార్తెను కని, ఆనందించి నాడు, కొడుకులేని విచారాన్ని తొలగించుకొని.

నూతనోత్సాహం ఆవహించగా కవి మరలా గ్రంథ రచనకు పూనుకొన్నాడు.

దివారాత్రాలు నిద్రా సుఖాన్ని మాని గ్రంధ రచన సాగిస్తున్నా కవి రక్తము ఖర్చైపోయి 'పండాకు' లా ఒడలి పోయినాడు.

**ముదురు కోయిల కంఠమున నివాసము సేయు**
**కొసరింపుఁ గూఁతల గుట్టు దెలిసి,**
**ప్రతిపుష్ప గంధగర్భముఁ జీల్చికొని వచ్చు**
**పిల్లగాడ్పుల జన్మవృత్త మరసి,**
**మేఘంబుతెరచాటు మెఱపుబోగముసాని**
**మోసగింపుల యర్ధమును గ్రహించి,**
**శరధినాయకుని క్రొన్నురువు పిల్లల, తీఱు**
**బడిలేని యాటలభావ మెఱింగి**

**ముగ్ధ మోహన సౌందర్య పూర్ణయైన**
**ప్రకృతిరమతోడ స్నేహభావమున మెలఁగి**
**ముప్పదేఁగడులు సర్వాంగపుష్టి మెఱయఁ**
**గబ్బము రచించె పిర్దౌసి కవివరుండు.**

"షానామా" కావ్యమును సంపూర్తిచేసి, మహారాజును దర్శించె. నృపతి గడ్డము దువ్వుకొనుచూ మందహాసము చేస్తూ "భళీ', సుకవి శేఖర రేపు సభలో పండితుల సమక్షమున చదువుము" అని ఆజ్ఞాపించినాడు.

ఆ మరునాడు, హేమ సమ్మిళితమైన కీర్తిని పొందుతాననెడి ఉత్సాహం, కౌతూహలంతో, సిగ్గుతో తలవంచుకొని స్వయం వర సభకు వచ్చె, సుందరి వలె, గ్రంథమును తీసుకొని, కవి సభను ప్రవేశించాడు.

'కరి మింగిన వెలగపండు' సామెతను నిజం చేస్తూ, రాజు కను సన్నల మెదులు ఆజ్ఞలకే సలాము కొడుతూ ఆషాడ భూతులు వంటి, పండితుల గర్వపు దృష్టి కిరణాల నుండి తప్పించుకొంటూ సభను అలంకరించినాడు కవి.

కృతిపతి సింహాసనం అలంకరించగా – చక్రవర్తి అనుమతితో గ్రంధ పఠనము ప్రారంభించాడు ఫిరదౌసి.

**కంపంబు గదుర చెంగట నిల్చు నొకసారి**

**యుక్కు పుప్పొడిరాలు యుద్ధభూమి**

**పులకలుప్పొంగఁ గన్నులఁ గట్టునొకసారి**

**చెడుగురాజుల యేలుబడులబొమ్మ**

**ఆనంద మొదవఁ బ్రత్యక్షించు నొకసారి**

**మగువల కడకంటి మంత్రశక్తి**

**దయ నిండిపారఁ బ్రదర్శించు నొకసారి**

**బక్క చిక్కిన పేదవాని బ్రతుకు**

**సిన్నితంబైన కవి మనస్సున వసించు**

**కల్పనాశక్తి బహు విధ గతుల మెఱయ**

**పాదుషాతోడ నతని దర్బారుసీమ**

**నంచితానంద జలనిధి ముంచి తేల్చె.**

ఆ కావ్య పదాల పొందిక, గుర్రపు నడకకు దీటైన గంభీర పద్య గమనము, రస సంపద, సభ యావత్తునూ కదిలించి, రసానంద సాగరాన ముంచెత్తింది.

ఆ చక్రవర్తి అరమోడ్చిన కనుల, ఆనందపులకితాంగుడై నాడు–

మూడు మాసాలు ఆ సభను ఒకానొక రాజ ఠీవితో, ఏలి... గ్రంథ పఠనము సమాప్తము చేసి ఫిరదౌసి స్వగృహం చేరాడు.

“తత్ఫలితమున... చేసిన బాస తొలగి... చక్రవర్తి వెండి నాణేలు కవి ఇంటికి పంపె నరపాలుడు – పండితులేమి చెప్పిరో?!”

చక్రవర్తి కూడా సామాన్య మానవుడే కదా... అతనిలోనూ ఈర్ష్యా ద్వేషాలు, క్రోధ, మద మాత్సర్యాలు సహజమే. అరిషడ్వర్గాలకు అతీతుడైతే, ఋషి అవుతాడు. రాజు ఋషి కాలేదు కదా.

కుకవులు చెప్పిన ఈర్ష్యా బోధకు రాజు లొంగిపోయి... ఫిరదౌసి శ్రమను అపమాన్యం చేశాడు. కవితా కన్యను కొనదలచినాడు. కవి చక్రవర్తి తురక భూదవుడు మోసం చేసినాడు. ఆ దురంత దుర్భర అవమానాన్ని కవిని కాల్చివేయగా....

**ఎన్నో కొండలు గుండెలోఁ గరఁగిపో**

**యో ˉ వార్ధి సంతానముల్**

**గన్నీరయ్యె సమస్త లోకము నిరా**

**కారస్థితి బొల్చెను**

**త్పన్నంబయ్యె విషాదమేఘపటల**

**ధ్వాంతౌఘమాశాలత**

**ల్సున్నాలయ్యె నగాధకూపజలరా**

**సుల్ దోఁచె పిర్దౌసికిన్.**

తన హృదయాన్ని కాల్చివేసిన ఆ ధనాన్ని తిప్పి పంపుతూ కవి, చక్రవర్తికి ఒక లేఖ పంపాడు.

"ఓ సుల్తాను మహమ్మదూ! మెరుపు తీగలు నమ్మి, ఒక ఆశాసౌధాన్ని నిర్మించుకున్నాను. అది గాలిమేడయై నా సర్వస్వమును దొంగిలించింది. ఈ దుఃఖపూరిత అంధకారంలో వృథాగా నిల్చిపోయాను. నీ కత్తి మనుష్యుల రక్తాన్ని పీల్చి జీవించినది. నీది రాతి గుండె. అట్టి నీకు నా కవితా కన్యను దారపోయడం నేను చేసిన పాపం. ఆ పాపం నన్నే చుట్టినది.

ఇంతటి దుఃఖంలో యిక నేను కవిత్వం వ్రాయలేను. ఇక విషాద గీతాలు వ్రాసుకొనుటకే నా కలాన సిరా మిగిలి వున్నది. ముప్పదేళ్ళు నా శ్రమకు మిగిలినది నిరాశ.

ఒక్కొక్క పద్యానికి నా శరీరంలోని ఒక్కొక్క రక్తపుబొట్టు ఖర్చుపెట్టాను. అంతా బూడిదలో పోసిన పన్నీరైంది. చక్రవర్తివి, కులీ నుడవు. రాజు యీ విధంగా అసత్యాలు పలక తగునా!

అల్లా భక్తుడవు. 'అల్లాతోడు' అని పలికినావు. కానీ, వెండితో నా కవిత్వాన్ని కొనదలిచిన టక్కరివని నాకు తెలియదు.

ఓ రాజా! సత్యం పలికి, దానిని నిలిపినవాడే మనిషి. వాడే ధన్యుడు.

నీవు బానిసవు. నీ కీర్తి నిలప చక్కని కీర్తి సౌధాన్ని నిర్మించి, నీకు శాశ్వత కీర్తిని సంపాదించి పెట్టాను. కానీ నీవు... నాపై నిప్పులు గురిశావు. ఇక నేను అంధకారపు తోటలో విహరిస్తాను. నీ తలపై నేను కర్పూరం చల్లాను. నా శిరస్సుపై నీవు నిప్పులు కురిపించావు.

ఓ రాజా! ఇకనాకు మృత్యువే శరణం. మహమ్మదు రాజుల సమాధుల సరసన అలసట తీర్చుకొంటాను.

అసత్యవాదికి, పండువెన్నెల వంటి కవితలభించింది.–

ఈ ఉత్తరాన్ని చదువుకొంటూ చక్రవర్తి క్రోధోన్మత్తుడైనాడు. దానికి ఆజ్యం పోసినారు యీర్ష్యాళులైన కవి, పండితులు. “ఫిరదౌసిని పట్టి చంపుడు”.

ఆజ్ఞ జారీ చేశాడు రాజు.

ఫిరదౌసి కవి అభిమానులు కొందరు యీ వార్త కవికి అందజేసినారు.

ప్రాణరక్షణార్థం, ఫిరదౌసి తన భార్య కూతరులతోపాటు ఆ క్షణమే గజనీ పట్టణం వదిలి పోయినారు. అరువైదే దినారాలు కత్తులై కవి కుత్తుక ఖండింప ఉద్యుక్తులై తరుమగా”

కవి కుటుంబం ఆ అడవిదారిన పడి తూసు నగరానికి చేరాలనే సంకల్పం. ఆ సంకల్ప బలంతో దారిలో ఎదురైన కష్టాలను తరించి నడుస్తూ వుండగా...

సూర్యుడు పశ్చిమానికి ప్రయాణమైనాడు. నింగీ, నేలా ప్రాత పడినది. పొంచివున్న చీకట్లు, తారకా దీపాలను వెలిగించినవి. కవి కుటుంబము నిరాశే వెంటరాగా, ఆ కాంతార సీమన పయనించారు. జలధారలు నలుపెక్కి ఒక్క జడివాన కురిసింది. భూలలనా రత్నము స్నానమాడింది. చలిగాలులు వీచ సాగినవి. గూండ్లలోని పక్షులు తమ కూనలపై రెక్కలు విప్పి కన్ను కూర్కినవి.

**చిటిపొటి చినుకులు చిలుకరించెనుగాని**

**కుంభ వర్షంబును గురియలేదు;**

**ఉఱుములఁ బలుమాఱు హుంకరించెను గాని**

**పిడుగుకై దువుల గుప్పింపలేదు;**

**కదలేని మెఱపుతీఁగలు పెంచుకొనుఁగాని**

**నేత్రావరోధంబు వెఱపలేదు;**

**చలిగాడ్పు మొలకల వెలువరించెనుగాని**

**కసరి యీదరగాలి విసరలేదు;**

**అతిరయంబున గగనంబు నాక్రమించి**

**బలిసి గర్జించి యటునిటుఁ బరువులెత్తి,**

**తెలివి సెడి క్రమక్రమముగాఁ దేలిపోయె**

**గని కుటుంబము గరుణించి కాఱుమొయిలు.**

ప్రకృతి కవి కుటుంబంపై జాలి వహించిందా అన్నట్లు, శాంతి వహించింది.

ఆ నడికిరేయి చీకర కాననమున ప్రయాణము చేస్తున్నా కవి కుటుంబమును చూచి, తారకా దివ్యనేత్రాలు తెరచి, కాచి రక్షిస్తున్నాడు, ఆ జగద్గురుడు.

'ఫిరదౌసి' రచనా కాలానికి జాషువాలో ఆగ్నేయవాదం తలెత్తలేదు. 'ఒక సర్వేశ్వరుడు వున్నాడు' అనే విశ్వాసం ఆయనలో వున్నది. మానవతావాది అయిన జాషువా 'ఫిరదౌసి' కావ్య రచనకు పూనుకున్నది, మానవతాదృష్టితోనే, సర్వేశ్వరునిపై విశ్వాసం కన్నా జాషువాలో మానవత పైనే నమ్మకం ఎక్కువ అని కానవస్తుంది. 'ఫిరదౌసి' ప్రయాణించే దారి పొడవునా, కవి చేత 'భగవంతుని' ప్రశ్నించే ఘట్టాలున్నవి? జాషువాలోని తత్వ జిజ్ఞాసకు యిది తార్కాణం. –

ఇరు సంధ్యల కెంజాయ హాసములోనూ పదుహారు రోజుల చంద్రుని నవ్వులో – పూల తోటలలో ముద్దుముచ్చట చెప్పి సరసాలాడే పిల్లగాలులలో – మేఘాల నెఱియలలో కుల్కే మెరుపు గర్భములోన – హాయిగా పవళించి యీ బ్రహ్మాండమును పలకరిస్తున్న నీకు – నా ఆహ్వానం అందుకో వేమి?

అలసట లేక దివారాత్రములు హోరుమని పారుచున్న యీ మహానదిలో కులుకు తరంగ మాలికలకు గిలిగింతలు పెట్టె, నురుగుల నటనలకు తలయూచు చున్నావు – నేను మ్రొక్కినా నన్ను చూడని కారణమేమి?

ఫిరదౌసి చేత యీ మాటలు పలికించినది, జాషువాయే, సాంగిక జ్ఞాన గమనంలో తాను ఎదుర్కొన్న కష్టాలకు, సుఖాలకు – దాని నుండి ఉత్పన్నమైన ప్రశ్నలే జాషువా వేసిన ప్రశ్నలు. నీవే అక్కడెక్కడో వున్నచో యీ మానవుని తిలకించవేమి? ఈ మా 'అనుమాన' పరంపర లను తీర్చిపోవేమి? అని కవి ప్రశ్నిస్తున్నాడు.

జాషువాలో ఆనాటి నుంచే తల ఎత్తుతున్న ప్రశ్నల అలజడే యీ ప్రశ్నలకు మూలం.

ఆ నిదురించు బెబ్బులి గర్భమున ఎన్నో జంతువులు ఆహారమైపోయినవో! రేపటి ఆహారానికి తయారైన జంతు జాలము ఆ పొదలలో నిద్రించుచున్నవి. నీకు మాత్రం తెలుసు యీ రహస్యం. అయినా నీవు మిన్నకున్నావు ఏల? ఎందుకు?

ఈ విశ్వంభర నీయనుగ్రహములో ఆనందరాగము పాడుకుంటూ న్యాయమేదో? అన్యాయమేదో కొంచెమైనా ఎఱుంగలేదు–

ఆ తొలికోడి కంఠమున ఏ సూర్యబింబము నిద్రపోయినదో రాత్రి. తూర్పు కొండలు రాగ రంజితమైనవి. మరి దీని వక్రపు కూతలకు అర్థమేమి? ప్రభాత సమీరము అల్లన వీచి, దాని రహస్యము కనుగొమ్మని చెప్పుచున్నది.

ఆకాశాన్ని కాగితంగా చేసుకొని నీకు రచిస్తున్న లేఖకు, వేగుచుక్కతో నిలిపి వేసితివి, మరి అందులో నాగతులు ఏమి వ్రాసితినో నని నా మనసు విహ్వాలత చెందుచున్నది. మరి నా రహస్యాలన్నీ దాచుకున్న నీకు నాకేల వినిపింపవు? నాకేల తెలియజేయవు?

ఆగడపు మబ్బు శయ్యలలో ఆ శిఖరాన బుడుత చంద్రుడు నిద్దుర పోవుచుండగా, యీ చెఱువు నీట అతనికి ఉయ్యేల కట్టి జోలపాడు తూలనావంక చూడవైతివి ఏల?

నీవు సృష్టి కర్తవు. సృష్టి నేను. నాపై నీకేల యింతటి నిరాదరణ? అని కవి ప్రశ్న–

**సుకము లశాశ్వతంబులను**

**చుం బొగరెక్కిన కొమ్ముటేన్గు వా**

**రక చెవులూచి, తుమ్మెదరొ**

**రన్ బెదరించు ననుక్షణంబు, నీ**

**సకలచరాచరంబునకు,**

**సామ్యములై, నెఱనున్న పోలికన్**

**నికటజలాశయంబుల జ**

**నించిన బుద్బుదముల్ నశించెడిన్.**

ఈ జీవన వేదాంతాన్ని బోధిస్తూనే, కొందరికి సుఖములు మరి కొందరికి కష్టములు ఏల సృష్టిస్తున్నావు?

మానవుల సృష్టించి, వారిపై సుఖ కాంక్షను పురికొల్పిన దీనీవె? వారిని కష్టాల కడలిలో ముంచే దీనీవే? ఏల ఈ ద్వందవైఖరి ప్రభో? అంటాడు కవి....

కొండల నుండి దిగి జారే సెలయేటి నీరు యీ ఎండిన నదీ తటమున నిండి, గుండములు ఏర్పడినాయి. అమాయిక పాంథులను అపహరింప!

ఆకాశంలో ఇంద్రధనుస్సుని చూచి “ఏమిటి కెక్కు పెట్టితివి ఇంద్రధనుస్సును మింటిఛాయ... ప్రమోద మాలిక చాటున సూర్యుడు నక్కినాడు. తానేమి అపచారము సల్పియిట్టి విపత్తు తెచ్చినాడు”. సమస్త విశ్వాన్నీ రసవత్కావ్యంగా దర్శించిన కవి జాషువా. “నీ కవన మద్భుతము అర్థ గంభీరము’ అని ఆశ్చర్యపోతాడు.

**సరదాగా భుజశక్తి మీఱ నెపుడో**

**క్ష్మానామకంబైన బొం**

**గరమున్ ద్రిప్పితి, నీపరిభ్రమణ వే**

**గం బింత చల్లారినన్**

**జరుగ నేర్చునె లోకవృత్తము మహే**

**శా! అప్పుడే దిక్కుగా**

**నొఱగుం బర్యవసాన మెట్లగునొ అం**

**చూహింతు నున్మాదినై.**

ఆ విధంగా కొన్ని గడియలు ఫిరదౌసి ఈశ్వర స్తవంగావించి నాడు. అంతలో పడమటికి పొద్దు కుంకె. పెద్దపులి ఏటికేతెంచె; వంది కోరకత్తి పదును పెట్టె. ఆకాశము భూమి అఖిల పదార్థమూ అంధకారమున క్రుంకినది.

**ఆ చీకటి కాంతారమున ప్రవేశించిన పాంధులను...**

**దెసలు బీఁటలువాఱ వసపట్టి పోరాడు**

**కొదమసింగములకు బెదరిపడుచు**

**త్రాటితోపులఁ గట్లు ద్రావు భల్లూకాల**

**గుటగుట ధ్వనులకుఁ గదులుగొనుచు,**

**నూహింపరాని యేవో ముక్కిడిమృగాల**

**వెఱ్ఱికూఁతలకు తబ్బిబ్బుపడుచు**

**కొఱవిదయ్యముల టక్కరి దివ్వియల జూచి**

**యూరు దగ్గఱె నంచు నూఱడిలుచు,**

**గొసరి నివ్వరి ధాన్యంబుఁ గొఱికి నవ్వులు**

**నెలుక మునిపంటి సవ్వడి కలికిపడుచు,**

**త్రోవ గమియించు నాఁటి పాంథుల, నదే మొ**

**అదరి బెదరించె నొక యెండుటాకు కూడ.**

ఆ దీనులను చూచి ఒక బోయ కనికరించి చనుదెంచి, దయామేదురములైన పలుకుల వారి భీతి మాన్పె. వారికి దారి చూపెను. మానవత్వం రూపుదాల్చినదా అన్నట్లు.

“సామీ? ఆదెన నినరశ్మిల ఎండమావు లేర్పడినవి, అప్పుడే సాగరం వలె గన్పడునటు, అటు వెళ్ళకండి, అది ఎడారి, దాటుట అసాధ్యము”–

ఆ కన్పట్టు పర్వతపు అంచున నున్నది పెద్ద చెరువు. మీరు ఆకలిగొన్నచో అచట నిలచి చల్దీ భుజింపుడు. అటు మరికొంత దూరాన మా చెంచుల గూడేలున్నవి... ఇది కాంతార భూమియే కాని ఇదంతా బ్రహ్మ సృష్టిని ఎంత ఆపదల పుట్ట.

అటు, దోరగా బండి గుత్తులయి దొంతలు గట్టిన పండ్లు, తేనె పట్టులా అన్న భ్రమ కల్పిస్తాయి. ఆ పండిన ఖర్జూరపు గుత్తులు....

**ఈ యెదార్లగండు టిసుక తిప్పలమీది**

**వెట్టచేత బిగిలి పిల్లలయిన**

**నిప్పుకోడి గ్రుడ్డు నీటి కుండలు, వారి**

**కి ఒంటె పాడి వారి కుగ్గుపాలు.**

ఈ పుష్ప కోమలులతో యీ పర్వత మయవనాల యిట్లు ఒంటరిగా కష్టాలు పడుతూవున్నాయీ ఓపిక నీ కెట్టు అబ్బింది ముసలిదొరా?–

అంటూ ఆ నిషాదుడు అత్యంత మృదువుగా, వినమ్రముగా చేసిన పరోపకార గులామునకు, ఫిరదౌసి కృతజ్ఞుడైనాడు – అతనిని కౌగిలించుకొని ఆనంద సంతుష్టుడై–

"నధురులు సంపాదించి పెట్టిన వినాశన సూచకమైన పాపము యీ భూమికి అసహ్యమై మూలుగుచున్నది. ఈశ్వరుని క్రోధ దావానలము నిన్నువంటి పరోపకారిని చూచియే, దహింపకున్నది.

నా తనూ పటుత్వము, నా కవితా కమనీయ రాశి రాజు ఒకడు బలిగొని, నన్ను వధింప జూచినాడు. నా చరిత్ర విన్న శిలలే కరుగుతాయి; నీ మనసు నవనీతము అందుననే నాయీ కష్టము చూచి కరిగినది. ఈ నెరసియున్న తల, చూపు తరిగిన నా కనులు, ముసలిదై శక్తి నశించిన శరీరము... నాకు ప్రాప్తమైనది.

ఈ ముసలి నా భార్య, ఆ పడుచు నా కూతురు. యీ కోమలుల రక్షణార్థమే... ప్రాణం తీసుకొనుటకు భయపడుతున్నాను నిషాదా!

నా యీ శరీరమున్నంత వరకూ నీకు కృతజ్ఞుడనై యుండెద. ఇక సెలవు సోదరా!" అంటూ కంట నీరు కుక్కుకని, కవి ప్రయాణం సాగించినాడు.

అటు గజనీమహ్మదు సైన్యము ఫిరదౌసి కవిని పట్టుకొనుటకై కదలి వెదుకుచున్నది. "ఒక్క పేదవానిని జంపుటకై యింత అశ్విక దళంబులా" అని పౌరులు ఆశ్చర్య చకితులైనారు.

ఫిరదౌసి, ఒక గ్రామమున అజ్ఞాత జీవితము సాగించుచున్నాడు, దారిద్ర్యం, శరీర అనారోగ్యం పీడిస్తూ వుండ.... జీవితాన్ని ఎటులో లాగుచున్నాడు.

ఒక సంవత్సరము గడచినది. ఫిరదౌసి కవికి చెల్లించవలసిన బహుమానం సన్మానించమని గజనీ ఆస్థాన కవులు పదే పదే చక్రవర్తికి విన్నవించుచుతూ వున్నారు. "షానామా గ్రంథమున మేలు రత్నాలు కలవు. ఒక్క అరువది వేల బంగారు నాణేలకు వెనుదీయ తగునా ప్రభూ! మీరు కళాపోషకులను కీర్తికన్నారు. బంగారము, మణులు కురిసే క్ష్మారాజ్య కన్యకన్నా... కృతి కన్య చక్కనిది. శాశ్వత కీర్తి నిలుపునది కదా"–

ఒకనాడు చక్రవర్తి పానుపు దిగి, మసీదు కేగినాడు. ఆ మసీదు గోడపై.... ఫిరదౌసి కవి వ్రాసిన పద్యాలను చూచినాడు...

**"కృతి యొక బెబ్బులింబలె శ**

**రీర పటుత్వము నాహరింప శే**

**షితమగు నస్థిపంజరము**

**జీవలంబున నూఁగులాడఁగా బ్రతికియుఁ జచ్చి యున్న ముది**

**వగ్గు మహమ్మదుగారి ఖడ్గదే**

**వతకు రుచించునా? పరిభ**

**వవ్యథ యింతట నంతరించునా?**

**"ముత్యములు కిక్కయైన సముద్రమున**

**బెక్కుమాఱులు మున్కలు వేసినాఁడ**

**భాగ్యహీనుఁడ ముత్యంబు పడయ నైతి**

**వధి నను మ్రింగ నోరువచ్చినది తుదకు"**

**"ఫిరదౌసి"**

ఫిరదౌసి లేఖ చదివిన చక్రవర్తి హృయాన దుఃఖపు కొండలు కరిగినవి. ప్రతి అక్షరమున అశ్రువులు ప్రత్యక్షమైనవి...

అతడు, ఆనాడే పారసీక కవికి వాగ్దానము చేసిన పసిడి ధనాన్ని బస్తాల కెత్తించి, "పదిలంబున సత్కవికి అప్పగింపుడు" అని భటుల కాజ్ఞాపించెను.

అటు ఫిరదౌసి యు ఒక ఏడాది నుండి పరిపూర్ణ జర ఆవహింపు పెండ్లి కెదిగిన ప్రియ కుమారిత చింతచే డస్సిపోయి, కృశించి, కృశించి, కుమిలి.... దేహంబు చాలించెను.

**"సుకవిదేహంబు ప్రేతభూమికి లభింప**

**అర్థ మప్పుడె శూన్యగేహమును జేరె,**

**నిమిషభేదంబు నడుమ సంధింపఁబడిన**

**ఈ రహస్యంబుఁ గనుఁగొన నెవరితరము?**

ఆ ధనాన్ని చూచి, తిరస్కరించి ఫిరదౌసి కూతురు అన్నది గదా...

"ఇది నా తండ్రిని కష్టపెట్టిన ధనము దీనిని నేను ముట్టుదునా... మీ ఏలికకు పదివేల నమస్సులు అందజేయుడు" ... కులగిరులు కరిగిపోయెటంత పలుకులు, దైన్య పూరితమైన వాక్కులు పలికిన కవి సుతకు నమస్కరించి బటులు ధనమును మరల్చికొని పోయినారు.

* * *

# ముంటాజ మహలు

"ముదిరిన ప్రేమసీ ప్రణయ మూర్తి తిరోహితమైన ఎదనపుడగ్ని పర్వతములెన్నా పెటుల్లున బ్రద్దలెయ్యె కదా? మొగలాయి రాజు తెలికన్నుల రాలిన భాష్పధారలే పొదలి ఘనీబవించె ముద్దుల తాజమహాలు పోలికన్"

భారతీయ శిల్ప ప్రౌఢిని వేనోళ్ళంజాటు తాజమహలును గనులారాఁ జూడవలెనను కోర్కె నాకు బాల్యము నుండియుఁ గలదు కాని ప్రాప్తి లేమికిఁ జింతించుచుందును. దేశదేశముల సంస్కృతుల కగ్గమై శిల్పులకు గర్వకారణమూ ముంటాజ మహలు గోరి గడించిన కీర్తి ఒక్క మొగలు చక్రవర్తికే కాకా భారతీయులకు, నందు ముఖ్యముగా నాంధ్రులకును దక్కుచున్నది. దాని సృష్టియందు పాల్గొన్న ముప్పది ముగ్గురు శిల్పాచారులలో నలువురు మచిలీపట్నము నుండి యాహ్వానితులైనట్లు తన్నిర్మాణ కాలమున స్వయముగా జూచిన బాగ్దాదు వాసియగు నొక చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. అందలి ప్రధాన శిల్పియగు నొక యైటలేయుడు స్వరదేశమున కేగి, తాజి సోయగము నూహించి, అద్దపు చట్రమున బిగింపనైతిగదాయని విచారించెనని దాని మహిమ, దాని కోమలత స్పష్టముగాకపోదు. దీని నిర్మాణార్థ మిరువది లక్షల కార్మికులహోరైతము లిరువది వత్సరములు పనిచేసినట్లును, ఇరువదికోట్ల రూప్యములు వెచ్చింపబడి నట్లును చరిత్రలు ఘోషించు చున్నవి. ఒక దృష్టి.

"--- I love the thee with the breath
Smiles, tears, of all my life – and if God Choose
I shall but love thee better after death"

- E.B. Browning

నాశ్వాస, నా నవ్వు, నా కన్నీళ్ళు; నా జీవిత మంతా వీటితో నిన్ను ప్రేమిస్తున్నాను. భగవంతుడు నిర్ణయిస్తే – నా మరణానంతరం కూడా నిన్ను మరింతగా ప్రేమిస్తాను – "

షాజహాను ప్రేమ ఇంత గాఢమూ, పవిత్రమూ, అచంచలము. ఇది సాధ్యమా అనేక స్త్రీల సాహచర్యం వున్న చక్రవర్తికి?

శరశ్చంద్రుని 'శేషప్రశ్న' నవలలో కమల పాత్ర వాదన ఇదే, "షాజహానుకు అనేకమంది భార్యలున్నారని విన్నాను. వారిలో ముంటాజ్‌పై కాస్త ఎక్కువ ప్రేమ వుండవచ్చు – అంత మాత్రాన అది ఏకపత్నీ వ్రతం కాదు – షాజహాను మనస్సులో చలించని పవిత్రమైన ప్రేమే లేకపోతే, యీ స్మతికి, స్మృతి మందిరానికి విలువలేదని, అంది ఎంతటి సౌందర్యాన్ని సృష్టించినా మాన హృదయాల్లో దానికి స్థానమే లేదని మీరంతా అనవచ్చు –

ఈ అశుబాబు విషయమే తీసికొండి. ఒకనాడు యీయన భార్యను అమితంగా ప్రేమించాడు. కానీ యిప్పుడు ఆమె లేదు. ఇప్పుడామె ఇవ్వగలిగిందీ లేదు. ఆమె నుండి పొందగలిగిందీ లేదు. ఇప్పుడు ఆమెను సుఖ పెట్టలేదు. దుఃఖ పెట్టనూ లేదు. ఆమె అస్తిత్వమే లేదు. ప్రేమ చిహ్నాలు కూడా మాసిపోయినట్లే. మనిషి లేదు. ఆమె స్మృతి మాత్రం వుంది. ఆ స్మృతిని రాత్రింబవళ్ళు పోషించుకుంటూ, వర్తమానం కన్నా గతమే స్థిరమనుకొని జీవితం గడపడంలో ఏమి మహదాదర్శం వుందీ?

ఈ భావం విన్నప్పుడు మనకు మరో భావమూ వస్తుంది. మరి లైలా మజ్ను షిరీన్ ఫర్‌హాద్.. ఒకరి ప్రేమకై ఒకరు బలైన బంధం.... మరి యిది పవిత్రమూ, త్యాగమూ కాదా? ఈ ప్రేమ చంచలమూ, అస్థిరమూ కాదే?

ఇక్కడ యీ చర్చ అనవసరంగా కనిపించవచ్చు... ఒక్కటి మాత్రం సత్యం. ప్రేమ సత్యం. ప్రేమ నిత్యం... చంచలమూ కావచ్చు. అస్థిరమూ కావచ్చు... 'పవిత్రత' అనే మాటకు 'ఇదీ అర్థం' అని చెప్పడం మాత్రం కుదరదు.

ఇక్కడ షాజహాన్, ముంతాజ్‌ల ప్రేమ నిత్యము, సత్యము––– దానిని ఒక కళాఖండం రూపాన నిర్మాణం చేసి పరస్పర ప్రేమను ప్రపంచానికే చాటుకొన్నాడు. ప్రేమించడం మహదానంద పరితృప్తి. కానీ ప్రేమించబడటం బ్రహ్మానందం సత్యస్వరూప తృప్తి. ప్రేమ ఒక నిత్యనూతన చైతన్యం. ఈ సర్వ ప్రపంచ సౌందర్యం, ఆనందం ప్రేమలో ఇమిడి వుంది. ఆ ఆనందం మాట కంది రాదు. అది ఒక అవ్యక్త ఆనంద స్రోతస్సు. హృదయాన్ని ప్రేమ రసప్లావితం గావించి, ఆర్ద్ర మొనర్చుతుంది.

ముంటాజ్ షాజహాన్‌ల ప్రేమను దశదిశలా పాలరాతి సొగసు వలె, నునుముత్యంలా ప్రచారం చేస్తున్న దాన్నట్లుగా అవతరించింది ఆ తాజ్‌మహల్.

**మాణిక్యంబు సహస్ర సంఖ్య లోకవంకన్ భూరిలావణ్యపుం**

**గాణాచుల్ పనికత్తెలొ క్కెడఁ గటాక్ష శ్రీల నాశించి వి**

**న్నాణంబుల్ పచరించినన్ గలంత జెంద దంతరంగాన నా**

**రాణిసాహెబ మీంద నిశ్చల పవిత్ర స్నేహ మోహంబునన్.**

ఆ ముంతాజ్ సతి అసమాన చక్కదనమును వర్ణించుటకు ఏకవికీ కలము సాగదు. ఏ చిత్రకారుని కుంచియకైనా చలనం నిలచి పోతుంది. ఆమె సౌందర్యానికి, అత్త నూర్జహాన్ సిగ్గుపడిందట! –

ఆ ఇద్దరి దాంపత్య సఖ్యత చూచి చిలుకాగోరువంకలే తలవంచి నమస్కరిస్తాయి – మరి ఆ ప్రేమైక సామ్రాజ్యం ! అది ఎలాగునడచిందీ?

ఆ సతీ పతుల గాఢాశ్లేషముల నుండి ఒక్క నిముసమైన తొలగిపోలేదట! ఎన్నెన్నో వెన్నెల రాత్రులను ఆనందంచి హాయిని పొందారో ! దాక్ష తీగకు తీపి ఎలా చేరింది?– వీరి ముద్దల తీపి చేరెనేమో ! ఆ పూల తోటలన్నీ వారి ఆనంద విహార యాత్రలచే మరింత వికసించి పరిమళం వెదజల్లినవి. ఆ దంపతుల చెల్మిజగానికే ఆదర్శమై నిలచింది.

ఆ మొగలు దొరసాని లావణ్య రూప సౌందర్యము, వసి వాయలేదు. వాడిపోనూ లేదు, సంతాన వతి అయినాకూడా... ఎంచేతనో? ... జీవితంలో ఒక్క దుష్ట చింతకూడ లేని సత్యవంతుల వయస్సు తరగదు.

**"రత్నరుచులు లీను యవన సామ్రాజ్యరమకు**

**నగలు గీలించు రాణి సౌందర్యలహరి**

**ప్రభువు కన్నులు దాటి యీవలికి రాదు**

**వలపులూరింపకుండ అవ్వలికి పోదు"**

పదముగ్గురు బిడ్డలకని, పదు నాల్గవ గర్భము ధరించింది ముంతాజ్ రాణి. దైవము సంపద వున్నవారికే సంపదను కూర్చి ! దారిద్ర్యం వున్న వారిపై మరింత దారిద్ర్యాన్ని మోపుతాడేమో ! –

ఒకనాటి శరత్కాలపు పున్నమి వెన్నెలలో భర్తతో కొంతసేపు సల్లాపము చేసి పూలపాన్పుపై ఆనిందు చూలాలు నిద్రపోతూ వుండగా – సరిగ్గా అర్ధరాత్రివేళ ... భవనమంతా నిశ్శబ్ధనిద్రాదేవి ఒడిలో ఒదిగిపోయింది.... ఐదు సంవత్సరాల ఔరంగజేబు పలవరిస్తున్నాడు – ఆకసమున ఒక చుక్క ముక్కలై రాలింది. – ఆ పున్నమి అలుముకున్నరాత్రి ... రాణి గర్భమున పాప" తలయూచుచు కికాకినన్ నవ్వె! ఉలిక్కిపడి లేచి, రాణి దిక్కులు పరికించింది భయవిహ్వాలయై.

ఆ కాన్పుతో తనకూ, ప్రియ భర్తకు చెలిమి ముగిసినదనే కలత ఆమెను కలచివేసింది "ఎన్నడూ కంట తడి ఎరుగని ఆ రాణి చెక్కుల వెంట కన్నీరు కారింది. ఆమె కారాత్రి గడవనే లేదు చింతతో".

ప్రసవవేదనతోపాటు తీవ్ర జ్వరం ఆమెను ఆవరించింది. తన సంతానము మాతృహీనమై విలపిస్తున్నట్లు, తన విభుడు వియోగముచే కుమిలిపోతున్నట్లు – తన ముందే తన సమాధి నిర్మాణం జరుగుతున్నట్లు – ఆ రాణి ఆలోచనలు సాగు ఆమెను నిలువునా దహించి వేసినవి.

ఇక చక్రవర్తి వేదన వర్ణించ భాషలేదు. మానెడు వజ్రాలు భక్తితో అల్లాకు సమర్పించుకున్నాడు. అయినా ఇల్లాలు స్వస్థత గాంచలేదు....

శతృవుల ప్రాణాలు తీయగల వీర పరాక్రమవంతుడు – తన భార్యకు ఆయువు పోయలేని బలహీనుడు – చండశాసనుడైన ఆ చక్రవర్తి తన ఆత్మకే అధికారి – న్యాయానికి కాదు.

ఆ రాణికి ఆరోగ్యము రాలేదు. తనకు మరణం ఆసన్నమైనదని గ్రహించింది. తన బిడ్డలనందరినీ చేరబిలుచుకొన్నది. భర్తను దరిచేర్చుకొన్నది. భర్త శరీరాన అర్ధభాగం ఆక్రమించి, ఆయన హృదయాన ప్రేమ సింహాసనం అధిష్టించి, పాలించి, తాను పొందిన మహాతృప్తిని, గౌరవాన్ని, సౌఖ్యాన్ని తలంచుకొని... ఆ రాణి తన దుఃఖాన్ని మరచి వేదాంతాన్ని కౌగిలించుకొన్నది. నా భర్తను నా వియోగ బాధనుండి విముక్తుణ్ణి చేసి నేను మరలిపోవాలి అని నిశ్చయించుకొన్నది.

ఆ మహారాణి యిప్పుడు సామాన్య ప్రేమమయి అయిన మహిళనుండి ఆశలు, కాంక్షల నుండి విముక్తి పొందిన జ్ఞాని అయింది. భర్తనుద్దేశించి బోధించింది.

"ఈ ప్రపంచమంతా ఒక సత్రం. సుఖదుఃఖాలు కలిసి నడిచే యీ జీవితం ఇంతవరకూ మీకు సతినై జీవించాను. యీ జీవన వ్యవహారాలు, యీ ధనదాన్యాలు అధికారాలు అన్నీ స్వప్నాలు చంచలమైనవి. వీనిని నమ్మరాదు. నీ చెలిమి స్థిరమైనది కాదు... ఈ పరదేశుల స్నేహం క్షణికమైనది.

ఈ శరీరం ప్రాణ సహితమై వున్నంత కాలం; ఆశలు, కాంక్షలు బంధనాలు పెంచుకుంటూ వున్నంత కాలం మనిషికి శాంతిలభించదు. కష్టసుఖాలు చెలికత్తెల వలె, మనలు చుట్టేవుంటాయి. ఆశలు, కోరికలు మనకు భ్రమలు కల్పిస్తూ వుంటాయి. మృత్యువుకు యిది వినోద రంగము. అది మన నీడగా నడుస్తూ, మనకు అగపడదు. అయినా తప్పదు. అంచేత ఎప్పుడు మృత్యువు మనల కబళిస్తుందో తెలియని యీ జీవితాన సంపదలకు, అధికార దాహాలకు, రాజ్య కాంక్షలకు స్థానం శాశ్వతం కాదు.

ఇవి చదరంగంలోని పాచికలు. రాజు పేదగా, పేద రాజుగా మార్చు అనుకోని మూలలనుండి మనలకు ఎదురై వస్తాయి.

రాజా మరొక సత్యం – ఈ జీవిత రంగమంతా ఒక నడుస్తున్న ఓడ. అందు మనమంతా బాటసారులం. ఈ జీవన వ్యాపారం ముగించుకొని ప్రయాణమై ఎవరి రేవు ముందువస్తే ఆ రేవులో దిగిపోతూ వుంటాము. కొత్తవారు వచ్చి చేరుతూ వుంటారు. అంచేత నీవు దుఃఖించకు.

ఎంతటి సంపదను అనుభవించాను నేను – ఎంత సౌఖ్యాన్ని, గౌరవాన్ని పొందాను. పొందినంత వరకే తృప్తి – పరాక్రమవంతులైన ఎందరో చక్రవర్తులు యీ భూమిని పరిపాలించారు. రాజ్య కాంక్షా దాహంతో, ధనమదాంధకారంతో ఏలారు యీ భూమి కానీ ఏదీ వారి పరాక్రమం? ఏదీ వారి సంపద? ఏదీ వారనుభవించిన అధికార లాంచనం? వారి అస్తిపంజరాలలో పాలీళ్ళు గూళ్ళు పెట్టాయి. వారి కపాలలో నిండిన వర్షపు నీటిని పులులు, సింహాలు దాహం తీర్చుకుంటున్నాయి.

ఇదే సత్యం రాజా ! దీనికై అహంకారం, దురహంకారం తగదు. ఆ అధికారం, యీ ఆడంబరం అన్నిటి మార్గం అటే... ఆ చివరి నిశ్శబ్ద, నిరోహ ఆరడగుల ప్రదేశానికి! అన్నిటికీ ఒకే న్యాయం. చివరి న్యాయం.

తన ప్రియ సతి మరణాసన్నామై కూడ... వేదాంతాన్ని బోధించుతూ తన దుఃఖాన్ని ఉపశమింపజేయు జూస్తున్న... ఆమె ధైర్యానికీ, ఆమె వ్యక్తిత్వ గంభీరతకు లోలోన ఆశ్చర్యపోతూ.... రవ్వంత ఉపశమనం కలిగినా గంభీరుడై వింటున్న చక్రవర్తి వేడి కన్నీరు ప్రియసతి హృదయంపై వర్షిస్తూనే వుంది.

భర్తకన్నీరు తుడిచి... మరీ చెప్పింది.. " ఈ దేహాన్ని ఏ పుష్పము వాడుకున్నదో ఆ యీశ్వరుడు – విచారించవద్దు. ఈ జనన మరణాలు మామూలే కదా. యీ విశ్వమనే పులి గర్భమున ఎందరో ఆహుతి అయినారు. అందులో నేనూ ఒకదానిని.

మరణం సమత్వాన్ని చాటుతున్నది. దానిముందు భాగ్యవంతుడు, పేద ఒకటే. రాజు భృత్యువు సమానమే. ఈ దుఃఖం, యీ వేదన అనే వీటినుండి విశ్రాంతిని ప్రసాదించేదే మరణం. సర్వబాధా విషయజ్వరాలకు దివ్యౌషధం మరణం. మీ పితామములు, హుమాయూన్, బాబర్ అందరూ యీ సుమశయ్యలపై పవళించారు. ఎన్నో ఉదయ సంధ్యలు వచ్చినా ఒక్కరూ మేల్కొంచరు !

ప్రభూ ! కన్నీరు నించవద్దు. కలుష రహితము, ప్రేమ మందిరము అయిన మీ హృదయాన శాశ్వత నిద్రపోతాను... అంటూ ఆ ఇల్లాలు భర్త వక్షస్థలంపై నేత్రాలు మూసుకొన్నది. అవి యిక తెరవబడవు. అవి యీ ఆనంద సుందర విశ్వాన్ని, యీ అనంత ప్రకాశాన్ని చూడవు.

**"పట్టు పరదాల చీకటి వనములందు**
**ప్రభవమును గాంచి, శోభిల్లి రాలిపోయె**
**పరిమళం బొందు లోకానపారజిమ్మి**
**మొగలు రేరాణి ముత్తైదు ముత్తియంబు"**

The garlands wither on your brow
Then boast no more your mighty deeds;
Upon death's purple altar now
See where the Victor-Victim bleeds;
Your heads must come
To the cold tomb
Only the actions of the just
Smell, sweet, and blossom in their dust –

J. Shirley

నీపై అలంకరించిన పూల మాలలు వాడిపోతాయి. నీ గొప్పతనం గురించి యిక చెప్పకు. అదో ఆ నీలపు మరణ పీఠంపై విజయుడు, బాధితుడు ఒకే బాధను అనుభవిస్తున్నారు. నీ శిరస్సు యీ చల్లని సమాధిపై వాల్చవలసిందే... నీవు చేసిన న్యాయమైన మంచి పనులు మాత్రమే ఆ మట్టిలో పూలమొక్కలై సువాసనలు వెదజల్లుతాయి...

జీవిత గమనంలో ఎదురైన రెండు విభిన్న సత్యాలను కవి యిక్కడ ఒక ప్రేమగాధను ఆధారంగా ఉద్భోదించాడు.

అయితే జీవితమూ, అందులోని ఎత్తుపల్లాలు, సుఖదుఃఖాలు, ప్రేమ, వియోగం ఎంత సత్యమో – వేదాంతమూ అంత అవసరమే. కానీ మానవుని మనస్సు కాంక్షల కాణాచి. ఆశల పల్లకి, సుఖాలకై అర్రులు. జీవితం బుద్బుధం, క్షణికం ఎప్పుడైనా మరణం తథ్యం. గనుక కోరికలను, ఆశలను సంపూర్ణంగా తెంచుకొని మనిషి చైతన్య వంతునిగా, అభ్యుదయ కామిగా, భానిర్మాతగా జీవించలేడు.

వేదాంతం ఒక ఊరట. ఒక సాంత్వన. ఒక మధ్యవర్తి. ఈ మధ్యవర్తి ఒక మధ్యేమార్గం. దాని ఆదేశాన్ని ఆచరించాలనే ఆంక్ష లేదు. వేదాంతంలోని నిగూఢ సత్యాన్ని మాత్రం మరువక జీవితాన్ని 'అతిగా' కాక నడిపించుకోవాలి. అప్పుడే మనిషి నిత్య నూతన భావాలను సృష్టించుకో గలడు. చైతన్యవంతుడై భావి నిర్మాత కాగలడు. స్థిత ప్రజ్ఞుడు కాగలడు.

భారతీయ సాహిత్యంలో ఒక స్త్రీ చేత, అందునా చక్రవర్తిని చేత, చక్రవర్తికి వేదాంత బోధ చేయించిన ఘనత జాషువాకే దక్కిందేమో !

ప్రేమ ఎంతటి మహోన్నతమైనదో – వియోగము అంత గొప్పదే. వియోగ బాధ నిజాయితీని ప్రదర్శించుతుంది. వియోగంలో ప్రేమలోని, అవపరత వివరిస్తుంది.

"ఈ భూమికి సూర్యుని వెలుగు ఎంత అవసరమో... మనిషికి ప్రేమ అంత అవసరం" – ఒక సాంఘిక శాస్త్రవేత్త.

**వియోగం :-**

**ఆ ముంటాజమహాలురాణి కడకిట్ల న్యాయమై పోయినన్**

**భూమీశాగ్రణి దీనుడై భుజబలంబున్ ప్రాజ్యసామ్రాజ్యమున్**

**లేమిన్ జెందినయట్టు బిట్టు దరపిల్లెన్ గ్రుంగి కులారి, యు**

**ద్దామైశ్వర్యము లింపుసేయునె కళత్రజ్యోతి చల్లారినన్.**

కళత్రజ్యోతి చల్లారగనే ఆశేష సైన్యముండీ దీనుడై విలపించినాడు చక్రవర్తి – ఉన్మత్తుడైనాడు. నిద్రా హారములు లేవు. ఆమె తిరిగిన చోటుల తిరిగాడు. సంగీత, నాట్యాలు రుచించవు. సరస సంభాషణలు విషయమై వెగటు దోచినవి. బిడ్డల చూచి కన్నీళ్ళు కుక్కుకునేవాడు. ఆ మహా సామ్రాజ్యధినేత.

ఈ మణి మందిరాలలో నిన్న నివసించావే, యీ రోజు యీ కటికి నేల పై ఎలా నిదురిస్తున్నావు. నిన్నవలె కాదునేడు. నేడు ఎంతటి విషం కక్కినది.

ఈ ప్రపంచమంతా బూడిద గుట్టలా కనిపిస్తున్నది. నీవు జీవన తారవై నిలిచావు. నేను యీ విశ్వాస శోకమూర్తినై నిలచాను. విదుర పాత్రతో యీ నాటకరంగ స్థలాన వాపోవుచున్నాను.

ఆత్మేశ్వరీ ! నా శౌర్య సంపత్తి యావత్తూ వ్యర్థమై పోయింది. నిన్ను రక్షించు కోలేకపోయాను. ఇట్టి సమయాల్లో చక్రవర్తి కూడా సామాన్య మానవుడే!

స్వర్గము నాశించి ఎందరో త్యాగులు, పయిగంబరులు దేహము చాలించినారు. మరి వారంతా ఏమైనారు? ఒక్కడూ కబురు చేయడు యీ నాటికీ –

మృతికి ఆవలి ఒడ్డున నీవు ఈవలి తీరాన నేను పరస్పర పలుకులందని భిన్నవాసులమైనాము. మరి మనకు స్నేహము ఎలా పోసుగుతుంది దేవీ !

సతీ ! ఎక్కడ వెదకును నిన్ను, ఏ మేఘాల బాటలో నీవు పయనించినావు?

**పయనంబు సాగించుమెయిలు తిన్నెల మీఁద**

**కనుపింపలేదు నా కాలిజాడ**

**అరవిచ్చి మురిపించి మెరుపుల తోఁటలో**

**మిట్టాడలేదు నీ మేని కాంతి**

**కొమరారు నిండుపున్నమ చందమామలో**

**భాసిల్లలేదు నీ హాసలవము**

**సచరాచంబైన సర్వ సర్వంసహా**

**వినిపింపలేదు నీ విమలవాక్కు**

**ఏ రహస్య పరణి యే హరిత్తుల జాడ**

**నీ నిలింప రథము నిర్గమించె**

**నాదు నేత్రయుగళి నాట్యమాడెడు నిన్ను**

**నెట్లు దొంగిలించె నీశ్వరుండు.**

నీవు పయనించిన దారి నాకు తెలియలేదు. అయినా నీవు నాకు కొంచెం దాచివుంచుము. రేపటి మాపట నేనూ వస్తాను. మృత్యు కిరాత రాజు, దయారహితుడు. విల్లు ఎక్కుపెట్టినాడు. నీతోనే తృప్తి చెందదు. వాని ఆకలి తీరదు.

దేవీ! యీ వియోగము, నీవు లేని యీ ఒంటరితనాన్ని ఏ గతి నేను భరించగలను. పతి రహస్యములను పదిలంగా దాచే, విశ్వసనీయమైన వ్యక్తి భార్యయే కదా, యీ భూమిపై, ప్రబల సైన్యము వుండి కూడా, యీనాడు భయపడుతున్నాను. నిర్భాగ్యుడనైతి.

**ఆరిపోవని నీదు శరీర శోభ**

**దీపమైనది కాళింది తిన్న యలకు**

**మంజులంబైన నీసౌకుమార్య మెల్ల**

**పంచుకొన్నవి తన్నదీ పంకజములు.**

జీవరత్నమయిన నిన్ను దొంగలించి, పుట్టి రతనాలు నాయింట నిలిపినాడు. ఇచ్చి, బులిపించి మరలపుచ్చుకొనుడ.. ఏమిటికి అలవాటు చేసినాడో యీశ్వరుడు.

నిన్ను ఉదరాన దాచుకొనుట చేతనే, ఈ దరిత్రికి రత్నగర్భయని పేరు తెచ్చుకొన్నది. నీవు తలమీద దాల్చి గౌరవించుట చేతనే, మసిబొగ్గు కోహినూరు వజ్రమయి పేరుగాంచినది.

ఒక సంవత్సరము పాటు దుఃఖించి, దుఃఖించి చక్రవర్తి శల్యమై నిలచినాడు. కాలం ఔషధం కదా. అన్ని దుఃఖాలకూ కాలమే ఊరట... మనస్సున దుఃఖభారము

కొంచెము ఉపశమింప ప్రియ సతికి శాశ్వతమైన స్మృతి సమాధిని నిర్మింప ఉద్యుక్తుడైనాడు.

రాజ్యమంతా చాటింపించి శిల్పులు ఆహ్వానించి, 'స్మృతిచిహ్నం' తయారు చేయమని కోరగా, అనేకులు ప్రయత్నములో తయారు చేసినారు. మొగలాయి రాజు మనస్సునున్న ప్రేమ రసమన్మద రూపముతో ఒక్కటీ లేదు అందు.

**"అనుభూత్యా వేశంబుల**

**జనితములగు లలితకళలు సాద్యములగునే**

**కనకపు పోటీలకుని**

**మ్మను జేశుల మెచ్చుకోలు మర్యాదలకున్"**

ఆదేశమున గర్భదరిద్రుడు భార్య వియోగమున కుమిలిపోతూ వున్నాడు. ఉన్మాదివలె శ్మశాన భూముల బూడిదలో బొమ్మలు చేస్తూ తిరుగువాడు.....

అతడు ఎన్నో రకాల సమాధి బొమ్మలను చేసి,తన ప్రేయసికై అర్పించి ఆనందిస్తున్నవాడు. ఆ బొమ్మలు రాజు చూచి అందొక బొమ్మ చిత్తము నలరింప రాజు యూహలో నుండి, మాట కందరాక మసలు ప్రతిమ, సృష్టి శిల్ప రమకు సిగపై నగవలె, ఆ పిచ్చివాని చేత అవతరించింది.

కళలు మోహించేది కులీనులను, భాగ్యవంతులనే కాదు, కులము లేదన్న వానిని కూడా అవివరించు. సత్కళాదేవత దయవలనైనా యీ ఉచ్ఛనీచతలు, యీ హెచ్చుతగ్గులు సమసిపోవలె.

బహు గ్రంథ పఠనము చేసినా, చేయవచ్చు, తప్పులను వెదికి పట్టవచ్చు – కానీ రస సృష్టి చేసే శక్తి ప్రతిభ సాధనతోరాదు. అది చదువు కాదు. చక్రవర్తి ఆ శిల్ప శిఖామణికి బంగారు బహుమానం అందించబోగా – ఆ శిల్పి చక్రవర్తి కృతజ్ఞతలు చెల్లించి యిలా అన్నాడు. – "ఆశలు సంహరించుకున్న వాడిని. నాకు నీ పసిడి నాణెములేల? నావలె వియోగ బాధా జీవులయిన మీకు, యీ విప్రయోగి కాన్క – "అంటూ బంగారాన్ని తిరస్కరించినాడా కళా తపస్వి.

యమునా నదీ తీరాన నిర్మాణ ప్రయత్నం బహు యత్నము ఆరంభమైంది. ఎందరో శిల్పుల ఊహలకు అద్భుత శిల్పరచన అచట సాగినది.

**"కలము నందుకొన్న కవివేణ్యునిమ్రోల**

**తలలు వంచు శబ్దముల విధాన**

**నాటి శిల్పి చెంద నవనీతముబోలి**

**మెత్త దనము దాల్చె మేటి శిలలు"**

ఇరువదేండ్ల శిల్పుల శ్రమ ఫలించి తాజమహల్ పుష్పించింది పాలరాతి తెల్ల గులాబీ పుష్పమా అన్నట్లు.

“కుమిలిన పాదుషా హృదయకుండమునన్ దల్రకిందు లైనవి.

శ్వముల వికార నాట్యరభసంబున రేగిన వేదనా పరి

భ్రమణమునందు జింది వెలివాఱినవెచ్చని కంటినీరు తా

జమహలు ఱాలపై నుదయ సంధ్యలుఁ బల్పు హిమచ్ఛలంబునన్

“కలదే స్వర్గము లాతిచో ! కలుగు నిక్కంబిద్ధియే, నీతిమంతుల విశ్రాంతి నికేతనము”.

ఆ తాజి పొంత నిద్రాణములై నశించి అమృతాంశుని పున్నవి నాటి కాంతులు...

షాజహాన్ కడగొట్టు తనయుడు ఔరంగజేబు, అన్నలనధించి సింహాసనము అపహరించి... కన్న తండ్రిని చెఱసాలలో బంధించినాడు... కాల మాంత్రికుని పనులు వికటములు...

రాజు మరణించినంత వరకూ చెరసాల రంధ్రము నుండి ఒక గాజు ఫలకము నుండి ఆ తాజ్‌ను తదేకంగా చూస్తూ, ప్రతి దినమూ తాను ముంతాజ్‌కు దగ్గరగా వుండేవాడట.

ఒకనాడు అటు చూస్తూనే శాశ్వతంగా కన్నుమూసినాడు చక్రవర్తి.. ప్రేయసిని చూడ...

**“రాజు విడిచిపోయె రాజు నొంటరిజేసి**

**రాజు విడిచిపోయె రాజ్యరమను**

**రాజ్య రమయు విడిచె రాజుల బెక్కండ్ర**

**తాజి విడువలేదు రాజసంబు”**

**"I live thee with the breath**

**Smiles, tears of all my life-If God Chooses**

**I shall but love thee better after death"-**

**ఈ చరిత్ర మాయదూ**

**ఈ కథ నిలచి పోదూ**

**చుక్కల పువ్వులు రాలునందాక**

**వెన్నెల వానలు కురియునందాక...**

**ఎద తలపులు తెరచి నేను**
**మోయిలు దారిన కనులు పరచి**
**ఎదనిండుగ నిన్నునింపి**
**నన్ను నేను మరచిపోతి...**

**జీవన గమనము అనురాగ గీతము**
**హృదయ బంధము ఆమలినరాగము**
**కలచెదరి పోయినా కనుపాప నిత్యము**
**కథ నిలచిపోయినా యీ కావ్యమమరము –**

– కవిసుత

* * *

# ముసాఫరులు

"Into this universe and why not knowing;
Now whence, like water willy-nilly flowing;
And out of it as wind along the waste
I know not wether, willy-nilly blowing

“ఇహానికీ, పరానికి ప్రయాణించే రెండు ఆత్మలు సమావేశమే ఇందలి కథా వస్తువు. అద్యతన ప్రపంచ వ్యవస్థ దిఙ్మాత్రంగా ఇందు వర్ణితమైంది.”

నా యీ కావ్య సృష్టికి పురొకొల్పిన ఏకా ఆంజనేయులుగారిని ఒకనాడు చూడబోయినాను.“నేడే కావ్యము రచించు జాష్వాయనే “సాహిత్యాభిమానముతో”

ఏమి వ్రాయగలుగుదును యీ వయస్సులో, కలము వృద్ధమయ్యె, కవి యూ వృద్ధుడయినాడు. కొత్త కబ్బము ఎట్లు కూర్పలగను?

నా కవితా శారద, “నాకిది అవమానము కవీ, నేను వృద్ధనౌదునా? అని నాలో కువకువమని కలమునందుకొమ్మని నన్ను కుదిపినది.

ఆనాండతయు ఆలోచన చేసి నాకూ నూతన భావానికీ – ఆ రాత్రి వేగు చుక్క పొడుపుతో.. మా పక్కింటి వినూత్న దంపతులకు ఆనందము కూర్పగా కల్మషమంటని ముద్దుపాప కెవ్వుమన్నది. భూమిపై పడగానే ఆ పాపని ప్రధమ కేక నా కావ్యానికి వస్తువై నా కలాన్ని నడిపింది. అది ‘ముసాఫరులు’ కావ్యమై అవతరించినది.

చైనా యుద్ధాన వీరమరణం పొంది, మేఘాలపై ప్రయాణించి మార్గమధ్యన వున్న ఒక సత్రమును చేరి సేద తీర్చుకొనుచున్నాడు. ఒక వీరుడు.

అతని కాయాన గాయాలు లేవు. ఆయాసము లేదు. హృదయాన అవ్యక్తమైన హాయి పొంది సుఖించెను. విహాయనమంతా ఒక కాంతిగోళమై కన్పడినది. తన చుట్టాలు, కన్నబిడ్డలు, భార్య, తల్లిదండ్రులు ఎవరూ అతని వెంబడించలేదు. ‘వీరమరణం’ అన్న

పేరు తప్ప ఇంద్ర దనుస్సులోని ఏడు రంగులు మేన అంటుకొని, కొన్నినాళ్ళు అచట ఆత్మానందము పొంది, తారకా కిరీటం ధరించి మెరుపుల తోటలో వాలినాడు.

అదే సమయాన ఇటు భూలోకమున పుత్ర సంతతికై తపించిన దంపతుల, కోరిక యీడేర్ప – నీలాకాశం నుంచి ఒక కొత్త ప్రాణి ప్రయాణమై వీరుని కలుసుకొనెను. ఆ వీరుడు ఆ నూతన ప్రాణిని చూచి, "జగతికి ప్రయాణమా? సెభాష్", అంటూ కౌగలించుకొని ఆనంద భాష్పములు రాల్చెను.

"సర్వేశ్వరునికి కుశలమా? అమరుల క్షేమమా? రంబాదులు కుశలమా? ఆయువు నీకెన్నేడులు నుదుట వ్రాయబడె? నీ ఉనికి భారతదేశమే కదా? ఏ కులమున పుట్టబోవుచున్నావు? – వీరుని ప్రశ్నలకు ఆ చిరు ప్రాణి" ఈ వివరములన్నీ నాకు తెలియవు. ధరణీ చక్రము వంకకు నను బలాత్కారముగ పొమ్మన్న – ఉరు వాయువేగాన తోయుచున్నది ఏదో శక్తి –

అవనికి పొమ్ము, దేహము తాల్చుము యిది నీ కర్తవ్యమని ఎవడూ చెప్పడు. పోవుచున్నాను. పిమ్మట ఫలితమెట్లుండునో తెలియదు వీర వరేణ్యా !–

జన్మ సార్థక్య మయ్యె కార్యములు ఏవి? పాప పుణ్యములు ఏమి? తల్లి గర్భమున తలదాచుకొనుట ఏమి? నాకు విశద పరుచుము – అంటూ ఆ చిరుప్రాణి వీరుని వేడుకొన్నది. ఆ వీరుడు తన జన్మగాథను ఇట్లు చెప్ప మొదలిడినాడు.

**పుట్టువు గుట్టు దాచుకొని పుట్టిన పిమ్మట నేటికి ధరన్**
**పుట్టితి నంచు పెక్కు యుగముల్ తలపోసిన తేల్చలేని యీ**
**మట్టి శిరస్సునిచ్చి పరమంబున డాగిన నాథు డొక్కడు**
**న్నట్టుగ దాఖలాల్ దొరక వప్పటికిప్పటి కద్భుతంబగున్**

ఈ అనుమానంలో పడిన, అసాంఖ్యాకులు జననమందినారు, వేదాలు, పురాణములు కూడా ఇది ఇదీ అని చెప్పలేదు. 'నలుగురు లేడు' అని 'నలుగురు ఉ న్నాడని' యీ వాదనలలో యుగాలు జరిగి పోయినవి. ఈ అస్తినాస్తి వాదాలు మూలములేనివి వివాదమగ్నములు.

ఆ అవనిలో నరకము – స్వర్గము సరి సమానముగా సాగుతూ వుంటాయి. వాటికి తోడై సత్యము – అస్యతమూ రెండు వేపులా మ్రోగుతూ వుంటాయి. కరుణ –కాఠిన్యములు ఎదురుగా నడుస్తూ వుంటాయి. వీటిని ఆధారంగా చేసుకొని ఎన్నో మతాలు సర్వేశ్వరుని ప్రసంగాలతో ఎల్లప్పుడూ సతమతమగు భక్తులు గలరు. ఇతరేతర రభసలే తొడలు చరుస్తూ వుంటాయి.

పిలిచిన పలికే దేవుడు వున్నట్లయితే, "నీవు మోసగాడవు" అంటారు వారే, పలుకు గిలుకూలేని వాడే శక్తి గలవాడు, మహిమలున్నవాడు అవుతాడు ధరణిలో.

మరి ఎవరు యీ జగాన మరణించి నా సజీవులై వుంటారు? అని అడిగితే

**"నామ రూప రహితులైమంటి పాలైన**

**మానవాళిలో మహానుభావు**

**లైన దివ్య పురుషులే నిల్తురనయంబు**

**గగన మందు విశ్వజగమునందు"**

భూమిపై మానవులకు ముసలి తనమనే ఒక దశ వచ్చి తీరుతుంది. నీరస దేహము ప్రాప్తమై, ఆలోచన, చైతన్యము, శక్తి తగ్గి ఇతరులపై ఆధారపడే స్థితికి చేరగానే ఆప్తులకు వారు భారమై, నిన్ను ఆదరింపరు. సత్తువ తరిగిన దేహాన చర్మపు తిత్తులు వ్రేలాడుతూవున్నా కోరికలు తీరవు.

మరొక వింత మనస్తత్వం, మానవ పకృతికి వికృతమైనది ఏమంటే, బ్రతికియున్న వేళ మెతుకు పెట్టనివారు చచ్చిన తరువాత 'తద్దినం' జరుపుతారు. స్వర్గలోకములోని వారి ఆప్తులకు సద్గతులు కలుగుటకు, యిక్కడ వారు విందులు కుడువగలరు.

ఇక్కడొక తమాషా సాగుతున్నది. స్వర్గము, మోక్షము గురించిన అద్భుత కాంక్షలు రేపే వర్ణణలు ఎన్నోవిని, చదివినా.. భూమిపై పడిన ప్రాణి మరలా స్వర్గముగినకు పోవ ఇచ్చంచరు. ఎందుచేతనంటే ఇచ్చటి ప్రకృతి సౌందర్యము యిచ్చటిలోక సౌఖ్యములు, ఇచ్చిటి అనురాగాప్యతలు, బంధు బంధాలు అచట లభించవు గనుక.

**"ఇక్కడి యిండ్లు వాకిళులు యిక్కడి వాంశిక మోహజాలముల్**

**ఇక్కడి కొండలున్నదులు, ఇక్కడ పున్నయీనాటి వెన్నెలల్**

**ఇక్కడి మంద వాయువులు, ఇక్కడి పుష్పవన ప్రదేశముల్**

**మక్కువ పుట్టనీయవుని మానవుని స్వార్గిక జీవితంబుపై"**

ఒక మహాత్ముడు అహింసను బోధించచనివాడు. ఒక మహాత్ముడు ప్రేమకు పాదులు చేసినాడు; మహర్షులు, మత పీఠాధిపతులు, నీతి న్యాయము, ధర్మము, జాలి, దయ గురించిన బోధలన్నీ నిజజీవిత గమనములో 'హుళక్కి'గా మారుతాయి. గ్రంథాలయాలు, వాఙ్మయము పెరిగినది. మానవత మాత్రము పెరగలేదు.

ఇక ఒకవేపు మానవులంతా దేవుని బిడ్డలని చెప్పే బోధకులు ఎందరో. కాని ఆదిలో నాలుగు జాతులన్నారు. మరి ఎవరి దయవలనో భారతాన యీనాడు వేనకువేలు వర్ణాలు, కులాలు మొలిచినవి.

మనవాడా కాదా యనే అనుమానం తీరకుంటే, ఆ బ్రహ్మదేవుని అబ్బను కూడా లక్ష్యపెట్టని వారుంటారచ్చుట.

విజ్ఞానం వున్నా, అంతకు పదిరెట్లు అజ్ఞానమూవున్నచో... అవసరాలలో యీ విజ్ఞాన ప్రజ్ఞలు ఏమీ పనికిరావు లోక జ్ఞానం ముందు ఇది సత్యం.

ఎంత చీకటివున్నా వెలుగు వున్నది గనుక చీకటిని భరిస్తున్నాం. అలాగే, యీ అధ్యతన ప్రపంచాన ఎంత నాటకం జరుగుతున్నా, మహా మహోన్నతులైన మానవోత్తములూ వున్నారచట. వారి ఉనికి సమాజ శాంతికి మార్గం. దీపం – స్వార్థము వున్న చోటనే త్యాగమూ వుంది. లోభత్వం వున్న స్థానే, దాతృత్వమూ వుంది. కఠినత్వం గల స్థలాన కారుణ్యమూ వుంది. అంచేత ఆ భూమిపై జన్మించి ఎదుగుతూ వున్న జన్మ భూమిపై ఎనలేని మోహం చుట్టు కొంటుంది. "జననీ జన్మభూమి సర్గాదపీగరియసీ" అని పాడుకుంటూ వుంటాం...

**"తన తనూస్వేదము ధారవోసి గడించు**
**ధన మర్థిజనులకు దానమిచ్చి**
**తన సౌఖ్య మొరుల సౌఖ్యమున కంకిత మిచ్చి**
**అతి రహస్యముగా బ్రతుకు నడిపి**
**రోగులై పెరవారి బాగౌషధంబుగా**
**భావించి సత్కార్య పరతనలరి**
**న్యాయంబునకు చిన్నిగాయంబు గానీక**
**క్రూర కర్మల నెదుర్కొని యదల్చి**
**అహము నంటనీక స్వార్థంబదిగమించి**
**గండరించి యున్న కరుణలగుచు**
**ధరణి వాసమున్న దైవంబులందందు**
**గోచరించుచుంద్రు కువలయమున".**

ఈ నరజన్మము ఒక చో సుఖకరమగును. నొక్క రీతి దుఃఖమయంబై వికటించు. ఉభయములు కర్మకులోనై యుంటారంటారు జ్ఞానులు...

నేను చేసిన యుద్ధమున, నాతోపాటు మరణించిన చైనీయులూ నీ వెంటనున్నారు. వైర భావము వదిలి స్నేహ భావతో మాట్లాడుకున్నాము. ఇక్కడ లభించిన యీ శాంతి స్నేహ భావమే. ఆ భూతలాన పొంది పొసగినచో – ఆ ఉర్విలోనే కోటి వైకుంఠాలు చూడవచ్చును గదా...

అచటి దాంపత్యమూ, సాంసారిక జీవనమూ సుఖ భరితమూ, ప్రేమాను బంధమే. కాని ఆడతెగ, మగతెగ అనే తేడాలే అనర్ధదాయక మచట.

ఆడది లేకున్న సాగదు, ఇహపరాలూ సాగవు స్త్రీలేకుండిన, కానీ స్త్రీని వ్యర్ధజీవిగా భావించి బంధించి అచట స్త్రీని బందీగా చేసివాడు కొనేకుసంస్కారమచట కలదు.

**"భూషణ సంతృప్తిం తన**

**ఘోషా చెరసాల నోర్చుకొనుగాని మదిన్**

**రోషం బూనదు భారత**

**యోషామణి కున్నసహన మర్వికి గలదే?"**

నా జననము అటు ఆంధ్రదేశాననే, నా చినతనము, నా చదువు, నా వివాహమా అచటే జరిగినది.. ఎదిగే కొలది ఆ సమాజం, దాని పోకడ, మనుషులూ వారి వివిదాకృతులూ నాకవగతమైనవి....

ముందు మనల పలకరించేది కులం, వంశోన్నతి, స్వర్గనరకాలు ఇవన్నీ మనం వింటూ వుంటాం... వీటన్నింటినీ మించి "నన్నుచూడు' అంటుంది ధనం.

నేను నీకు కొన్ని మాత్రమే వివరించగలిగితిని. నీవునూ అచట జన్మించి, పెరిగిన కొలదీ లోక వ్యవహార జ్ఞాన సంపన్నుడవు అవుతావు... ఒక్కటి మాత్రం విను..

**"నీరంటకుండ నీటన్**

**స్వారి సలుపు ఈత పుర్వువలె సంస్కృతికా**

**సారము తరించి శుచివై**

**పేరందుము లోకహిత కవిప్రవరుడవై" అని చెప్పి**

**ఆ వీరుడు మింటిదెస కెగసినాడు.**

ఈ చిరుతప్రాణి భూతలమున కొన్ని మాసములకు సముద్భవించె ఒక ముద్దరాలికి...

**తల్లి అతనికి జోలపాడుతూ, "చిట్టితండ్రీ**

**పురిటింట పాదము మోపి, భువనమును**

**కలియజూచి ఏడుస్తావేల తండ్రీ!**

**ఆనాక లోకము నీకు మరలారాదు దిగంబరీ !**

ఇటచి కామక్రోధ లోభాలకు గురియై పోక తప్పదు తనయా అంటూ తల్లి మరింతగా వినిపించింది యీలోకరీతి –

**"ఏడువ కన్న నిన్నువలె నేడిచి నారొకనాడు భూపతుల్**

**గూడ మహీతలంబనెడు కుంపటిలో బడినాడవప్పుడే**

**మూడు నిమేషముల్ గడచె, ముందిక నీకు దయించి యెందరి**

**ట్లేడుతురో గ్రహింపుమది సృష్టిరహస్యమురా, స్తనందయా"**

అతడు ఎదిగి ఎదిగి, నీతి, నిజాయితీ, వాక్చాతురి, కార్యదీక్ష, కారుణ్యంబు; పూతమగు అతని కోమల చేతంబున మొలకలెత్తినవి చినతనాననే.

శాస్త్ర పారంగతుడైనాడు. మంచి కవి అయినాడు. రసవత్కావ్యములు రచించినాడు.

**"పసిడి గరిటె తోడ ప్రభవించె కాని**

**పాలు పడదు భోగ లాలసతకు**

**దమ్మిడీ లోసంగి దాతగా పేరంది**

**విఱ్ఱవీగి తిరుగు వెర్రిగాడు"**

వీరయోధుని ఉపదేశములు క్రమంగా అతని హృదయరంగమున మొలిచి ప్రబలమై, విస్తరించి పుష్పములు దొడిగినవి. అవి పండి మానవత్వమును సృష్టించినవి.

అతడు పెరిగి పెద్దవాడై నూరేండ్లు జీవించి అశాశ్వతమైన యీ క్షితిని విడిచి, శాశ్వతమైన, పరమునకు ముసాఫరుడైచనెను –

మరి యోధుడు ఏమైనాడు? అతడు దేహము విడిచి అంబర వీధుల విద్యుదుజ్జ్వల జ్యోతి విధాన లేచి చనినాడు.

తరంగాలు లేని, స్వచ్ఛమైన అద్దమువలె వున్న, పారిజాత పువ్వుల రజముతో విలసిల్లు నాక సెలఏరు సరసన చేరెను రత్నకాంతులు విరజిమ్ము ఒక మందిరాన విశ్రమించినాడు అవనీతల దుఃఖము విస్మరించి.

ఆ మందిరాన ఒక చోట ఒక దూత వాలినది. సరసులగు విబుదులైనవారి సచ్చరిత్రలున్న గ్రంథము ధరించి.

మన యోధుడు అది గని "ఏమత వర్ణ ప్రముఖుల నామములున్నవి? అని ప్రశ్నించగా, ఆ దూత అతనితో ఇట్లనెను..

**"లేవిట వర్ణ భేదములు లేవిట నెట్టిమతాలు సత్ప్రియా**

**పావన మూర్తులే యిట నివాస మొనర్తురు, దాంబికాలకుం**

**దావు లవంబులేదు. కులతత్వము చెల్లదు, చెల్లునెమో**

**పృథ్వీ వలయంబునందు, అవివేకులు గీచిన పుస్తకాలలో"**

నీవంటి దేశ భక్తిగల, త్యాగులైన వీరులకు ఇందు చోటు గలదు.
"ఎటువంటి విజ్ఞాన వంతులుదయించిన లోకము
ననూ, మానవులందరూ ఒక తల్లి బిడ్డలనే భూరి
వివేకములోపమైనచో పుట్టనుబట్టి పుట్టనే
చచ్చిన చెదపురుగులైనవారు యిచట అనర్ఘులు.

* * *

# కాందిశీకుడు

**"ఉరక పోదు బుద్ధుని మృదూక్తి పటుత్వము క్రీస్తు ప్రేమవా**
**క్సారము, రామకృష్ణముని చంద్రుని తాత్విక సౌరభంబు, ని**
**స్సారము లీ కటారుల ద్విషజ్జయముల్, తుదిలేని తృష్ణకున్**
**కారణభూతముల్, తెరపికానని చింతలకు జిరాయువుల్".**

ఇందలి కథ కేవలము కల్పితము. ఆంధ్రుఁడగు నొఁక బర్మా కాందిశీకుఁడు ప్రాణభీతిచేఁబరువులిడి భయంకర గిరి గహననదీనదములను నుత్తరించి కొండొక రేయి నొక కీకారణ్యమును బ్రవేశించి, చిక్కువడి కష్టములను దలపోసి కొనుచు క్రూరసత్వములనానావిధభీషణ ఘోషణంబుల కులుకుచు నిట్టట్టు నడయాడుచుండు, మానవకపాల మొకటివాని పాదములకు దగులగా, నులికిపడి కొంతవడికి నిబ్బరించి, దానివంక నారయుచు మరణస్తవము చేయుచుండ, నప్పునుక పకపక నవ్వి కుశల ప్రశ్నలు చేయును. పాంథుఁ డావైచిత్ర్యమున కద్భుతపడి దానితో ముచ్చటించును. అక్కపాల పాంథులకు జరిగిన వాదోపవాదములే యిందలి కథావస్తువు.

నిరపరాధులగు మానవులకు నిష్కారణముగా నాహుతిఁగొనుచున్న నేఁటి ప్రపంచ యుద్ధభీషణకాలమున శాంత్యహింసలయౌత్కృష్ట్యములను స్థిరీకరించుటయే నా యాశయము.

"కేవలం కల్పనాకథలు కృత్రిమ రత్నములు" అని భట్టుమూర్తి, సిద్ధాంతము; కాని, కాలపరిణామము ననుసరించి కవి నావేశించిన సత్యమును వ్యక్తీకరించుటకత డెన్నియో పథకములను సృష్టించుకొనును; అవి హృదయంగమములైక రసోత్పత్తిని గల్గింపఁజాలినచో, కల్పితాకల్పిత, వివక్షతకు తావులేదు. – జాషువ

యుద్ధమృత్యువు ఆకాశాన రెక్కలు విప్పిసంచరిస్తూ... మానవ శాంతి జీవనంపై నిప్పులు కక్కుతూ వుండ... భీతిచే ఒక పౌరుడు దానినుండి రక్షించుకొనుటకై ఒంటరిగా

పరుగులు తీసి ఒక మహారణ్యాన చిక్కుబడినాడు. అలసి సొలసి ఒక వృక్షపు నీడ చతికిలబడి నిలచినాడు. వయస్సు ఉడిగిన ప్రొద్దు అపర వనధిలో మునిగిపోయె. పొక్కిన పాదాలతో, భీతిచే ఒణుకుతున్న గుండెతో, ఆకారడవిలో కన్నుల నీరు కుక్కుకుంటూ ఆ రాత్రి గడపసాగినాడు, కాందిశీకుడు.

అడవి జంతువుల అల్లకల్లోలం చేసే సింహాలకు నమస్కరిస్తూ, గాలి తాపునకు ఊగిపోతూ, జడలదెయ్యాల్లా! భయపడుతున్న వృక్షాల గుంపులకు మొక్కుతూ – ఊరకూరకనే గ్రుడ్లురిమి నిప్పులు కక్కె గుడ్లగూబలకు ఏటికోళ్ళు నెరపి– కదలుతున్న దిపాలా అన్నట్లు కనపడే చిరుత, పెద్దపులులకు పూజలు చేసి –

అడివిసత్తిని, ఎదలో భజిస్తూ.... ఆపదలలో వున్నప్పుడే భక్తి పదింతలవుతుందనే నిజాన్ని నిజంచేసి చూపుతున్నాడా భీరువు బాటసారి.

కొండలు ఎక్కిదిగి, ఏరులుదాటి అడవి ఫలాలు తింటూ... అస్సాము దేశాన్ని దాటి ఉత్తరంగా ప్రయాణము సాగించి భారతదేశాన కాలుపెట్టినాడు... అడవులు, నదులు దాటి ఆంధ్రలో అడుగిడినాడు.

పర్వతములు, నదులు, ప్రతి పదార్థమూ అతనికి స్వాతమిచ్చి, ఆదరించి, పల్కరించినట్లు ఎంతో ఆనందాన్నీ కలిగించాయి. కన్నతల్లిగదా కన్నభూమి.

నల్లమల కొండలందు ఒకనాటి రాత్రి ప్రొద్దుపుచ్చినాడు. రోజుల స్నేహం వలనే యీ అడవులన్నా అతనికి మిత్రులై, తన ఇంటి తోటలుగా అయినవతనికి...

భరించరాని ఆకలి అతనిని దహించి వేస్తున్నది. చీకాకుగా నున్న అతని మనస్సున ఆకటి సోదచే అలమటించే సమస్త దీన మానవులంతా అతని ముందు కనపడినారు. అప్పుడర్థమైనది. 'ఆకలి' అంటే ఏమిటో?

భాగ్యానికి తెలియదు భాగ్యహీనుల దుస్థితి. సౌఖ్యానికి అర్థం కాదు, కష్టము యొక్క బాధ... నిగ నిగలాగే పాలరాతి రాళ్ళపై మెత్తని చెప్పులు ధరించి నడచిన పాంధునకు యీనాడే అర్థమైనది. – కఠిన కాంతార భూములలో కట్టెలు కొట్టి జీవించే పేదల పాదాలస్రవించే రక్తధార బోధించిన బాధా మయ సందేశాలు.

సంపన్నుల కేమి తెలుసు లేమి పెట్టె కష్టాలు. ఆ సంపన్నులు లేమిని అనుభవించిన దాకా –

కలవారి స్త్రీలు ఎండకన్నెరుగక హాయిగా భవన నీడల తిరిగి శంపావల్లురులై, సౌందర్యాన్ని కాపాడుకుంటూ మసలే వారికి తెలియదు – కొండలలో కోనలలో వీపున పిల్లల కట్టుకొని కష్టము చేసే కష్ట చరితుల గాధలు...

ఆ కాందిశీకుడు ఇట్లు ఆలోచిస్తూ వుండగా, అతని పాదాలకు ఒక మనిషి పుర్రె తగిలింది.

**"వసుధననుబోలునొక మందభాగ్యుడెపుడో**

**తనువు చాలించి యుండు**

**ఉభయ లోకాల అనుభూతి ఉల్లసిల్ల**

**శాశ్వత సమాధినున్న నిశ్చలుడితడు –**

అతనిఆలోచనలు సాగినవి. చలనము లేని యీతని ప్రశాంతము భంగము చేయలేవు వేనకు వేలు ప్రళయములు, యుగయుగాలను మార్పుచేయు యీ భూతల నటనా కథాంశములు ఎన్నో మెలుకువ లేని యీ కపాలముపై నటించిపోయెనో ! కాల సముద్ర గర్భమున" –

అని పలుకుచున్న కాందిశీకుని తనువు పూలకరింప, గుండె దడ హెచ్చుగా ఆవనమంతా మారు మ్రోగగా ఆ కపాలము అట్టహాసంగా ఇట్లున్నది.

"ఓ పాంథా ! మరణస్తవము చాలించు మిక, దీనమానవ కోటిని మురిపించే మాటలివి. రిక్తవాదనలు".

ఆ పునుక మాటలకు బాటసారి ఆశ్చర్యాంబుధి మునిగి, మరలా తేరుకొని "ఓహో! పుర్రెకదా!" అని గుండెదడను ఆపుకొన్నాడు, శాంతి చిత్తుడై".

భయము వదిలి, నమ్మి నమ్మలేక చూస్తూ బాటసారి మారుపలుకుతూ "యీ దౌర్భాగ్యుని కష్టపెట్టగా ఎదురైన కర్మవా? లేక యీ అడవులలోని రక్కసివా? చచ్చిన నీవేల పలకగలవు? ఈ చిత్రమేమిటి? నా అనుమానము తొలగజేసి నన్ను శాంతింప చేయుము".

అతని మాటలకు కపాలము పకపక నవ్వి "నేను కర్మనుగాను, చిలిపి రక్కసినిగాను యీ జగతిన నీవంటి మనిషినే, ఈ విశ్వాన్ని వదిలిన ఒక బౌద్ధ భిక్షువును– భయం గొలిపే మానవ కపాలాలను నేనూ ఎన్నో చూచాను నా జీవిత కాలాన, సృష్టి చిత్రం ఇది. దీనికి చింతపడకు సోదరా! – రేపట మాపట నీవు నూ నావలె తనువు బాసి యీపరేత భూముల చరింతువు.

మా విద్యుద్దేహము ఏనాడో దుమ్మైపోయనది. యీ ఎముకలగూడు నిలచినది. మా ప్రాణాలు యీ ఎడారి గాడ్పులలో కలసిపోయినవి... మా బంధువులు చిందించిన భాష్పధారలతో ప్లావితమైన మా కపాలమాల భూమాత కుమాలయై ఋణము తీర్చుకొన్నాము. మా అస్తిపంజిరమూ జీర్ణమై, దుమ్మై యుగతీరాన బంగారు పంటచేలకు ఎరువులమై మా ఋణము తుద ముట్టగ తీర్చుకొంటాము.

సోదరా అటు పరికించొకసారి! యీ నిశ్శబ్ద నీరవవనీ భూముల ఎందరో మెరపుల్లా జీవించిన మానవులు – యీనాడు ఏ స్థితినున్నారో చూడు... నశించే యీ శరీరములో ఎన్ని అహంకృతులు ! ఎంత స్వార్థాపేక్ష! ఎంత కాంక్ష! ఎంత బంధు ప్రీతి.. ఏమైనవో అటు చూడు యీ జీవన సత్యం గ్రాహ్యమగును –

**అది, మొన్న మొన్న దేహం బూడ్చి విశ్వంబు**
**వాసి వచ్చిన పిల్లవాని శవము,**
**అది, రాజ్యకాంక్ష నాహవభూమిలోనఁ గూ**
**లిన రాచవాని కళేబరంబు**
**అది. మనుష్యులఁ జూచి బెదరి యవ్వల బడ్డ**
**ఆచారవంతుని యస్థిపేటి,**
**అది, బిట్టు టాకఁటి సౌదకు నగ్గంబైన**
**కడు పేదరాలి కంకాళయష్ఠి.**

**అది మహోర్తుల ప్రబల దాహములు దీర్పఁ**
**గనులు దడిసిన యార్ధచిత్తుని సమాధి;**
**మృత్యువశమైన మా తనూమృత్తికలను**
**వాయు ధూర్తుఁడు తూర్పారఁ బట్టఁ దొడఁగె.**

మోక్షప్రాప్తికై అందరమూ అర్రులు చాచినవారమే. శాశ్వతీనందం కోసం, శాశ్వతముక్తి కోసం ఎంత తపస్సు! ఎన్ని పూజలు ! జీవితమంతా ఎదురు చూచి, చూచితి యీ క్షణం కోసం! కానీ.. యీ నాటికీ మాకు పరలోకపు తలుపులు కూడా కనబడలేదు. ఈ విశ్వ మానవులు ఆశించే ఈశ్వరుని కంఠస్వరం మావీనులకింకా సోకలేదు. ఆనందన వనంలోని పుష్పగంధం మా తనువుల నింకా తాకలేదు. అమరులు భుజించే అమృతము మాకు అందలేదు. శతాబ్దలంతరించినవి మాపై, కానీ అమర లోక నివాసము మాకు అమరలేదు. – మా విశ్వాసము సగలుచున్నది. మానవుల నూరించే కల్పిత గాధలివి. తేనె పలుకులు సోదరా –

కపాలం వెలగ్రక్కిన భావాలు కాందిశీకునిలో కోపం ప్రజ్వరిల్లింది, మతం పోసిన నిషా మత్తులో మ్రగ్గినవాడు కదా, అన్నాడు గదా," వేదాలను తలక్రిందులు చేస్తున్నావా? భ్రష్ట కపాలమా? లేదా స్వర్గము? సృష్టికర్త లేడా? ఎందుకీ వ్యర్ధపు మాటలు. నీవు చచ్చి సంపాదించిన జ్ఞానం ఇదా? పిచ్చి పుర్రెవు కదా మరచితిని.

పునక మిత్రుడు పాంధుని మాటలు శాంతంగా ఆలకించి, మరింత మృదువుగా అన్నది" – తమ్ముడూ ! ఎక్కడ శాంతి స్థాపన రహిస్తే అది స్వర్గం. ఎచట అశాంతి ప్రజ్వరిల్లితే అది నరకం.

ఆర్థిక, సాంఘిక సమత ఎక్కడ వుంటే అది స్వర్గమే. ఈ ప్రపంచ మానవులందరి దుఃఖ కారణం అన్వేషించుటకై సిద్ధార్థుడు, సర్వసంగ పరిత్యాగం గావించినాడు. త్యాగం ఎందకూ అంటావా? సర్వసంపదలు, సుఖాలు అనుభవిస్తూ, ఎవ్వడూ బాధకు మూలం? దారిద్ర్యానికి కారణం? అశాంతికి ఆధారం కనుగొనలేడు తమ్ముడు...

ఈ సమాజాన ఆకలి చిచ్చులోపడి నలిగే దీన భిక్షుకులు కనపడని చోటు స్వార్థాన్ని పెంచి పోషించే 'తృష్ణ' ప్రవహించని స్థలం –

హెచ్చుతగ్గులు, ఉచ్ఛనీతులు రాజ్యం చేయని భూమి –

మతాల పేర మారణహింస సాగని వాతావరణం – టక్కరి ఎత్తుగడలు, నిరుద్యోగం, ఇవి కాలు పెట్టని చోటు.

అంతేకాదు ధనము, ధాన్యము ఒకని అధికారము కింద కట్టుబడే వుంటే ఇక సమానతకు తావేది –

ఇటువంటి సమాజం 'స్వర్గం' కాదా? నేనుపుట్టి గిట్టె ఎన్నో ఏండ్లు గడిచిపోయినవి' – ఏమి మార్పులు సంభవించినవి? ఏ మతాలు పుట్టుకొచ్చినవి? కట్టుబాటులేని ఈకాల రథము ఏఏ పోకడలు పోయినది?–

పలనాటి రణము ఎట్లు పరిష్కరింపబడినది? ఆ యుద్ధాన ప్రల్నాటి అభిమన్యుడు, బాలచంద్రుడు విహరించిన వీర భూమిలో బుద్ధుని బోధలు మొలకెత్తైనా? వీర ప్రతాప పౌరుషాలతో హింసామార్గమే గొప్పదని నేటికీ భావిస్తున్నారా?–

నాగులేటి ఒడ్డున జరిగే ఆ పీడ, కోడిపుంజుల వేటసాగుతున్నదా? ఆ మాచర్ల చెన్నుని ముందు బలులు ఆపగలిగినారా? మహాసతులను ఆహుతిగొన్న సహగమనాచారాదహనజ్వాల ఆపినారా? సంపదలు, జ్ఞానం అణిచి బుద్ధి నశింపజేసే త్రాగుబోతు తనమును మానుకున్నారా?

పునక పల్కులు విని కాందీశీకుడు కినుకమాని బుద్ధుని వలన జరిగిన నష్టాన్ని యుగ చరిత్రను చెప్పసాగాడు !

పునక మిత్రమా ! పులులను మేకలుగా చేసిపోయిన బుద్ధుని శిష్యుడవు గనుక నిర్వీర్యమైన మెట్ట వేదాంతాన్ని బోధిస్తున్నావు. ఎక్కడి నాయకురాలి కథ? ఎక్కడి బ్రహ్మనాయుడు? మీ యుగమెక్కడ? నిదుర లేవని నీతల పై ఎన్నో వసంతాలు నిశ్శబ్దంగా గడిచిపోయినవి; మా యుగాన కొత్త కొత్త వూహలు చెలరేగినవి.

నాయకురాలు, బ్రహ్మన కథలు యీనాడు గుమ్మెట కథలైనవి. వారి కత్తులు, బల్లెములన్నీ తుప్పుపట్టి కార్యంపూడి తిరునాళ్ళకు, అవి ప్రదర్శింపబడుతవి.

మీ శాక్యముని పోసిన పిరికి మందు వలన, యీనాడు ఒక్క పొట్టి చైనీయునకు వెరచి పరుగు దీస్తున్నాము కపాల మిత్రా!

ఎక్కడ బుద్ధుని బోధలు అతి భక్తి మీర పెగోడాలు కట్టినారో, మరి అక్కడే, వాని ముందే కదన సత్తిని నిరపరాధుల రక్తంతో తడుపుచున్నారు.

అదిగో శివాజి కత్తులాడించిన కదన భూమి, అది ప్రతాపుని వీర కథన సైంధ వహేష ప్రతి ధ్వనులు వినిపించిన పర్వతము అది రాయల రక్తంబు తిలకంబుగా దిద్దుకొన్న భూమి – భారతాన పౌరుషం చిమ్మని అణువు లేదు. వయస్యా ! తల్లులు వీర రసమునే ఉగ్గుపాల పెంచినారు. బిడ్డలను, యిటు యీనేలను ఇప్పుడు మాకు కావలసింది, అహింస కాదు.... చచ్చు తనం కాదు – వీరరసం కావాలి... పౌరుషం కావాలి...

**"గీతా కృష్ణుడు గావలే**

**నీ తరుణ మందు, గాంధి యేమిటికి? మహా**

**గౌతమ బుద్ధుండేటికి?**

**మా తను వల్లికలు పిరికి మందులు జివికెన్"**

కాందిశీకుని తలకిందుల అభిప్రాయం వింటూ, పునుక మిత్రము మరింతగా చలించినది...

మరలా కాందిశీకుడు చెప్ప మొదలిడి నాడు...

కపాల మిత్రమా! నా మాటలు నీకు – ఒకనాటి అహింసా వ్రతుడవు, బుద్ధుని శిష్యుడవు... నీ చెవికి యివి విషతుల్యములు – అయినా నేటి సత్యాన్ని చెప్పక తప్పదు....

ఇది నాజూకు యుగం. మీ యుగం. మీకు లేని సౌకర్యాలు యీనాడు మాకు అందుబాటులో వున్నవి....

ఆనాడు ఏ మహర్షికో గాని వినిపించిన ఆకాశవాణి, అశరీరవాణి... యీనాడు మా ఇంటింటా పలుకుతుంది... అమరులు పుష్పక విమానము లెక్కినారని శాస్త్రాలు చదివాము. ఈ రోజు మా ఇండ్లపై నిరతముమారుమ్రోగుతాయి. ఇనుప రెక్కల తుమ్మెదలు వంటి విమానములు. అందరికీ విద్య యీనాడు అందుబాటులో వుంది. నిజం చెప్పవద్దూ – మాముసలమ్మలు కూడా యీనాడు గ్రంధపఠనం చేస్తున్నారు... సంతానం ఆనాడు వరాలు, వ్రతాలు చేసి నమ్మేవారు.. మరి యీనాడు.. కావాలంటే సుతులు... వద్దంటే వద్దు.....

అధునాతన శాస్త్ర పరిశోధనలతో యీ యుగమే మారిపోయింది. ఈనాడు శారీరక సౌఖ్య, భోగాలను డబ్బుతో కొనవచ్చు. సాంఘిక దురాచారాల నిర్మూలనలు ఎన్నో జరుగుతున్నాయి. పురుషులతో సమానంగా స్త్రీ అన్నిటా భాగస్వామ్యాన్ని సాధిస్తున్నది. రోదసి రహస్యాలను, గ్రహాంతరయానాలు, లెక్కలేనంత విధంగా సాగుతున్నాయి... ఎంతో ఎంతో అధునానతనత్వం వీధి వీధినా మొత్తం ప్రపంచమంతా ఆవరించి, వేగంగా, అతి వేగంగా ముందు సాగుతున్నది.

కానీ ఒక్కటే లోపం ! మనిషి అంతరంగం యింకా మార్పు చెందలేదు.

మధురాతి మధురమైన సమత్వం, విశ్వ సౌభ్రాత్రము మాకు వెలతి. మా నట్టింట నవధాన్యాలున్నాయి. ధనరాసులున్నాయి. కానీ ఆర్థిక సౌఖ్యం అందరికీ అరకొరగానే అందుతున్నది. కొంత స్వేచ్ఛ ! కొంత అస్వతంత్రత, కొంతవుండి కొంతలేక "మాకేం! మేరా భారత్ మహాన్, సుజలాం, సుఫలాం అని పాడుకొంటున్నాము.

ఏ సిద్ధాంతమైనా మాకు ఇష్టమే. అది మాలో సఖ్యత, సమత, నిజాయితీ సత్యమార్గాన్ని,శాంతిమార్గాన్ని మాకు అందిస్తే – దానినే మా జీవన సిద్ధాంతంగా కౌగిలించుకుంటాము.

**ఆశించుచున్నార మఖిల దేశాల యు**

**త్తమమైన నిరత బాంధవ్యలబ్ధి,**

**వలతు మేనాఁడు వాక్స్వతంత్ర్య విభవంబు,**

**జబ్బెరుం గని గుండె నిబ్బరంబు,**

**ప్రణుతించెదము మత స్వాతంత్ర్య, మాత్మ లా**

**భములేని సానంద భక్తిపదము,**

**కటగించెదము బిక్షలకు జేతులు సాచు**

**చేవమాలిన దాస్యజీవనంబు,**

**జ్ఞానవిభవ మెల్ల మానవ హింసకై**

**వ్యయ మొనర్చు భూమిదయితకోటి**

**తలలు వంప శాంతి ధర్మ దయా సత్య**

**కర్షకతకు సల్పగలము నతులు !**

ఎంతో శ్రద్ధగా కాందిశీకుని ఉద్ఘోష ఆలించింది. కపాల మిత్రము, కనుగుంటలలోను నీరు క్రమ్ముకొనగా, వెచ్చని ఊర్పులు విడిచి... బ్రతికివున్న మనిషి వలె మారుపలికినది.

ఆకర్ణించి నాను నీ విచిత్రమైన ఉపన్యాసము. దుర్దాంతచింతా కాలుష్యము చిమ్మి రేగినది మిత్రా! నా యీ శుష్క హృదయాన, నా కంకాళమున, మున్ను ఎప్పుడో జీర్ణమైపోయిన జీవాణువులు ప్రాకినవి. వేడి రక్తం ప్రవహించుచున్నట్లున్నది. గౌతముని కరుణా కటాక్షముల తడిసిన జగము మరలా రక్తప్లావితమైనదా?

సిద్ధార్థుని భిక్షాపాత్ర కన్నీటిచే తడిసి చివికి పోవుచున్నదా? బోధి వృక్షము చెదలు పట్టినదా? హింసా రాక్షసి నాట్యమును వలచి వలపించుకొనుచున్నారా?

ఈ అధునాతనమై, క్షణిక సౌఖ్యాలకై మిడిసి పడుతూ, విశ్వశాంతి ఔన్నత్యాన్ని గురుతించలేని మూఢుడవై వున్నావు. ఎక్కడి యుద్ధం? ఎక్కడి ద్వేష ప్రతాపాగ్నులు ! పూర్వము యుద్ధాలు జేసి, అమాయకుల వధించిన ఏ వీర ప్రతాప చక్రవర్తి అయినా పూర్ణ విజయాన్ని సాధించగలిగారా? అలెగ్జాండరు; మహమ్మదీయ చక్రవర్తులు, నాదర్షా, ఔరంగజేబు, మొఘల్ రాజులు, ఆంగ్ల పరిపాలకులు.. ఎవరైనా సంపూర్ణ విజయాన్ని కత్తులు, కటారులతో, ఫిరంగులతో జయాన్ని సాధించినారా? 'లేదే! వేల ప్రాణాలు బలిగొన్నారు. 'అదీ విజయం?

ఆటంబాంబు వంటి మరణాయుధాలతో సాధించినదేమిటి? పీనుగుగుట్టలు, శిధిలశకలాలు తరతరానికీ వీడని రుగ్మతలు. ఏదేశ చరిత్ర చూచినాయింతే – ఏ రాజు పాలన చూచినా ఇంతే. విజయం అన్నది శాంతిలో వుంది. ఆ సత్యాన్ని గ్రహించి చక్రవర్తి అశోకుడే. కావలసిన దానికన్నా ఇబ్బడి ముబ్బడిగా ధనము సంపాదించి, దుర్బలులు, దీన మానవులపై అధికారము చేయుచుండు రాజులు యీ జగత్ప్రళయాలు సృష్టిస్తారు. వారి వీనులు సోదర మానవుల, దీన ఆర్తనాదాలు వినలేవు, తమ్ముడూ.

నాకే విజ్ఞానమున్నది – నాకే కాళ్ళూ, చేతులూ వున్నాయని విర్రవీగుతావు. జంతువులకు కలుగదు అని, వాటిని హింసించావు.. మనిషకి లేని ఎన్నో ప్రతిభలు పక్షులకూ, జంతువులకూ వుంది. ఆ విషయం మనిషి గ్రహించలేదింకా –

అటుచూడు, ఆ సన్నని తుమ్మకొమ్మలకు

మరింత సన్నని గడ్డిపోచను గూర్చి

ఊయల గూడు నిర్మించిన గిజగాడు పక్షి నేర్పరితనము. నీ తెలివితేటలు దానిముందు బలాదూరు... నూరు గాలివానలచ్చినా అది జారిపడదు.

ఆడ, మగ తనము కలిసివున్న చిన్న సాలీడు నేయు ఆ సన్నని నేతముందు వేయి రాట్నాలకూ లేనంత ప్రతిభ అది. తేనెటీగల రాజ్యపాలన; రాణి ఈగ ఆజ్ఞకు బద్ధులై పనిచేయు కూలి ఈగల విధ్యుక్తధర్మం మానవులకే గుణపాఠం.

బిడ్డలను వదలలేక తన రెక్కలు కప్పి కారు చిచ్చులో మరణించిన గువ్వ పిట్ట మాతృప్రేమ.

కొమ్మ కొమ్మకు ఎగురు కోతి దాని పిల్లకు గల మోహరజ్జువేపట్టు, పెట్టిన గుడ్డు జారి క్రిందపడి పగిలిపోవగా చూచి, ఆడపక్షి వేదనా రోదన ముసేయగా, దాని దుఃఖాన్ని, మాన్ప మగ పక్షి దాని చుట్టూ తిరుగుతూ, గుణ గుణధ్వనిచే ఊరడించుట చూచిన, భార్యపై కపోత ప్రేమ వ్యక్తమగును.

అంచేత, మనిషేగాడు ప్రతిభావంతుడు, ప్రేమమూర్తి, త్యాగధనుడు, పక్షి, జంతువులూ ప్రేమ మూర్తులే! కావాలని ఎవరినీ, స్వజాతినీ అవి హింసించవు. ద్వేషించవు. –

ఈ పలుకులు విని కాందిశీకుడు నవ్వి "ఆచరణకు సాధ్యంకానివి, యీనాటి లోకం యీ సిద్ధాంతాలతో బెత్తెడు కూడా సాగని కొత్త కొత్త వింత సిద్ధాంతాలు వినిపించావు, పుట్టె మహాశయా!'

హింసలో పుట్టిన, పెరుగుతున్న యీ లోకము అహింసాత్మక మెట్లు మారును? యుద్ధోన్మాదం చేత వున్నాయాదుష్టయుగం యిప్పుడ ఆ నీతి రుచింపదు. పోయిన వారు మీరే పుణ్యాత్ములు సోదరా", ప్రేమతో ముట్టుకుంటే తేలూకుడుతుంది. 'పాపం' అంటూ చేరదీస్తే పామూ కరుస్తుంది... అసలూ చీమనలగకుండా నడిచేదెలా అన్నయ్యా? కాస్త నాకు తెలియజేయి – అంటూ కాందిశీకుడు చేసిన హేళన విని, పునుక జాలిగా నవ్వింది.

"మిత్రమా కాందీశీకా! ఫల పవనా హారము చేసి మునీంద్రకోటి జీవించింది. తృణకందళములు తిని పశువు బ్రతుకుచున్నది... సింహా, శార్ధూలాల క్రూర జీవితాలకు నరుడే కారణం.

**"పంచభూతాత్మకంబైనపకృతి సుఖము**
**ననుభవించెడు హక్కు మర్త్యునికే కాదు**
**కలదు ప్రతిచిన్ని ప్రాణ భృత్తులకు గూడ**
**బలము గలదంచు దోపిడీ సలపవలదు"**

ఈ భరత పుత్రులు దుర్భలులైనారని దిగులు చెందకు. అహింస మిమ్ము అమృత దేహుల జేసి ఉర్వినే జయించేగలదు. నాల్గు ఖండిములకు నవనవోజ్జ్వలములే ధర్మ మార్గములను దారిచూపి, ఘనత చెందిన ఖండముమనది, పౌరుషము మనది, ప్రజ్ఞమనది.

ఊరకపోదు బుద్ధుని మృదూక్తి, క్రీస్తు ప్రేమ తత్వము రామకృష్ణముని తాత్విక సౌరభము. ఈ కత్తులు, విషజ్జయాలు అన్నీ భ్రమలు దుఃఖాలకు మూలం. అంతంలేని ఆశలకు పుట్టినిళ్ళు.

సత్యము, ధర్మములకు ఊపిరి ఆడని నాడు, యీ భక్తి, యీ అహింస, ఋజు వర్తనం, కరుణ వృధా అనిపించును – కానీ చెడు నంతనూ అదిల్చి 'ప్రేమ' ఒక్కటే రాజ్యము చేయును మిత్రమా?

మీయుగ ఉన్నతిని విని ఆనందించాను. మీ యాంత్రిక అభ్యున్నతికి ఆనందించితిని.. మానవతను మరువకండి. కరుణకు పాదులు చేయండి.

**"గౌతమ బైరాగి కృపా**

**స్వీతేక్షణ పంక్తి విశ్వ విశ్వానంద**

**ప్రాతః కాంతుల చిమ్మెదు**

**గాత! శమించెడు గాత కదనదవాగ్నుల్"**

కపాల మిత్రుని బోధకు కాందిశీకుండు ఆనందమందెను. విశ్వైక్యత, విశ్వసోదరత, విశ్వప్రాజ్య జాతీయతల్ వెలయువలె. హిందూ ముస్లిములకున్ విఖ్యాత బాంధవ్యములు. ఇంతకన్నా ప్రపంచ శాంతికి మరో మార్గం లేదు.

అంతలో కపాలము ప్రశ్నించినది "నీ సతీసుతులు ఏమైనారు. ఎందుకీకానల ఒంటరిగా తిరుగుచున్నావు". కళత్రము, బిడ్డలు మనసును మెదలి, అంతులేని వేదనతో మూర్ఛిల్లినాడు కాందిశీకుడు.

మూర్ఛ తేరుకొని చూడగా, తూర్పున భానుడుదయించి, పరిసర కానన ప్రాంతాన్ని అంతటా బంగారు మలాము చేసినాడు.

మేల్కొని ఎదుట నున్న పుట్టను చూచి, నవ్వుకొని... "ఇది నాలోగల చిత్ర విభ్రమము గానీ, యీ కపాలము పల్కదు.

దేశాభ్యుదయాభిలాషి నయి కర్తక్షోభ వారించెదను. అహింసా మార్గాన్ని అనుసరిస్తాను. కదన భూతాన్ని దిక్కులు పట్టిస్తాము."

**అని తలచి పాంథుడింటికి**

**జనియె, కపాలము ఒక్క సన్యాసి కరం**

**బున బూని బిచ్చమునకున్**

**జనియెన్...**

పక్షి సంతానములు శుభసూచికమైన కుహూరావములు గావించినవి.

* * *

# నేను ఆశించిన 'కొత్త లోకం'

**తలసూపం బనిలేదు సాంఘిక మతౌద్ధత్యంబు లెందేని, భా**

**షలకున్ సర్వకళాలతాంతమున కౌజ్జ్వల్యంబు సిద్ధింపఁగా**

**వలె? విశ్వైక్యత విశ్వసోదరత విశ్వప్రాజ్య జాతీయతల్**

**వెలయంగావలె, హిందు ముస్లిములకున్ విఖ్యాత బాంధవ్యముల్.**

జాషువా తనకు చేతకాని పని, ఆస్కృష్టి కర్తకైనా చేతనవుతుందేమోనని, తాను ఆశించిన 'కొత్త లోకంలో' ప్రశ్నిస్తున్నాడు.

ఆ చెఱువు గట్టున అర్ధరాత్రి చిమ్మచీకటి కప్పిన దుప్పటి పొత్తిగుడ్డలలో రోదించి రోదించి ఆ బంగారు పాపండు ఆ అనంత వాయు హస్తాలలో చిట్టి నేత్రాలను శాశ్వతంగా మూసినాడు. ఆ పాపని దయనీయ దుస్థితికి ఆ చెఱువు వెచ్చనూర్చింది. ప్రత్యక్ష సాక్షులైన నక్షత్రాలపై మరింత మబ్బు కమ్మింది...

చిత్ర విచిత్ర గతుల కప్పలు వెక్కిరిస్తున్నవి యీ సమాజపు దుర్నీతిని.

ఓ స్త్రీ మూర్తి ఆ నీశీధిని చీల్చుకుంటూ పరుగు తీయడమూ చూచాను. సర్వ సమాజపు పక్షపాత నీతి ఆమెను తరుముతున్నది.

ఆ శిశు మరణం గురించి ఆరా తీసింది చట్టం. శిశు హంతకిగా ఆ స్త్రీని తేల్చి మరణశిక్ష విధించింది కోర్టు. ఆమెను ఉరికంబం ఎక్కించింది సమాజం. ఆమె శిక్షకు కారణ భూతుడైన పురుషునికి శిక్షలేదు. నగ్న సత్యలక్ష్మి నాలుకలేనిదై మూర్ఛవోయె రుద్ర భూమియందు !

**జననం బందినదాది నే కవినయీ**

**సర్వసహా నాటకంబున నానావిధ**

**పాత్రదారులయి రేపులు మాపులు**

**ఆటాడి పోయినవి. పోనున్న నటి**

**నటోత్తముల ఆయా ఘట్టములు....**

..... వినిపింపవలెనని

అరువదేళ్ళు చూచాను. – యీ మహానాటకాన్ని. అంక పరిమితి లేక యుగయుగాలు నటన సాగుతూనే వుంది. అన్ని ఘట్టాల్లోను హృదయ ద్రావకాలైన దృశ్యాలున్నాయి. ఒక సృష్టికర్త వుంటే... అతని ఆధీనంలో యీ నాటకం సాగుతూవుంటే... పునర్నిర్మాణంలో కొన్ని సవరణలను సృష్టికర్తకు మనవి చేసుకోవలెననిపించింది.

అతడు సృష్టికర్త... సృష్టిలోని మానవుడ నేను... అతనిని ప్రశ్నించే హక్కు నాకూ గలదు.

నేను ఆశించిన ఒక "కొత్త లోకం" నా హృదయంలో ఆర్ద్రమై అలంకరించుకొన్న ఊహలను, సజీవ రూపాలుగా కొత్తలోకంలో ప్రతిష్టించాలనే అభిలాషతో కలం అందుకొని నా భావనలకు అక్షర రూపం కల్పిస్తున్న రోజులలో అకివీడె పట్టణంలో మహా సన్మానం పొంది, నా అర్ధాంగి దోసిట వాటిని కుమ్మరించి, ఆమె ప్రదర్శించే నిశ్శబ్ద ఆనంద రూపాన్ని చూడాలనే కాంక్షతో ఇల్లు చేరాను. అది శూన్య గృహమై ఎదురు నిలిచింది.

నా కవితకు, నా ప్రతిభా శ్రీకి కారణమైన నాదు ప్రేయసి మరియాంబ అందులేదు. నా మాతకు మారుగా, అనుగు రూపము దాల్చి నన్ను నలుబదారేండ్లు కాపాడిన ప్రశస్త శుభైక వరప్రదాత్రి నన్ను విడచి, మృతికి ఆవలి ఒడ్డున చేరినది. నేను యీవలి ఒడ్డున నిలచితిని. పలుకులు అందని భిన్నవాసులమైనాము. ఏ సత్యలోకాలకు పయనించి సుఖించుచున్నదో? ... లేక అనంతమైన యీ ప్రకృతి గర్భమున లీనమైనదో తెలుసుకొన్నవారులేరు. దుర్ఘటమైన మృత్యు అనంతర విషయం అయోమయం; మానవావళికది అనన్వయ కావ్యము.

"ఓదేవీ! కరుణలేని దురితాత్ముడు మృత్యుకిరాతరాజు, విల్లు ఎక్కిపెట్టినాడు నీ మరణంతో తృప్తి చెందడు. ఈ జక్కవజంటలో ఒకటి చాలదు నానిబుభుక్ష తీర్ప. నన్ను వదలడు. రెండువ బాణం నాకై సందింపగ మానడు. నీవు వసించుచోట నేనును వసింతును. ఒకింత నేలదాచి యుంచుము. రేపట మాపట చనుదెంతును. ఈ నిరాశా విషదహ్య మానమయి సౌఖ్య పరాఙ్ముఖమైనట్టి నా జీవితపు ఆశాలత నిలుచునా !

నన్ను నాకవిత్వాన్ని, నా కీర్తి ప్రతిష్ఠలను పిండి కొట్టి, బంగారు నీటితో కలిపి, నీ పాదాలకు పూసి నమస్కరించి పూజ చేసినా నీ ఋణం తీర్చుకోలేను.

'కొత్తలోకం' లో నా తొలికోర్కె. ఆ సృష్టికర్తకు విన్నవించుచుతూ వున్నాను.

కవి, కవిజీవితం ఎంత అవసరమో; రాజుకన్నా, చక్రవర్తికన్నా కవి ఎంత శాశ్వతుడో వివరించాను.

ఒకానొక రాజమహల్ లో ఒక బిడ్డ జన్మించినాడు. పూరి గుడిసెలో అదే సమయాన మరొక బిడ్డ జన్మించినాడు. రాజమహల్ లోని బిడ్డ సర్వసౌఖ్యాలలో, బంగారు ఉయ్యాల దాస దాసీ జనాల నిరంతర సేవలో ఆ రాచబిడ్డ పెరిగి పెద్దయై రాజు అయినాడు.

పూరి గుడిసెలోని బిడ్డ కటికి దారిద్ర్యంలో, తల్లి అనురాగ జలధిలో పెరిగి పెద్దయై కవి అయినాడు.

చక్రవర్తి చేత ధరించిన 'రాజదండం' అధికార పూర్ణం, ధనమయం. కవి కలం కావ్యముల ఉద్భవించినవి. చక్రవర్తి ఇల్లు రత్నాల కాంతులతో విరాజిల్లుచుండగా; సుకవి ఇల్లు రాళ్ళతో కట్టబడినవి.

రాజు కవి గురించి తెలుసుకున్నాడు. కవి కూడా రాజును గురించి విన్నాడు కానీ రాజు కవిని లెక్కచేయడు. కవి కూడా ' ఆరాజెంత' అని తన స్థానాన్ని గౌరవించుకున్నాడు.

ఇక ప్రజలు రాజును భయంతో కొలుస్తారు. కవిని 'భక్తితో కీర్తిస్తారు.

రాజుకు వేలమంది సేవకులు, అందరూ 'జీతం' వలన సేవిస్తారు. కవికి సేవకులు లేరు. అభిమానులున్నారు.

రాజు చేతి కత్తి యుద్ధాలు చేసి రక్తాన్ని వర్షింపజేస్తుంది. సుకవి చేతి కలము అమృతవాక్కులను కురియిస్తుంది. రాజు యావత్ప్రపంచాన్ని ఏలగలుగును. సుకవి ఇహపరాలను ఏలగలడు.

భూరిపరాక్రమోన్నతుడై, ధనాధిపుడై రాజు మరణించగా ఒక నక్షత్రం రాలిపోయింది. సుధామధుర కవితా సృష్టిగావించి, ప్రజాభిమానం చూరగొని మరణించగా ఒక నక్షత్రం గగనసీమ అలంకరించింది.

రాజు జీవించినాడు.. ఎక్కడ? ... రాతి విగ్రహాలలో

మరి సుకవి జీవించినాడు ఎక్కడ? ప్రజలనాల్కలపై శాశ్వతుడై.

ఇంతటి శక్తివంతుడు, రెండవ సృష్టికర్త అయిన కవిని చూచి ఈర్ష్యచెంది ఈశ్వరుడు నా అర్ధాంగిని అర్ధాంతరంగా మాయంచేసిన వానికే నా 'కొత్తలోకం' నాయీ ప్రశ్న.

ఈ బ్రహ్మాండాన్ని కవి ఏలగలడనీ, అతని అంకమును పంచుకొని అర్ధాంగి రెండవ స్వర్గాన్ని సృష్టించి ఏలుతుందని యీ సంసారిక కష్టాలు అతని దరిచేరవని నీకు తెలిసే దాంపత్యాన్ని రెండు ముక్కలు చేశావు. కవితా కంఠాన్ని తెగగొట్టినావు? తగునానీకిది? నీవు సృష్టించే జగత్తుకు ప్రతిగా చింతలు, చీకులు లేని భాషా సౌందర్యంతో విరాజిల్లే ఒక కవితా జగత్తును ఒక్క నిముషములో కవులు సృష్టించగలరనే ఈర్ష్యతోనే నాయీ దాంపత్యాన్ని తెంపినావు. సతీవియోగం కలిగించి హింసిస్తున్నావు.

"Pleasure is oft a visitant but pain clings cruelly to us" – Poet Keats.

సుఖం చుట్టం చూపుగా వచ్చునుగాని, దుఃఖం మటుకు నిర్భయంగా అంటిపెట్టుకొని వుండిపోతుంది.

కవులు కవితా జగత్తులో విహరిస్తూ కవితా సృష్టిని చేయాలంటే వారికి కొద్దిసేపైనా సరే సుఖమే కావాలి. దుఃఖం వారిని అంటిపెట్టుకొని వుండరాదు.

అయితే యీ దుఃఖం కోరిక కారణంగా ప్రవేశిస్తుందన్నా ప్రతి మనిషి కొన్ని కొన్ని క్లిష్ట సమయాల్లో విషాదగ్రస్తుడౌతాడు. ఏది సత్యం? ఏదసత్యం? ఏదనిత్యం? ఏది నిత్యం? ఇటువంటి సందేహాలతో మనసు వికలమౌతుంది. అట్టి సమయాలలో భార్య, బిడ్డల ఉనికి, అనునయపూర్వకమైన అనిర్వచనీయమైన ప్రేమానుబంధం కొంత ఊరటను కల్గించగలుగుతుంది. మనిషికి అది క్షణికమే అయినా అదే అతనికి సత్యం. అదే అతనికి నిత్యం.

ముంతాజ్ సతి మరణించగానే షాజహన్ చక్రవర్తి.......

**“అసు పేటిం పదిలముగా పతి రహస్యం బెల్లకాపాడు ని**
**శ్వాసనీయంబడు వ్యక్తి భార్యయ కదా క్ష్మా చక్రమందు అట్టినీ**
**వు అసువుల్ వాసినయంతనే ప్రజల సైన్యంబుండి భీతిల్లుదున్**
**వసుధా రాజ్యము కల్గియుం కటికి నిర్భాగ్యుండనై పోయితిన్”**

అంటు బలహీనుడై దురపిల్లలేదా?

ఈ సత్యం మహాత్ములు చెప్పి పోయినారు. తృష్ణ కూడా దుఃఖానికి కారణమే నన్నారు. తృష్ణ అంటే ‘దాహం’. సుఖ దాహం, ధనదాహం, కామదాహం. ఈ దాహాలకై తృష్ణ పీడిస్తూనే వుంటుంది.

మరి కవి కూడా సామాన్య మానవుడే. సుఖేచ్ఛ కవికీ వుంటుంది. దాహర్తి వీడదు. ‘జయాదుఃఖం’ కవికి అన్ని దుఃఖాలను మించి దుఃఖం.

సంసారమనే క్రూర సింహానికి యీ విశ్వేన్నే మాంసాహారముగా చేసి హింసింప చూస్తున్నావు. ఒక్కసారి నీవు మనుష్యాంశమున పుట్టె సతీ వియోగ విషభక్ష్యం ఒకింత భుజించి చూడు – ఈ దుఃఖం, యీ వెలితి ఎంతటిదో తెలుస్తుంది.

పచ్చ పచ్చని సతుల జీవితాలు ఒక్క క్షణంలో నాశనం చేస్తావు – శాంతికి స్థావరమైన సంసార సాగరాన బడ బానలం అంటిస్తావు – సత్కుటుంబాలను సగం ఖండిస్తావు – మాతృత్వం సంపదకు పుట్టినిండ్లయిన బంగారు బొమ్మల కాటికి అర్పిస్తావు – బంధువులను బాష్పజల రాశిలో ముంచుతావు.

మృత్యువు అని వార్యమే కాదనను. అంతే కాదు మృతులు నా భావనలో

"నరజన్మంబను వ్యాధి బాధలకు అఖండంబైన దివ్యౌషధంబు

అరయన్ మృత్యువు, లేవు మీకు ఇక దుర్వారోగ్ర సంసార సా

గర నై రంతర యాత్మలు."

ఆ రామునంతటి వాడే భార్యా వియోగంతో తల్లడిల్లిపోగా, యిక యీ నిర్భాగ్యుడు, సామాన్యుడు ఓర్చుకోగలడా? "మీ దాంపత్యం సుఖాంతం అవుగాక" అని దీవించి, అక్షితలు చల్లిన ఆ పురోహితుల మంత్రాలు, ఏమైనాయి అవి నిరర్థకమే కదా ?–

అంచేత, నా కోరిక ఒకటి ఏమంటే

**"నా అర్ధాంగిని నా కోసంగుమభిమానం బుంచి యింకొక మా**

**రాయుర్ధాయము బోసి, కోరను త్వదీయ స్వర్ణ వైకుంఠమున్**

**నీయూరింపుట మర్త్య భోగములు నానెయ్యంపు టిల్లాలునా**

**కీ యుర్విన్ సమకూర జేయగలదోయీ !"**

ఆ రోజుల్లో కలరా! మశూచి వంటి అంటు వ్యాధులు చాలా సులువుగా ప్రబలి మనుషులను బలి తీసుకొనేవి వందల సంఖ్యలో. ప్రజలు భయంతో బిగుసుకు పోయేవారు. అటు గ్రామ వాసులు ఇటుగాని, ఇటు గ్రామాల ప్రజలు అటుగాని ప్రయాణాలు చేసేవారు కాదు. ఊరి పొలిమేరలో నిలచి అరిచి అరిచి వార్తలు, సమాచారాలు అందించుకొనేవారు.

మా చుట్టు ప్రక్క గ్రామాలలో కలరా వ్యాపించింది. అది పందొమ్మిది వందల పది. ఆ ప్రాంతాలలో మా గ్రామం చాట్రగడ్డపాడులోనూ కలరా వ్యాపించి... మా బంధువులే ఎందరో మరణిస్తున్న రోజులలో నా వివాహం, నా మేనమామ కూతురు మరియాంబతో నిశ్చయం కావడం జరిగాయి. మాది బాల్య వివాహమే. ముహూర్తం వినుకొండలో. గ్రామ పొలిమేర వరకూ నూతన వధువును సాగనంపి బంధువులు వెనక్కు మళ్ళారు. ఒడికట్టు బియ్యంతో నవ వధువు ఒంటరిగా వినుకొండ చేరింది. అది మొదలు దాదాపు నలభై ఆరేళ్ళు సంసార యాత్ర నాతో సాగించి సుఖ దుఃఖాల సంసార సాగరాన్ని మౌనంగా తరించింది.

"మణి మాణిక్యాలకు విలువ చాలా యెక్కువ. అవి సులభంగా దొరకవు కనుక. ఈ లెక్క ప్రకారం స్త్రీకి విలువ అసలు లేదనే చెప్పవచ్చు. వాళ్ళు సులభంగా దొరుకుతున్నారు కాబట్టి, "నీరు నిత్యావసరాలకు కావలసిన వస్తువులలో ఒకటి. అయినప్పటికీ దానికి విలువలేదు. నీటికి కరువు వచ్చినట్లయితే, అప్పుడు చూడ

గలుగుతాం. నీటి విలువ! రాజాధిరాజైనా ఒక్క నీటి బిందువు కోసం తన కిరీటంలోని శ్రేష్టరత్నాన్ని యివ్వటానికి కూడా వెనుదీయడు. ప్రపంచంలో స్త్రీల సంఖ్య తక్కువైపోయి వారు అరుదైనప్పుడు (ఇలా జరగరాదనే నా కోరిక!) తెలుస్తుంది. వారికి గల నిజమైన విలువ ఏమిటి"

**– శరత్‌శ్చంద్రుడు**

నలభై ఆరేళ్ళు నాకు చాకిరీ చేసింది మెరాయ్ ( మేరీని నేను నిత్యం పిలిచే పిలుపు అది) ఇప్పుడు నా కనుల నుంచి అదృశ్యమైన తరువాత గానీ ఆమె లోటు, అది ఎంత విలువైందో అర్థం కాలేదు.

ఒక్క మేరీయే కాదు కోట్లాది స్త్రీలు భర్తకు, అత్తమామలకు, ఆడబిడ్డలకు, బిడ్డలకు చాకిరీ చేస్తూనే వున్నారు. పతివ్రతాన్ని శాయశక్తుల్లా ఆచరిస్తూనే వున్నారు. వ్రతాలు, నోములు చేస్తూనే వున్నారు. ఆ పచ్చని తాళిని కళ్ళకద్దుకుంటూ, నుదుట కుంకుమ ధరించి "నా భర్తకు సలక ఆయురారోగ్య ఐశ్వర్యాలూ – ప్రసాదించు ప్రభూ అని మొక్కుకుంటూనే వున్నారు.

గట్టి పతివ్రత బిరుదు ఒక్కటే ఆమెకు లభించే ఆనందం. నేను ఎటు తిరిగినా, ఏమి చేస్తున్నా పల్లెత్తుమాట అనక–

పతి దేవుని పాదాలు కడుగుతూ ఆ బెత్తెడు స్థలంకై నలభై ఆరేళ్ళు సేవ చేసింది.

పతికి పతియే ప్రత్యక్ష దైవం. ఆ దైవార్చన చేసిన పతివ్రతులకు, అటు పుట్టినింటి వారికి ఏడేడు పదునాలుగు మన్వంతరాలు స్వర్గ ప్రాప్తి!!!

ఈ పక్షపాత స్వార్థపు మత్తుమందు ఆమె నరనరాలలో ఎక్కించి, నమ్మించి, వంచించి నేర్పిన పాఠాలు.

ఒకవేపు సన్నాయి హాయిగా వినిపిస్తున్నది. మరోవేపు ముత్తైదువుల ఆనంద కోలాహలం. ఇంకో దిక్కున అతిధుల ఆహ్వాన సంరంభం. రంగు రంగుల పూలాలంకరణలతో శోభాయమానంగా వున్న వివాహ ప్రాంగణమంతా ఆనందపు పువ్వులు విరిసి విహరిస్తున్నట్లుంది. సంతోష సాగర తరంగాలు అందరినీ తాకి గిలిగింతలు పెడుతున్నవి. అదుగో అటు ముత్తైదువుల చిలిపి మాటలకు పెండ్లికూతురు తల్లి సిరి సిరి నవ్వులు ముఖాన పూయించుకొని అవ్యక్త మధురానందనాన్ని పొందుతున్నది. ఇదిగో ఈవేపు తండ్రి కాబోలు శుభ్ర వస్త్రధారియై సంతోషాన్నంతా గుండెలో పొదివికొని పైకి గంభీరతను తెచ్చుకొని అతిథి సంబరాలు నిర్వహిస్తున్నాడు క్షణం తీరికలేక.

మరి ఆ వేపు గదిలో తోటి స్నేహితురాండ్ర మధ్యలో అప్పుడే విసిరిన లేత ఎరుపు గులాబీలా కూర్చున్నది పెండ్లి కూతురు. చెలులు విసిరే పూల బాణాల వంటి చెణుకులు

ఆనందిస్తూనే "పొండి!" అంటూ నునుసిగ్గు దొంతరలలో మునిగిపోతున్నది. వెన్నెల భవిష్యత్తును ఊహించుకుంటూ.

ఎంతలో ముగిసిందీ వివాహపు సంబరం. ఆ మరునాడు ఎక్కడి వారక్కడ పయనమైపోతున్నారు. ఏమిటో నిన్నటి ఆనందాన్నంత మూటకట్టి ఎత్తుకు పోయినట్లు ప్రతీవారూ... మరీ తల్లి, తండ్రి దిగాలుపడి అతిధుల సాగనంపుతూనే... ఉబికి వస్తున్న కన్నీటిని ఆపుకుంటున్నారు... తమ అల్లారు బిడ్డను భర్తతో సాగనంపే క్షణం రాగానే, 'తప్పదుగా మరి' అంటున్నారెవరో.

నిన్నటికీ యీవేళకీ ఎంత తేడా? నిన్నటి ఉత్సాహం, నింపిన ఆనందం యీ రోజు ఏది? జీవితం అంటే యింతేనా! ఆనందానికి నిరానందానికీ దూరం ఎంత? ఏమో ఎవరు చెప్పగలరు సరియైన దూరం ఇంతా అని –

అప్పుడే సంవత్సరం నడిచిందా తమ బిడ్డ అత్తవారింట కోడలై అనుకుంటున్న తల్లికి... 'అమ్మాయి వద్దనుండి ఉతరం రాలేదేమిటి!' అని భార్యను అడగబోతున్న తండ్రికి పోస్టుమ్యాన్ కేక వినిపించి... ఉత్తరం కొరకు అతను ఇరవై ఐదేళ్ళనాడు తీసిన మొదటి పరుగులా...దానికీ దీనికీ తేడా వుందా.... అదీ హృదయ సంబంధమైనదే – ఇదీ హృదయ సంబంధమైనదే... కానీ యీ పరుగులోని ఆనందం పితృ మమకారంలో ప్లావితమైనది.

ఉత్తరం విప్పి చదువుకున్న తండ్రి అతని నుండి వింటున్న తల్లి ఇద్దరూ ఒకేసారి కుప్పకూలిపోయారు. కాదు వారిపై ఇల్లు కూలింది. వారి హృదయం పెఠిల్లున్న పగిలి రక్తం బుసలు బుసలుగా చిమ్మింది. "అమ్మా! నాన్నా! నన్ను మీ వద్దకు తీసుకుపోరూ... మీరు వచ్చేలోగా ఉంటానో... లే...!!' ఇక ఉత్తరం చదువలేకపోయారు.

ఆ తరువాత పది రోజులకే మరో తంతి కబురు "మీ అమ్మాయి ప్రమాదవశాత్తూ స్టౌ పేలి కాలిపోయింది."....!!!

రెండు వేరు వేరు హృదయాలు వివాహపు బంధనంతో ముడివేయబడి....కలిసి జీవనం సాగించాలంటే... కట్నం ముఖ్యమా? వస్తువు ముఖ్యమా? రెండు హృదయాలు పెనవేసి వుంచే పరస్పర అనురాగ బంధం ముఖ్యమా? ఏది?–

ఒకవేపు సంసార నౌకను నడిపే ప్రేమ పూరిత దాంపత్యాలు వున్నా, మరోవేపు ఇటువంటి దుఃఖ పూరిత గాధలు నిత్యం ఏదో మూలనుండి వినవస్తూనే వుంటాయి...

**ప్రేమవాహిని విశ్వవిశ్వంభరము నందు**

**ప్రవహించు చున్న క్రైస్తవము నమ్మి**

**కలుషశక్తులను చెండాడి పెక్కు యుగాలు**

**అవతరించెద నన్న హరిని నమ్మి**

**బృహదహింసా మంత్ర దహనంబుచే హింస**

**దగ్ధమౌ నన్న గౌతముని నమ్మి**

**రాటంటె నిఖిల ఝంఝాటముల్ సవరించు**

**నన్న గాంధేయ వాక్యములు నమ్మి**

**ఎంత దౌష్ట్య మెంత హింసా విధానంబు**

**చెలగుచున్న సుంత చింతపడక**

**సాగిపోవుచుండు శత సహస్రాబ్దముల్**

**యుగయుగంబు లీ మహోర్వి రమణి**

“భారత దేశ సర్వతో ముఖాభివృద్ధికి ఆటంకాలు – స్త్రీల అణచివేత, వర్ణబేధం” – అని వాపోయిన వివేకానందుని వేదన తీరేనా?

నిరంతర పురోగమనం మానవ సమాజ లక్షణం – నిన్నటి కంటె నేడు, నేటికంటె రేపు ప్రగతి కలిగి నట్టివి. సమాజము ఎప్పుడు గత అనుభవాలు దృష్టిలో పెట్టుకొని సమాజ సుఖఃశాంతులకు అభివృద్ధికి ఆటంకంగా వున్నవానికి తొలగించుకొని ఉపయోగకరమైన వాటిని సంక్షేమం నిండిన వాటిని కాపాడుకుంటూ అభ్యుదయకరమైన నూతన విలువలను సృష్టించుకుని ముందుకు సాగిపోతున్నది.

స్థబ్ధత ఎంతోకాలం నిలవదు. దైన్యం భరించరానిదిగా మారినప్పుడు సమాజం పురోగమన శక్తులను తానే సృష్టించుకొని ముందుకు సాగిపోతున్నది.

అనేకానేక సాంఘిక కట్టుబాట్లుకు పక్షపాత ధర్మనీతులకు విసుగెత్తిన సమాజం ఎదురు తిరుగుతున్నది. అబల అన్న బిరుదు సంపాదించుకున్న స్త్రీ నేడు సబలయై తన హక్కులను సాధించుకొనుచున్నది.

అట్టి స్తబ్ధత నుంచి బానిస మనస్తత్వం నుంచి మౌఢ్యాన్ని చేధించుకొని నేటి మహిళ సమానత్వపు వైపు పరుగుతీస్తున్నది.

**గ్రహి యించినది నేటి కామినీ తిలకంబు**

**బురఖాల కెరయైన బుద్ధి బలము**

**తెలిసికొన్నది నేటికి కలికి ముద్దుల గుమ్మ**

**యుబ్బించుగాథలందున్న కిటుకు**

**అర్థమైనది నేటి యంబు జాతాస్యకు**

**లేలేత బుడత పెండ్లి దసేగి**

**ఆ కళించినది నేడమలోక్తి చాతుర్య**

**పసిడి సొమ్ముల రిత్త బరువు చేటు**

**కాంత మగవాడితో చేయగలప కున్న**

**తలపనేల యనర్థంబు తప్పదనచు**

**భారత క్షోణి చిత్తంబు కోరగింప**

**కలముబట్టిన దీనాటి వెలదిమిన్న**

ఈ మహా నాటకాన్ని అరువదేళ్ళు చూచాను. అంక పరిమితిలేక యుగయుగాలు నటన సాగుతూనే యున్నది. ప్రత్యక్షరం, ప్రతిపదం రసభరితం, భావస్ఫోరకం. అన్ని ఘట్టాల్లో హృదయ ద్రావకాలైన దృశ్యాలున్నాయి. కవి హృదయాన్ని గమనించని కళకు పాత్రదారులు వందలు వేలు. సత్యం దెబ్బతిని, ధర్మం దసిలి నాటకం రసాభాసమయింది. రంగస్థలంలో కల్లోలం, రభస చెలరేగింది. పాపం మహా నాటక కర్త నిందాబద్ధుడై వ్యాఖ్యానాలకు గుఱైనాడు. పునర్ముద్రణంలో కొన్ని సవరణలు సృష్టికర్తకు మనవి చేసుకోవలెననిపించింది. మహాస్రష్టకెదురై హృదయావేదన నివేదించుకునే పాటి గుండె నిబ్బరం లేకపోయింది.

**సృష్టికర్తవు నీవు నీ సృష్టిలోని**

**మానవుడ నేను – ఇద్దరి మధ్య మనకు**

**ముసుగులో గ్రుద్దులాటలు పొసగవింక**

**హక్కుగలదయ్య ప్రశ్న సేయంగ నిన్ను**

అన్న సూక్తి జ్ఞప్తికి వచ్చింది. గుండె దిటవుపడ్డది. ఆ తెరచాటు నాటక కర్త నర్థించె వాంఛితాలే ఈ "కొత్తలోకం". ఈ కృతి పరలోకగత అర్ధాంగి, మధుర హృదయ మరియా మానిని అంకితం చేసి ఋణవిముక్తుణ్ణి కాదలిచాను.

**నేను కవీశ్వరుండవని నీవొక బానిస వన్ననాడు గ**

**ర్వాన శరీరమున్ మరచి – స్వర్గ నివాసము వీడివచ్చి నా**

**మేను సగంబు పంచుకొని మేటి యశస్సు గడించు దివ్యవా**

**గ్దేవివి నీనటంచు గురుతింపగ లేనయితిన్ సతీమణీ!**

**మమ యోని ర్మహాద్బ్రహ్మా**

**తస్మిన్ గర్భం దధా మ్యహమ్**

**సమ్జున స్సర్శ భూతానాం**

**తతో భవతి భారత –**

ఈ సర్వంసహా జగత్ సృష్టికి మూలం ఆ బ్రహ్మ అనే కదా! మరీ ఈ సృష్టి చేసి ఈ కల్పన చేసిన గారడీడా మరి కనపడవేమి. నాయీ ప్రశ్నలకు నీ జవాబు ఏమిటి? ఈ అవకతవక సృష్టి చేయమని నిన్ను ఎవరడిగినారు. ఒకవేళ సృష్టి చేసావే అనొకో నిరాకారుడవై, ఉనికి లేనివాడవై, ఎక్కడో దాకుంటే ఈ సృష్టి వ్యవహారం ఎలా సాగుతుంది. సకల కష్టాలన్నీ ఈ జగత్తుపైకి నెట్టి స్వర్గసౌఖ్యాలన్నీ నీవే తీసుకొని మాకు అందుబాటులేని చోట దాక్కున్నావే. నీ గురించి మాకు ఎంత తెలుసో. నీకూ మాకు మధ్యవర్తులుగా వున్న నీ ఏజెంట్లు పూజారులకు అంతే తెలుసు. అయితే వాళ్ళు మాకన్నా కొంచెం తెలివి తేటలు ఉపయోగించి మా మౌఢ్యాన్ని ఆసరాగా తీసుకొని మాకు తమాషా భక్తి తాత్పర్యాలు నేర్పించారు. దాంతో వేయి మతాలు దానికి పిలకలు మళ్ళీ వాటికి కులాల పిలకలు వేనకవేలు పుట్టాయి. ఒక్కదానికొక దానికి పడదు. ద్వేషాలు రగులుకొని కొట్లాటలకు తావిచ్చాయి. నీ సృష్టి ఇక్కడ ఎంతో గజిబిజి. ఈ గందరగోళాన్ని సరిచేయడానికి నీవు చేసిన తప్పులు దిద్దుకోడానికి ఎన్ని యుగాలు గడిచాక ఇక్కడికి వస్తావేవో నీవు రావద్దు. అవమానం పొందుతావు. అసలు నిన్ను ఎవ్వరూ గుర్తించరు. నిన్ను మించిన స్తృష్టి బ్రహ్మలు ఇక్కడ వేలాది మంది వున్నారు. నీవు అవాజ్ఞ్మానసగానే వుండటం మేలు. నా మాట చెవిపెట్టి వచ్చావో నీ నాల్గు ముఖాలు చూసి ఈ కాలపు వాళ్ళు మనిషి ముఖాలతో జంతువు కన్నది. అని నిన్ను జంతుశాలలో పెడతారు ప్రదర్శనకు. నీ నాలుగు నోళ్ళతో "నేనే బ్రహ్మను" నేను సృష్టికర్తను" అని మొత్తుకున్నా ఒక్కడూ నీ మాట వినడు.

నీ కన్న మించిన సృష్టికర్త ఎవరూ అంటావా? "నేనే" కవి బ్రహ్మను"

**తమ్మి చూలికేలు దమ్మిన గల నేర్పు**

**కవికలంబున గలదు గాన**

**నీశ్వరత్య మతనికే చెల్లు –**

సృష్టిలో నీవు దాచిన రహస్యాలన్ని తెరచి చూపించగలను. నీ గుట్టు రట్టు చేయగలను. నిన్ను గురించి తెలుసుకోలేకా, నమ్మీ నమ్మలేక కలహాలు పడిపడి విసిగి వేసారిన ఈ మనుష్యుల హృదయాల్లో అమృతం వంటి నూతన భావాలు చిలకరించి వారి దుఃఖాన్ని తగ్గించగలను.

నాకు మత పిచ్చిగానీ, వర్ణాల గొప్పతనాల వాగా డంబరము గానీ, నా కవిత్వంలో లేదు. స్వార్థ చింతనా అసలే కనబడదు. నా కృతులలో శబ్దాకృతిలో వున్న బ్రహ్మానంద లక్ష్మీ సత్యరూపంలో తాండవిస్తుంది. క్షణము గడిచిన దానిని మరల వెనుకకు మరల ఈ భూమిపై ఎవరికీ సాధ్యం కాదు. కానీ దాటిపోయిన యుగ యుగాలనాటి చరితను మరలాపుట్టించ కవి యే సమర్థుడు. అట్టి శక్తివంతుడను అయిన కవి స్రష్టను నేను.

సృష్టికర్త అనేవాడు వుండి వుండినట్లయితే నీచే సృజింపబడిన మానవునికి నిన్ను ప్రశ్నింప హక్కు వున్నది. ఇదిగో నిన్ను ప్రశ్నిస్తున్నాను.

కోటి యుగాలకున్ రసము గ్రుంగిన నీవు వసుంధర మహా నాటక కావ్యరాజమున నాలుగు నాళులు పాత్ర ధారినై చాటున కేగు నావెడగు సాహసమున్ క్షమియింపు మిందులో లోటులు దిద్దుకొమ్ము కవిలోకము మెచ్చ జగత్తున ప్రభూ.

మాకు మరో కొత్త లోకం కావాలి. ఆ కొత్తలోకంలో కొత్త మానవులు కావాలి. ఆ కొత్తచోటు అనంతమైన దుఃఖాగ్నికి కారణమైన తృష్ణను సంహారము చేసేటువంటి లోకము. అపాయము లేని మూగ జీవులను కత్తులకు బలి ఇవ్వనటువంటి సమాజం. మానవులందరూ ఒకే తల్లి బిడ్డలవలె ముద్దు ముద్దుగా జీవించేట్వంటి సమాజం. ఆకటి చిచ్చుకు కుక్షికుంచికుపోయిన పేదలు లేనిచోటు. నిర్మలమైనటువంటి మానవులు తిరిగే స్థలం. ప్రేమ రసవాహినులు వెల్లి విరిసిన స్వర్గము. ఈ కొత్త లోకములో కావాలి.

రాక్షసంబైన స్వార్థ జ్వాల చల్లారి విశ్వ ధర్మము కండబెట్టె చోటు కావాలి. వంచనాకవచంబు ప్రక్కలు కావించి సత్యజ్యోతి వెలిగే చోటు కావాలి. ఎదిరి కష్టసుఖములన్నీ స్వీయములుగా భావించి నరుడు పంచుకొనే చోట కావాలి. సిరులు పండి చింతలు లేని స్వర్గము ఎక్కడో కాదు, నాకు ఇక్కడే కావాలి.

మరి ఈ నా కొత్త లోకాన మానవులు వారి హృదయాలు నూతన మానవతా స్ఫూర్తితో వెలిగి పోవాలి.

**విశ్వమందు గల్గు ప్రేమ సర్వస్వంబు**

**ముద్దజేసి హృదయములను మలచి**

**మెరయు సత్యమెల్ల వెదికి రేకుల గొట్టీ**

**సృష్టి చేయు మయ్య జ్వికలను.**

కల్మష భావాలు ఒక్కదానితో ఒకటి పెనవేసుకొని మానవుని మేధస్సును కలుషితం చేస్తున్నాయి. అటువంటి కాలుష్యమునకు వసతి దొరకనటువంటి తెనెవంటి మనస్సును ఈ మానవుల్లో సృష్టింపబడాలి అసూయ. ద్వేషాల ఘర్షణతో కథలు పొగలతో వేడి

ఎక్కని దయా వీక్షణాలు కావాలి. అపకారమునకు ప్రతి అపకారము చేయని క్షమా అనే దివ్యగుణము మా హృదయాలలో మొలకెత్తాలి. మృత్యుని జయించే శక్తి మాకు కావాలి. యీ సర్వ సర్వహంసహా చక్రము సహన శక్తితో నిర్వహించుకోగల గుణాన్ని మా ప్రతి రక్త కణము నందు నిండిపోవాలి.

తేనెటీగలకు మకరంద విందు చేయునట్టి సుమాలలోని చుట్టరికము, స్వాతి మేఘాలు ఆలిచిప్పలకు ముత్యాలు వంటి బిడ్డలనిచ్చే అపురూపమైన దాంపత్యం–

కష్టజీవుల మేనిపై గండుచెమ్మట పిల్లతెమ్మరలతో విసరి, సేదదీర్చె ప్రేమ... లేలేత ఆకుల నీడలయిచ్చే వృక్షాల సేవా ధర్మం... యీ మహోన్నత గుణాలను జడ పదార్థాల కిచ్చావు. ఈ గుణాలను మానవలోకానికి అందజేయాలి. ఎంచేతనంటే దాన గుణము, దయానేత్రము సేవా దృష్టి ఇవిలేని మానవ మనుగడ ఎందుకు? ఈ గుణాలు లేని విజ్ఞానము  అనర్ధదాయకము.

ఎన్నో మానవత్వ గుణాలను జంతువులు ప్రదర్శించడం మనిషికి అవమానకరం కాదా! ప్రేమ కుమ్మరించి పెంచుకోవాల్సిన లేత దూడలను కటికి పస్తులతో ఎండగట్టి చంపి వాటి చర్మాలలో గడ్డి దూర్చి తమ స్వార్థం కోసం గోమాతను, గేదెను మోసగిస్తున్నారు. అయినా ఆ తల్లి ఈ ఘోరకృత్యాన్ని చూసి గుడ్లనీరు కుక్కుకుంటాయీ, మాతృవే దనాగ్నిలోన్ కాలిపోతూనే సుదీరస పూర్ణితమైన క్షీరాన్ని మానవుల కోసం అందిస్తున్న ఆ త్యాగం, అసహనం, మా జాతికి కొంచెమైనా రావాలి.

నవ్వపు జంతువులు నరుడు నవ్వును, నవ్వులు చిత్త వృత్తికి దివ్వెలు...

ఒక్క ముద్ద అన్నం పెట్టకున్నను ఆకలితో అలమటించి పోతూ తన యజమానిని విడువని కుక్కల యొక్క విశ్వాసం మా చుట్టాలలో రవ్వంత నింపాలి.

**ఇలుదీర్పం బని చేయు యంత్రములుగా సృష్టించి, పర్దాలలో**

**పలబంధించుట జేసి భారత సతుల్, స్వార్థ శయుల్ సెప్పునీ**

**తులతో స్వర్గముంజూరలాడెదరు. సంతోషింత్రు నెమ్మిన**

**సొమ్ములతో మెమ్మేలతో పురాతన కథాపుణ్య ప్రసంగాలతో.**

వ్యవస్థ యొక్క పక్షపాత స్వార్థ బుద్ధికి బలైపోయిన మా స్త్రీజాతికి ఈ కొత్త లోకంలో గౌరవ స్థానం సమానత, స్వేచ్ఛా లభించి తీరాలి. నే కోరుకుంటున్న అన్ని నూతన మానవతా మార్పులు కన్న స్త్రీ జాతి గౌరవం అత్యంత ఉన్నతమైనది. ప్రియమైనది.

నా రచనలోని స్త్రీ పాత్రలు ఈ సమాజానికి ప్రతిబింబాలు, ప్రతిధ్వనులు.

గజనీ మహ్మదు తన తండ్రి ఫిరదౌసి కవి అవమానించి మోసగించి దేశం నుంచి తరిమి వేయబడినాడు. తండ్రి మరణానంతరం పశ్చాత్తప్తుడైన మహ్మదు చక్రవర్తి పంపిన

అశేష ధనరాశిని ఒక్కమాటతో తిరస్కరించి పంపింది ఫిరదౌసి కూతరు. ఇది నా తండ్రిని కష్టపెట్టిన స్వాపి తేయంబు. "ఇది ముట్టుదునా". అని ఆత్మగౌరవము నిండిన త్యాగాన్ని ప్రదర్శించింది.

మరణ ముఖి అయిన ముంతాజ్ బేగం భర్త షాజహానుకు ఈ సంపద లెల్ల పాచికలు, ఈ అధికారమంతా ఒక స్వప్నము అంటూ ఒక జీవన వేదాంతాన్ని బోధిస్తుంది. అటువంటి స్త్రీలకు ఈ కొత్తలోకములో న్యాయము సమంగా అందాలి–

సత్యాల హింసలు రెండే ముత్యాల సరాలు సకల పుణ్యములకు గత్యంతరములు అలుగులతో జయము రాదు. శాంతి రాదు. అఖిల ప్రపంచము నశిస్తుంది. సద్ధర్మమే ధర్మం... ఈ కొత్త లోకంలోని నరుడు... నా జాతి, నా యూరు, నా దేశమని పొంగు భేద భావం సమసిపోయి, "మానవులొక్క తల్లికి పుట్టిన అన్నదమ్ములను భూరి సదాశయమును" పొంది సర్వజన శ్రేయోదాయకమైన వసుదైక కుటుంబమును రూపొందించగలరు.

అనుభూత్యా వేశంబుల జనితములు లలితకళలు....హృదయము నుండి ఉనికివచ్చే కళలు.

అవి పోటీలకు, మెచ్చుకోళ్ళకూ లొంగవు... కులమతాలకు అతీతమైన సర్వమంగళకరమైన సత్యమును కమ్మని వాక్కుల పల్కినదే కవిత్వము. అట్టి విశ్వ సుందర రూపాలను సృష్టించే కవి స్రష్టలకు కళా బ్రహ్మలకు నా కొత్త లోకంలో గౌరవ, సన్మానం... ఆ కళా బ్రహ్మ శిల్పి సామాన్యుడా, అతని సుత్తి నుండి దైవీ దేవతలు...

"సున్నితంబైన సుత్తినుండి బయలు వడె నెన్ని ఎన్ని దేవస్థలములు సార్థకము గాని ఎన్ని పాషాణములకు నాడు పసుపు కుంకాల పూజ,"

ఆనాటి నుండీ యీనాటి వరకూ యీ కళాబ్రహ్మ లభించిన సన్మానం ఏమిటి?

"ఒకనాడు శిల్పి నిలయానికి పోయిచూచాను. అక్కడ శిల్పి వివిధ ప్రతిమాశతాలను చెక్కుచుండె. మహా శిలాంతరమున దాగియున్న సుర నాగదేవతలను, హరి హర బ్రహ్మలు అతని చేతి నుండి మొలచి వచ్చుచున్నవి. ఆశ్చర్యం గొలుపుతూ, కానీ ఆ శిల్పి దేహాన పిడికెడు కండలేదు. గంపెడు బిడ్డలు, మట్టికొంప, చింపిగుడ్డలు, ఓ గంపెడురాళ్ళ తుంపులు, సుత్తెలు, ఉలులు... అతని యావదాస్తి!–

ఒక్కొక్క సుత్తి దెబ్బకు ఒక ఉజ్జ్వల మూర్తి మెల్లగనిక్కి శిలాంతరాళ కమనీయ శరీరం దాల్చు తుండగా... ఆశ్చర్యపోతూ ఇంతటి శిల్పికి యీ దారిద్ర్యమా? కన్నీరు నించాను.

శిల్పి చక్రవర్తి శిల్పి సామ్రాట్టు - బిరుదులు ఎన్నో! రాలు రప్పలు అతని సామ్రాజ్యం! చింకిచాప అతని సింహాసనం.

ఆ శిల్పి చెక్కిన రాతి దైవాలకు పసుపు కుంకుమ పూజలందుకొనడం కన్నులార గాంచి శిల్పి హృదయం ఆనందార్ణవమౌతూ వుండేది.

ఆ శిల్పి చెక్కిన దశరథ రాముని విగ్రహ ప్రతిష్ఠాపన ఉత్సవాలు నాలుగు రోజులు జరిగాయి. ఆ రాఘవ స్వామికి రథోత్సవం జరుగుతున్ననాడు....

ఆ రథ చక్రాలు బెత్తెడు కుంగి దుమ్ము ఆకాశాన్ని అంటగా, పుర వీధుల ఊరేగు సమయాన జయ జయ ధ్వానాలు, భక్తి పారవశ్య నృత్యాలతో జనబాహుళ్యం ఆనంద తాండవ చేస్తున్న సంబరంలో... ఎవడో బికారి ఆ రథ చక్రాల క్రింద పడి ప్రాణం విడిచాడు...

అప్పుడా ప్రజలు, అర్చకులు యావన్మందీ కోపోద్రేకులై...

ఈడిచి పారవైచిరి.

"స్వామి రథానికి అడ్డము వచ్చిన పుణ్యాత్ముడే రథోత్సవ వేళ చచ్చినాడు... ఎవరో అనాధుడు లేచిన వేళ ఎట్టిదో? అయినా వాని కర్మ!" విచిత్ర రీతులు వినవచ్చినవి.

అతని రక్త మాంసముల ఆహుతి గొన్న రథము కాని, రాఘవ ప్రభువు గాని, ఆ అర్చక కోటిగాని, ఆ శవము శిల్పిది అని తెలిసినా ఒక్క వెచ్చని కన్నీటి చుక్క రాల్చలేదు. ఓ ప్రభూ! యీ తరహా కృతఙ్ఞత సహిస్తూ వుండగలవా? ఇటువంటిది ఇక సాగరాదనే నా కోరిక.

ఊరికి ఉత్తరాన శ్మశాన వాటికలో శిల్పి శరీరం పడివుంది. యీ భూమికి భారంగా, రాపులుగుల మధ్య - ఆ శిల్పి శరీరం ప్రక్కనే పుట్టెడు దుఃఖంతో శోకిస్తున్నదొక స్త్రీ మూర్తి, ఆమె కళాభారతి.

నగ్న సత్యం నాలుకలేనిదై మూర్ఛబోయినది ఆరుద్ర భూమిలో. వృక్షాల ఆకుల నుండి నీహార భాష్పములు రాలుచున్నవి.

రాబోవు కొత్తలోకంలో కవులు, కళాకారులు సన్మాన గౌరవాభినందనలు సమంగా ఆదుకోవాలి...

కొత్తలోకాన యుద్ధానికి తావులేదు. శాంతికే స్థానం. నూతన ప్రయోగాలు చేసి, నూతన పరిశోధనలు సల్పి, అధునాతన సౌఖ్యాలకు మార్గం వెతకాలేకాని, తమ అద్భుత శాస్త్రఙ్ఞానాన్ని నాశనానికి దారి చూపించరాదు.

పంచభూతాల పొట్టలు పెకలించి సృష్టిలోని శక్తులన్నింటినీ సేకరించి ఒక బ్రహ్మాస్త్ర శస్త్ర సముదాయాన్ని కనుగొన్నాడు ఒక శాస్త్రవేత్త.

ఒక్కొక్క అస్త్రము ప్రయోగింప అమాయక ప్రజలు ముక్కలు ముక్కలై కరిగిపోయిరి. బూడిద రాసులైనవి పట్టణాలు, పల్లెలు. ఆ శిధిల కుడ్యాలు ప్రేక్షణ భీషణంగా మిగిలి, మానవ దుష్టశక్తులను శపిస్తున్నవి.

ఆ మేధావిని స్వదేశీయులు, సంగ్రామ ఉత్సాహంతో సన్మానించారు. ఆ ఆనందంతో అతడు మరిన్ని విషాస్త్రాలు తయారుచేయ శాస్త్ర నిలయంలోనికి ప్రవేశించెను. అక్కడ ఆ గోడపై ఒక దయామయుని చిత్రపటం పెదవి కదిల్చి – కన్నుల కన్నీరు నించుతూ – గుండెలు ద్రవించే గంభీర స్వరాన ఆ బొమ్మ పలికింది.

"ప్రకృతి నీకు జ్ఞానాన్ని ఇచ్చింది. యీ పాప క్రియకై కారదు. నీ యీ దయారహిత దుష్కృత్యాలు చాలింపుము. ప్రేమకు పాదులుచేయి, రేణువులోన నీవూ ఒక రేణువు అన్నమాట మరువకుము.

గాంధి బోధలకు తలపంకిస్తావు. సిద్ధార్థుని చూచి నమస్కరిస్తావు. రంగు భేదమని యీర్ష్యతో దీన నీగ్రో ప్రజలను వెలివేస్తావు. అంచేత నీ స్వభావాన్ని నాశనం చేయగల అణ్వస్త్రములను తయారు చేసుకో!

విశ్వమానవ సౌభాతృత్యమును అభ్యసించి, స్వరాజ్య సుఖాలను అనుభవించు" అని విచిత్రముగా పలికిన ఆ ఏసు చిత్ర పటాన్ని చూచి, శాస్త్రజ్ఞుడు సిగ్గుపడినాడు, మనసున నూతన శాంతి ఛాయ అలుముకొన్నది.

దీపములు ఆరిపోయినవి. ఆ మందిరాన చీకట్లు ముసిరినవి. ఆ యంత్రములన్ని శాస్త్రకారుని చూచి వికటాట్ట హాసము చేసినవి.

ఆ విజ్ఞాన సుజ్ఞానియై తన జ్ఞాన సంపదను, శక్తిని లోక కళ్యాణార్థము వెచ్చించెను.

* * *

# విశ్వనరుణ్ణి నేను

**అసతోమా సద్గమయ**

**తమసోమా జ్యోతిర్గమయ**

**మృత్యోర్మా అమృతంగమయ**

ఈ సంక్షుభిత జీవన సాగర తీరంలో నిలబడి ఏకాకిగా వేసిన కేక!

మూఢ విశ్వాసాలతో, దురాచారాల ఊబిలో, చిక్కుకున్నా నా యీ దేశంలో ఎన్ని అవలక్షణాలున్నా.... నా యీ జన్మ భూమి నా కందించిన సుందర స్వప్నాలను మరువలేను. నా యీ భూమిని నేను ప్రేమించకుండా నిలువలేను..... 'కాళి దాసాది సత్కవులకని కీర్తి గాంచిన పెద్ద గేస్తురాలు' .... బుద్ధాతి ముని జనంబుల తపంబునకు మోద భాష్పములు విడిచిన భక్తురాలు... సింధు గంగానదీ జల క్షీరము ఎప్పుడూ కురిసి, బిడ్డల పోషించుకొనుకున్న పచ్చి బాలెంతరాలు".

నా దేశం నేను గర్వించదగినదే...

**బహుదేశ మత మహాపరిషత్తు తలయూచ**

**పలకి వచ్చినది మా భరతసుఁతుడు**

**కండబట్టున నైదు ఖండాల నోడించి**

**కొలువులందినది మా కోమటన్న**

**సీమలో నాచార్య సింహపీఠికమీద**

**నిలిచివచ్చినది మా తెలుగువాఁడు**

**విశ్వసన్మానంబు వలెయు నోబెలు కీర్తి**

**రంగ మెక్కినది మావంగసుకవి**

**చెట్టు చేయల సుక దుఃఖ జీవితములు**

**నిజము దేల్చినవాడు మా నేలవాడు**

**నన్ను దొలగించి లెక్కించినారు గాని**

**మొదట నెల్లర మన్న దమ్ములము మేము**

మరి నా తెలుగు భూమిని ప్రేమించకుండా వుండగలనా? – కీర్తి శిఖరాలపై నిలచిన నా తెలుగు తల్లిని మరువ గలనా?

**చీనా పెగోడాల సిగమీద పుష్పమై**

**పొడమె, నీఊతి చెక్కడపు చెణుకు**

**అరవపాటకుల తంబురకు ప్రాణమునోసి**

**కులికె, నీ చిన్నారి తెలుఁగు బాణి**

**హిమవద్గిరులదాక జృంభించి పగవాని**

**తరిమి వెన్నాడె, నీ కఱకు టలుగు**

**మొగలురాజుల సభాభూముల నూరేగె,**

**నీ జగన్నాథ పండితుని పలుకు**

**ఎందుఁజూచిన నీ యశస్యందరనములు**

**నడచిపోయిన జాడ లిప్పుడును గలవు;**

**దిక్తటంబుల మరల నెత్తింపవోయి**

**తెలుగు మన్నీల పసుపునిగ్గులపతాక.**

**"Breathes there the man with**
**Soul so dead, who never to**
**himself hath said**
**This is my own my native land"**

**- Walter Scot**

ఇది నా భూమి, నా మాతృదేశం... ఇది నా ప్రియ భారతి.

**అలుగల జయ మాశింపకు**

**మలుగులచే నలుగు శాంతి యఖిల జగంబున్**

**నలుగున్ సద్ధర్మంబే**

**యలుగు సుమీ ! ముజ్జ గజ్జయా కాంక్షులకున్**

ఈ సందేశాన్ని భావంలో, చేతలో అనుసరిస్తూ చివరి మజిలీ చేరాను. నేను కవిని. విశ్వ మానవతా వాదిగా, విశ్వ మానవులంతా నా సోదరులుగా భావించిన కవిని... నే పుట్టిన ఆ చిన్ని గ్రామపు పొలిమేరలు దాటి... పెరిగిన ఆ పట్టణం ఎల్లలు అధిగమించి.. ఆంధ్రదేశపు సరిహద్దులు తరించి... భారతదేశ హద్దులు చూచి... ప్రపంచపు ఎల్లలు వరకూ ఎదిగాను....

అది 1950 కృష్ణాజిల్లాలో ఒక గ్రామం. నన్ను సన్మానించ ఆహ్వానించింది. ఆ సభలో గోపరాజు రామచంద్రరావు. "గోరా" సుప్రసిద్ధులు. నాస్తిక ఉద్యమ నాయకులు పరిచయం అయ్యారు. ఆయనతో పరిచయం నా జీవితంలో సరికొత్త మలుపు.

సభానంతరం, 'హరిజన వాడలో సమిష్టి భోజనాలు' ఏర్పాటు చేశారు. నిర్వాహకులు. తీరా సభ ముగిశాక అధ్యక్షులతో సహా అనేకులు, అనేక సాకులతో, సమిష్టి భోజనాలకు రాలేదు. నేను, గోరా మిగిలాము. గోరాతో నా పరిచయం మరింత స్థిరపడింది. రాను రాను నాలో అస్థిరంగా ఊయలలూగుతున్న భావాలకు స్థిరత్వమొచ్చింది. ఆ బంధం స్థిర బంధంగా మారింది.

1960లో నా కడ గొట్టు కూతురు, హేమలతను, గోరా పెద్ద కుమారుడు లవణంనకు వివాహం నిశ్చయమైంది. ఈ వియ్యం, నేను కోరిన సమసమాజ నిర్మాణానికి పునాది.

గోరా మానవతావాది. అతని ఉద్యమానికి ఒకే ఒక్క వాక్యం జయకేతనం, "చేసింది చెప్పి ! చెప్పింది చేయి" సత్యాన్ని నిరూపించే వాక్యం, ప్రపంచంలోనే మరొక వాక్యం లేదేమో! సాంఘిక నీతికి యీ వాక్యం ఒక పరీక్ష. ఒక ప్రశ్న.

**"చేదై మేలు ఘటించే ఔషధము నాస్తిక్యంబు జుమ్మీ మృషా**

**వేదాంత జ్వర పీడితంబుయిన ఉర్వీమాత కంచున్ – "**

గోరా తిరుగులేని, అపజయ మెరుగని సత్యాగ్రహోద్యమం సాగించాడు.

లవణం, హేమలతల వివాహం అల సేవాగ్రాం గాంధీజీ ఆశ్రమంలో జరిగింది.

**ఘనవిజ్ఞాననిధుల్, సబర్మతి మునీట్కార్యన్యాసంప్రాప్తపు**

**ణ్యనిధుల్, లోకహిత ప్రవక్తకులు, కళ్యాణోత్సవాధ్యక్షులై**

**తనరంగా లవణంబు హేమలత లాదర్శాంధ్ర సంసారజీ**

**వనయాత్రారతు లై వెలింగి రిట సేవాగ్రామపూజ్యస్థలిన్**

ఈ వివాహం.... నాలోని "విశ్వ నరుణ్ణి" సమత్వ వేదికపై నిలిపింది. నామాటకు యీ చేత, నా ఆ కాంక్షకు రూపం చెక్కింది.

"నీదే కులమన్న ప్రశ్నకు...

"నేను విశ్వ నరుణ్ణి" అనేది నా జవాబు

**"సౌఖ్య సౌరభంబు సర్వ భూముల నిండ**

**పాడుకొందు, దిశలనాడుకొందు**

**నిఖిల భువన మెట్లు నిర్ణయించిన నాకు**

**తరుగు లేదు! విశ్వ నరుడు నేను."**

విశ్వనరునిగా నా జీవితపు దిన చర్య ఒకటి వుంది...

**నివసించుటకు చిన్న నిలయ మొక్కటి దక్క**

**గడనసేయుట కాసపడను నేను**

**ఆలుబిడ్డలకునై యాస్తిపాస్తులు గూర్ప**

**పెడత్రోవలో పాద మిడను నేను**

**నే నాచరింపని నీతులు బోధించి**

**రానిరాగము తీయలేను నేను**

**సంసారయాత్రకు చాలినంతకు మించి**

**గ్రుడ్డి గవ్వయు గోరుకొనను నేను**

**కులమతాలు గీచుకొన్న గీతల జొచ్చి**

**పంజరాన గట్టువడను నేను**

**నిఖిలలోక మెట్లు నిర్ణయించిన, నాకు**

**తరుగులేదు, విశ్వనరుడ నేను !**

ఈ నా దిన చర్యతో "ఒక చోట" నేను నివాసముంటాను... అది ఎటువంటి నివాస స్థలం...?

**రాక్షసం బైన స్వార్థజ్వాల చల్లారి**

**విశ్వధర్మము కండబెట్టు చోటు**

**వంచనాకవచంబు వ్రక్కలుగావించి**

**అలఘుసత్యజ్యోతి వెలుగుచోటు**

**పసిపాపమోముపై కుసుమించు నవ్వులో**

**వెలుగు సౌజన్యంబు గెలగుచోటు**

**గురితప్పనట్టి దాశరథి బాణమువోలి**

**దృఢదీక్ష జయము సాధించు చోటు.**

**ఎదురి కష్ట సుఖము లెల్ల స్వీయములుగా**

**కోరి నరుడు పంచుకొనెడు చోటు**

**చింతలేని చోటు, సిరులు పండెడు చోటు**

**వెదకికొందు గుండె కుదుటబడగ.**

మరొక్కమారు చెప్పగలను... "కవీ! ఏది నీ కులం?' అని కాదు అడగవలసింది. "కవీ", ఏదీ నీ కలం?" అని ప్రశ్నించాలి.

**మట్టిముద్దగాదు మహిత సత్కవిశక్తి**

**మట్టుచున్న నణగిమణగి యుండ**

**రత్న ఖచితమైన రబ్బరుబంతియై**

**వెంట వెంట నంటి మింటి కెక్కు.**

* * *

**నాస్తిక్య మంత్రశక్తిన్**
**హస్తులకును సింహములకు నన్యోన్యతన**
**భ్యస్తంబు చేయు నీదు ప్ర**
**శస్తోద్యమమునకు జయము, జయము, మరందీ !**



## విశిష్ట సంఘ సంస్కర్తలు

**(గోరా – జాషువా)**